# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి: 36 సంచిక: 5 జూన్ - జూలై 2013

పేజీలు: 68 (299) వెల: రు. 20



కామ్రేడ్ గంటి ప్రసాదంకు
అరుణారుణ జోహార్లు!

"ప్రాణత్యాగం చాలా ఉన్నతమైనది
అంతకన్నా ఎన్నోరెట్లు కష్టమైనది అహాన్ని, గుర్తింపును,
నేను అనే భావనను వదులుకోవడం"



కామ్రేడ్ ఆలూరి భుజంగరావుకు
అరుణారుణ జోహార్లు!

## కామ్రేడ్ ఆలూరి భుజంగరావు అంతిమయాత్ర, సంస్మరణ సభ దృశ్యాలు





కామ్రేడ్ గంటి ప్రసాదం పాల్గొన్న చివరి సదస్సు
జూలై 4న నెల్లూరులో విరసం 44వ ఆవిర్భావ దినం సందర్భంగా జరిగిన సదస్సు దృశ్యాలు


















మొదటి వరుస : నెల్లూరులో కా. గంటి ప్రసాదంపై దాడి అనంతర దృశ్యాలు
రెండవ వరుస : 1. సుభాష్‌నగర్ స్థూపం వద్ద, 2. ఢిల్లీలో నిరసన, 3. అమరుల బంధుమిత్రుల సంఘం నివాళి




















299 సంపుటి : 36 ◆ సంచిక : 5 ◆ జూన్ - జూలై, 2013

సంపాదకుడు
చలసాని ప్రసాద్
వర్కింగ్ ఎడిటర్
డి.వి. రామక్రిష్ణారావు
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500 040.
* కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా
రచనలు పై చిరునామాకూ,
ఇ-మెయిల్ ద్వారా
arunatara1977@gmail.com కూ
పంపవచ్చు
http://www.facebook.com/
arunatara.virasam
సంపాదకవర్గం :
ఉజ్వల్, బాసిత్, కూర్మనాథ్
చందాలు పంపాల్సిన చిరునామ
మేనేజర్
ఎస్. రవికుమార్
5-1307, దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.
సెల్ : 9866021257
విరసం కార్యదర్శి చిరునామా
పి. వరలక్ష్మి
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.
డి.టి.పి. అండ్ లే అవుట్
ఎస్. రాజు
కవర్ డిజైన్
సృజన గ్రాఫిక్స్
శ్రీను, ప్రొద్దుటూరు, కడప జిల్లా.
ఫొటోలు
పావని, ప్రజాసంఘాల కార్యకర్తలు, మిత్రులు
ఈ సంచిక వెల : రు. 20/-

**సంపాదక లేఖ...**

ఇటీవల మనం ఇద్దరు కామ్రేడ్‌లను కోల్పోయాం. ఒకరిది సహజ మరణం కాగా, మరొకరిది అసహజ మరణం. సహజ మరణంగా కనిపించే వాటిని కూడా ఈ దోపిడి వ్యవస్థలో అనేకానేక అసమానతల, అణచివేతల, రకరకాల పీడనల, ఒత్తిడుల జీవన క్రమంలోంచే చూడాల్సి ఉంటుంది. ఈ చర్చ అలా ఉంచితే మనం కోల్పోయిన ఆ కామ్రేడ్స్ ఆలూరి భుజంగరావు (84), గంటి ప్రసాదం (64). వీరు బతికినంత కాలం ఈ దేశంలోని నూతన ప్రజాస్వామిక విప్లవ విజయం కోసం కలలు కన్నారు. ఆ కలలను సాకారం చేసుకునే దృఢమైన ఆచరణలో ఉన్నారు. కామ్రేడ్ ఆలూరి భుజంగరావు సాహిత్యజీవిగా బయలుదేరి విప్లవ సాహిత్యోద్యమ కృషిలో భాగమైతే, కామ్రేడ్ గంటి ప్రసాదం ఉద్యమజీవిగా ప్రారంభమై విప్లవసిద్ధాంతం, విప్లవ సాహిత్యాలను నిశితంగా పట్టించుకుని చివరివరకు వాటిని బలోపేతం చేయడానికి కృషి చేశారు. విరసంతో అనేక విషయాలు చర్చించి విరసం అవగాహనను పరిపుష్టం చేశారు. నక్సల్బరీ శ్రీకాకుళాలు దాటి, జగిత్యాల జైత్రయాత్రలు సాగి, దండకారణ్య బాట పట్టి, లాల్‌గఢ్, జంగల్ మహల్, నారాయణపట్నాలుగా ఎగసి విప్లవోద్యమం జనతన సర్కారుగా విచ్చుకుంటున్న క్రమంలో వాళ్ళ ఆలోచనలు, ఆచరణ భాగమై ఉన్నాయి. వాళ్ళిద్దరి కృషిని స్మరించుకోవడంలో భాగంగా ఈ ప్రత్యేక సంచికను రూపొందించాం.

కామ్రేడ్ ఆలూరి భుజంగరావు జూన్ 20న గుంటూరులో అనారోగ్యంతో కన్ను మూశారు. ఆయన దుర్భర దారిద్ర్యం నుంచి ఎదిగి విప్లవ సాహిత్యోద్యమ కృషిని కొనసాగించారు. కథలు, నవలలు, అనువాదాలతో విస్తృతంగా సాహిత్య కృషి కొనసాగించారు. రహస్య ఉద్యమంలో భాగమై 'ప్రభాత్' హిందీ పత్రికను ఏడు సంవత్సరాలపాటు నిర్వహించారు. కుటుంబాన్ని విప్లవ ఆశయంవైపు నడిపారు. చివరిదాకా విప్లవదీక్షతో కొనసాగారు. ఒకసారి విప్లవ రచయితల సంఘం సర్వసభ్య సమావేశానికి వచ్చినప్పుడు విరామ సమయంలో సభ్యులు హింసా ప్రతిహింసలపై చర్చ జరుపుతున్నప్పుడు ఆయన స్పందిస్తూ 'వాళ్ళేమైనా మనలాగా ఇడ్లీ, ఉప్మాలు తిని, టీ, కాఫీలు తాగి తీరుబడిగా నిర్ణయాలు చేస్తారటండీ? అనేక ఒత్తిడుల మధ్య పని చేస్తున్నప్పుడు ఆచరణలో కొన్నిసార్లు పొరపాట్లు జరుగుతాయండీ. వాళ్ళు సరిచేసుకుంటారండీ' అని గట్టిగా విప్లవోద్యమంపై తన వైఖరిని చాటారు. చివరికిదాకా దృఢంగా నిలిచారు.

కామ్రేడ్ గంటి ప్రసాదం(64) ది నాలుగు దశాబ్దాల విప్లవ కార్యాచరణ. విద్యార్థి దశ నుంచి చివరికి రాజ్య ప్రేరేపిత హంతకముఠాల చేతిలో పాశవికంగా జూలై 4న హత్యకు గురయ్యేదాకా విప్లవ విజయమే ఊపిరిగా బతికిన ఆచరణ. మార్క్సిజం, లెనినిజం, మావోయిజాల వెలుగులో, ఆ తత్వాన్ని జీర్ణించుకొని, ఆచరించిన అలుపెరుగని సుదీర్ఘ ప్రయాణం. అటు రహస్య విప్లవోద్యమంలోనూ, ఇటు బహిరంగ ఉద్యమ జీవితంలోనూ విప్లవమే అతని శ్వాస, ధ్యాస. నెల్లూరులో జూలై 4న విరసం 44వ ఆవిర్భావ దినం, కూటాలమర్రి అమరుల సంస్మరణలలో భాగంగా సభకు వక్తగా హాజరై భోజన విరామ సమయంలో నెల్లూరు ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న, చావుబతుకులో ఉన్న అమరుడు కామ్రేడ్ ఆనంద్ అక్క కామాక్షమ్మను పరామర్శించడానికి నెల్లూరు ప్రభుత్వ ఆసుపత్రికి వెళ్ళి వస్తుండగా, ఆసుపత్రి దగ్గర పొంచి ఉన్న ప్రభుత్వ దుండగులు వెనుక నుంచి మెడమీద వేటకత్తితో నరికి, కడుపులో తపంచాతో మూడు బుల్లెట్‌లు దింపి పారిపోయారు. దాదాపు 11 గంటలపాటు మృత్యువుతో పోరాడి చనిపోయారు. తనపై దాడి జరిగాక కూడా 'వాళ్ళు

(మిగతా 6వ పేజీలో...)

విరసం సాహిత్యాన్ని కరపత్రాలను, స్టేట్మెంట్లను, అరుణతార పత్రికను **www.virasam.in** వెబ్సైట్లో చూడవచ్చు. అలాగే వివిధ సాహిత్య పత్రికల బ్లాగులు, సైట్ల లింకులను కూడా చూడవచ్చు.

**email :** arunatara1977@gmail.com; **facebook** address: http://www.facebook.com/arunatara.virasam

**ఈ సంచికలో...**




అరుణతార చదవండి! చదివించండి! చందాదారులు కండి!

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర తీయండి.
విడి సంచిక వెల : రు. 15/-; సంవత్సర చందా: రు. 160/-; జీవితచందా : రు. 1500/-

# గంటి ప్రసాదం, ఆలూరి భుజంగరావుల సంస్మరణలో

- పి. వరలక్ష్మి

విప్లవోద్యమం రూపుదిద్దిన రెండు గొప్ప వ్యక్తిత్వాలను గురించి ఒకేసారి స్మరించుకోవాల్సి రావడం ఒక విషాదం. విప్లవ సాహిత్య వ్యక్తిత్వం, రాజకీయ కార్యాచరణ, వ్యక్తిగత జీవితంలో ఏ ఒక్కదాన్నైనా విడదీసి చూడలేని అరుదైన, ఆదర్శవంతమైన వ్యక్తిత్వం ఆలూరి భుజంగరావు. దారిద్ర్యంతో, అలమటించిన బాల్యం వ్యవస్థ కాఠిన్యాన్ని, ఆకలిని, ఆకలి యుద్ధాన్ని చూసింది. విశాల ప్రపంచమనే విశ్వవిద్యాలయంలో మాక్సిం గోర్కిలా ఆయన పాఠాలు నేర్చుకున్నాడు. జీవిక కోసం హిందీ నేర్చుకుని అనువాదాలు మొదలు పెట్టినా ఆయన ప్రేమ్‌చంద్, రాహుల్ సాంకృత్యాన్‌లనే ఎంచుకున్నాడు. హోటల్ పొగల సెగల మధ్య కాలుతున్న లేత జీవితాలనే కథలుగా రాశాడు. తోటి సాహిత్యబాటసారి శారద స్నేహంలో పేదరికపు కష్టాలను, సాహిత్యాన్ని కలగలిపి పంచుకున్నాడు. కనీసం నిఘంటువు కూడా ఏర్పాటు చేసుకోలేని స్థితిలో అనువాదాలు చేయడం చిన్న విషయం కాదు. అనువాద ప్రక్రియకున్న సాహిత్య గుర్తింపు అంతంత మాత్రమే. నిజానికి అనువాదం అంటే అక్షరాలను, పదాలను అనువదించడమే కాదు. మూల రచనలోని సామాజిక స్థితిగతుల్ని ఇక్కడి సమాజంతో, మనుషులతో లంకె వేస్తేగాని పాఠకులు వాటిని తమ సొంతం చేసుకోరు. ఆయన అనువాదాల్లో నవలలు, కథలు, చరిత్ర, సిద్ధాంతం వంటి విభిన్న అంశాలున్నాయి. భుజంగరావు అనువదించిన రచయితలైనా, సాహిత్యమైనా తెలుగు పాఠకుల సంస్కారంలో ఎంత భాగమయ్యాయో చూస్తే వాటికున్న బలం తెలుస్తుంది.

ప్రగతిశీల సాహిత్యం నుండి అత్యంత సహజంగా ఆయన కమ్యూనిస్టు సావాసం చేసి విప్లవోద్యమ ఆచరణవైపు అడుగులు వేశాక విరసం సభ్యుడైనాడు. ఆయన వయసు రీత్యా, కఠినమైన జీవితానుభవాల వల్లనూ అప్పటికి బాగా అలసిసొలసి ఉండే దశ. ఆ దశలో అజ్ఞాత జీవితాన్ని, విప్లవోద్యమ సాహిత్య కార్యాచరణను ఎంచుకున్నాడు. అనువాదకుడిగా ఆయన పాఠకులకు ఇవ్వాలనుకున్నది, రచయితగానూ చెప్పాలనుకున్నది ఆయన చెప్పాడు. ఏ గుర్తింపునూ ఆయన ఆశించలేదు. భగత్‌సింగ్ జీవితాన్ని, రాహుల్ సాంకృత్యాయన్ చారిత్రక రచనల్ని, వైజ్ఞానిక గతితార్కిక భౌతికవాదాన్ని, ప్రేమ్‌చంద్, కిషన్‌చందర్, యశ్‌పాల్, సరోజ్‌దత్తా వంటివారి అరుదైన రచనా సంపదను తెలుగు పాఠకులకిచ్చారు. అట్లాగే రాగో, అతడు, నేలతల్లి విముక్తి కోసం, బొగ్గుపొరల్లో, దండకారణ్య అమరవీరులు వంటి తెలుగునేల సృజించిన విప్లవ సాహిత్యాన్ని హిందీ పాఠకులకందించాడు. విప్లవోద్యమ కార్యాచరణ, అజ్ఞాత జీవితమూ, అందులో ఆయన సాహిత్య కృషి అత్యంత సహజంగా కలిసిపోయాయి. ఆయన కథలూ, నవలలూ విప్లవం సృష్టిస్తున్న అద్భుత మానవులను పరిచయం చేస్తాయి. ఆయన వాళ్ళతో కలిసి నడుస్తూ వాళ్ళ సంస్కారాన్ని, మానవసారాన్ని మనలో నింపే ప్రయత్నం చేస్తాడు. ఆయన వాటినే తన కుటుంబంలో పంచాడు. తననే కాదు తన కుటుంబం మొత్తాన్నీ అటువంటి ఒక ఆచరణలో భాగం చేశాడు. ఆయనెంత సాదాసీదాయో ఆయన రచనాశైలి అంత సాదాసీదా. ఆయనెంత సూటిగా, స్పష్టంగా ఉంటారో ఆయన రచనలూ అంతే. ఒక కార్యకర్తలా పుస్తకాలు పరుచుకుని విరసం సభల్లో తన సహచరి లలితగారితో పాటు కూర్చునే ఆయనను నిన్నటిదాకా చూసిన ఈ తరం ఆయననుండి నేర్చుకోవలసింది, తమలో నింపుకోవలసింది ఎంత ఉంది కదా అనిపిస్తుంది. నిష్కామకర్మ అంటారే అట్లా పనిచేసుకుంటూపోయాడు. సమసమాజాన్ని మాత్రమే కలగన్నాడు. విరసం సమావేశాలు ఏ మూలనున్నా ఓపిక చేసుకొని వచ్చేవాడు. విప్లవం, విరసం తప్ప ఇంకే జీవితమూ లేదన్నట్లుగా ఉండేవాడు.

జూన్ 20న అమరుడైన కా. ఆలూరి భుజంగరావు సంస్మరణ సభల్లో (గుంటూరు, నెల్లూరు) గంటి ప్రసాదం మాట్లాడారు. 'ప్రాణత్యాగం చాలా ఉన్నతమైనది. అయితే అంతకన్నా కష్టమైనది అహం, నాది అన్న భావన, గుర్తింపును వదులుకోవటం. పదిసార్లైనా ప్రాణత్యాగానికి సిద్ధపడతారు కాని ఇవి త్యాగం చేయడం సాధ్యం కాదు. భుజంగరావుగారు అనేక సందర్భాలలో వీటిని అలవోకగా త్యాగం చేశారు.' అట్లా భుజంగరావు గురించి మాట్లాడుతూ వ్యక్తి ఔన్నత్యానికి గీటురాయి ప్రజల కోసం పనిచేయడం, ప్రజల కోసం జీవించడం, ప్రజల కోసం చనిపోవడం అన్నాడు. విప్లవోద్యమం మలచిన, విప్లవ ఔన్నత్యాన్ని చాటిన ఒక తరం మన నుండి వెళ్ళిపోతున్నది. గోరుమాధవరావు, వెంకటసుబ్బయ్య, భుజంగరావు వంటి వాళ్ళ జీవితాల నుండి కొత్త తరం ఏమి నేర్చుకోవాలో చెప్పాడు. వ్యక్తులు చనిపోతే ఏర్పడే వెలితి వారితో మనకుండిన సాన్నిహిత్యం, అనుబంధం వల్ల కలిగే వ్యాకులత తప్ప నిజానికి వారు పనిచేసిన రంగానికి, వాళ్ళ ఆదర్శాలకు సంబంధించిన వెలితి కాదన్నాడు. అమరత్వం వల్ల ఆశయాలు సజీవమవుతాయన్నాడు. అమరత్వం గురించి చెప్పిన మరుక్షణమే ఆయన అమరుడైపోవడం ఒక దిగ్భ్రాంతి. ఇది నిజమేనా అనే ఉలికిపాటు. కాలం కాఠిన్యానికి, రాజ్యం దుర్మార్గానికి విలవిల్లాడిన బాధామయ స్థితి. నెల్లూరు పట్టణంలో విరసం ఆవిర్భావ దినాన్ని ఎర్రటి మడుగులో ముంచి 'నా స్ఫూర్తి చావదు' అంటూ తాను తెగిపడుతూ అమరత్వాన్ని నిటారుగా నిలబెట్టాడు కా. గంటి ప్రసాదం. అతడు అమరుల బంధువు, మిత్రుడు, ఇప్పుడు అమరత్వపు నమూనా.

శ్రీకాకుళ ఉద్యమ స్ఫూర్తితో గంటి ప్రసాదం తన జీవితాన్ని విప్లవానికి అంకితం చేశాడు. ఉత్తరాంధ్రలో విప్లవ ప్రజాసంఘాల నిర్మాణ బాధ్యతలు నిర్వహిస్తూనే 1972లో విరసం సభ్యుడైనాడు. ఆయన విద్యార్థి, యువజన, కార్మిక, రైతాంగ ఉద్యమ నిర్మాణాల్లో

పనిచేశారు. సొంత పేరుతోను, మారుపేర్లతోనూ కవిత్వం, పాటలు రాశారు. త్రిపురనేని మధుసూదనరావు విరసం కార్యదర్శిగా ఉన్నప్పుడు ప్రసాదంగారిని ఆయన చేస్తున్న రచనల గురించి అడిగారట. విరసం సభ్యులుగా ఉంటూ రచనను అలక్ష్యం చేసేవారి పట్ల ఆయన అసహనంగా ఉండేవారు. ప్రసాదంగారు తన ప్రాంతంలో ఉద్యమకార్యాచరణలో భాగంగా వివిధ కార్యక్రమాల కోసం, వివిధ అంశాలపైనా రాసిన కరపత్రాల కట్ట ఒకటి పంపించారట. దానికి ఆయన ఎంతో సంతోషపడిపోయి అసలైన విప్లవ రచయిత మీరేనండి అని జవాబు రాశారట. రచన దేనికోసం అని ఏదో సందర్భంలో విరసం యువసభ్యులతో మాట్లాడుతున్నప్పుడు ప్రసాదంగారే ఈ విషయాన్ని చెప్పారు. విరసం సభ్యుడిగా బహిరంగ జీవితంలో ఉన్నప్పుడుగాని, అజ్ఞాత జీవితంలో క్రాంతి పత్రిక బాధ్యతల్లో ఉన్నప్పుడుగాని, సైద్ధాంతిక చర్చల్లో ఆయన రాసిన పత్రాలుగాని గుర్తించడం సాధ్యం కాని విషయం. విప్లవోద్యమంలో ఇది సహజమే. భుజంగరావు సంస్మరణ సందర్భంలో ఆయన చెప్పిన 'నేను' రద్దయిపోయేది అక్కడే. బైటికొచ్చాక ప్రజాసంఘాల బాధ్యతల్లో తలమునకలుగా ఉంటూనే ఆయన రాసిన కరపత్రమైనా, వ్యాసమైనా ఉత్సాహంగా అందరికీ చూపించి పిల్లవాడిలాగా సంతోషపడేవాడు.

'72 నుండి విప్లవోద్యమ దశల్లోనూ, మలుపుల్లోనూ అయనున్నాడు. ప్రభుత్వంతో చర్చల సందర్భంలో అరెస్టయి ఔరంగాబాదు కుట్రకేసులో దాదాపు రెండేళ్ళు జైల్లో ఉండి బెయిలుపై విడుదలయ్యాక ఆయన బహిరంగ ఉద్యమ జీవితాన్ని ఎంచుకున్నాడు. అమరుల బంధుమిత్రుల సంఘం నాయకుడిగా ఉంటూనే అత్యంత సంక్షుభిత కాలంలో ఆయన ప్రజాసంఘాలను నిర్మించే పని మీదేసుకున్నాడు. ఈ ఎనిమిదేళ్ళ కాలం ఆయన రాజకీయాచరణలోనే కాదు, ఆయన జీవితాన్నే ప్రయోగాలు చేశాడు. పర్యవసానం అరెస్టో, ఖైదో, లేక బతుకునే పణం పెట్టడమోనని బహుశా ఊహించే ఉంటాడు. గ్రీన్‌హంట్, సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యవేదికల నిర్మాణం కోసం దేశమంతా ఆయన తిరిగాడు. విప్లవ ప్రజాస్వామిక వేదిక (ఆర్‌డిఎఫ్), రాజకీయ ఖైదీల విడుదల కమిటిని (సిఆర్‌పిపి) నడిపించాడు. హైదరాబాదులో ఆర్‌డిఎఫ్ మహాసభలు విజయవంతమైన తీరుకు, కనీసం రాష్ట్ర కమిటీ కూడా ఏర్పడకుండానే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిషేధం విధించింది. గంటి ప్రసాదం ఆర్‌డిఎఫ్ జాతీయ ఉపాధ్యక్షుడు. ఆయన గ్రీన్‌హంట్‌కు వ్యతిరేక ప్రజాస్వామిక గొంతుకలను కూడగట్టే ప్రయత్నం చేశాడు. విరసంతో సైద్ధాంతిక, రాజకీయ చర్చలు చేశాడు. వీటన్నిటికన్నా బహుశా ఎక్కువగానే అయన మనుషుల్ని నిలబెట్టే పనిలో ఉన్నాడు. ఇరవై నాలుగ్గంటలూ మనుషులకోసం తపించాడు. ఆయననెంతో మంది అతి దగ్గరిగా ఎరిగి ఉంటారు. అదేమంత విషయం కాదు. కాని ఆయనకు ఎంతో మంది అతి సన్నిహితంగా తెలుసు. ఆయనకు మనుషులు అర్థమవుతారు. సవాలక్ష గందరగోళాలతో సహా. ఆయనతో మాట్లాడడంలో, పంచుకోవడంలో అన్ని వయసులవాళ్ళు ఏ సంకోచాలూ అక్కరలేని సాన్నిహిత్యాన్ని ఫీలవుతామని చెప్తారు. బహుశా 'నేను' అనే కేంద్రం నుండి ఆయన దేన్నీ చూడడు, అర్థం చేసుకోడు కాబట్టేనేమో. ప్రేమను వర్షించినా, ఆగ్రహాన్ని కురిపించినా మనిషి పూర్తిగా వ్యక్తమయ్యేవాడు. ఏది చేసినా మనిషిని నిలబెట్టాలనే తపనే ఆయనది. వీటన్నిటి కారణంగానూ రాజ్యం అతన్ని టార్గెట్ చేసింది. బందీలోనూ, మరణశయ్యపైనా ప్రజలకోసం తపించే విప్లవ దీక్ష ఆయనది. కోరాపుట్‌జైల్లో ఆదివాసుల విడుదల కోసం తన బెయిలు నిరాకరించి ఆందోళన చేసినా, బులెట్ గాయాలతో, కత్తిపోట్లతో చివరి శ్వాసలో కూడా ప్రజల కోసం బతికించమని డాక్టర్‌ను కోరుకున్నా ఆయనలోని దృఢమైన విప్లవ కార్యకర్తకే అది సాధ్యం. విప్లవం రూపొందించిన నూతనమానవుడు ఆయన.

ఒక చరిత్ర నిర్మాణంలో భాగమైన మనిషిని గురించి చరిత్ర ఏవిధంగా నమోదు చేసుకుంటుందో గాని ఎన్ని వేల మంది జ్ఞాపకాల్లో ఆయన నమోదై ఉన్నాడో కదా అనిపించింది ఆయన అంతిమయాత్రలో. కొందరికి గురువు, కొందరికి నాయకుడు, కొందరికి స్నేహితుడు, ఎందరికో ఆత్మీయుడు. ఆయన జ్ఞాపకాలను, స్మృతులను సంకలనం చేస్తున్న క్రమంలో ఆ మనిషిలో ఎన్నెన్ని తెలియని పార్శ్వాలో. ఒక మనిషి, ఇంత జీవితం అంటే ఆశ్చర్యం వేస్తుంది. అన్నిటికన్నా ఆశ్చర్యంగా ఆయనపై పుస్తకం వేస్తే చంపుతామని హెచ్చరిక. ఆయన జీవితాచరణకే కాదు, ఆయన గురించిన జ్ఞాపకాలు, తలపోతలు, దుఃఖాలు, పిడికిలి బిగింపులు, ఎగరేసిన జెండాలు వెచ్చని అక్షరాలై ఇంకిన కాగితాలకెంత శక్తి!

---

(3వ పేజీ తరువాయి...)

తనను చంపగలరేమో కాని, తన స్ఫూర్తిని చంపలేర'ని ప్రకటించి వెళ్ళిపోయారు. ప్రజా సంఘాల ఐక్య సంఘటనకు కృషి చేసి ముందుకు నడిపిస్తున్నందుకూ, ఆపరేషన్ గ్రీన్‌హంట్‌కూ వ్యతిరేకంగా పని చేస్తున్నందుకూ, విప్లవ లక్ష్యాలను ముందుకు తీసుకెళుతున్నందుకే కామ్రేడ్ గంటి ప్రసాదం రాజ్యం చేతిలో హత్యకు గురయ్యారు. చనిపోయేనాటికి ఆయన అమరుల బంధుమిత్రుల సంఘం గౌరవ అధ్యక్షుడుగా, రెవల్యూషనరీ డెమొక్రటిక్ ఫ్రంట్‌కు ఉపాధ్యక్షుడుగా, కమిటీ ఫర్ ద రిలీజ్ ఆఫ్ పొలిటికల్ ప్రిజనర్స్ కార్యవర్గ సభ్యుడుగా, విప్లవ రచయితల సంఘంతో సహా పలు ప్రజా సంఘాలకు మార్గదర్శిగా చేస్తున్న పనే, బహుముఖ ఆచరణే రాజ్యానికి కంటగింపయింది. జూలై 4న నెల్లూరు సభలో కామ్రేడ్ గంటి ప్రసాదం మాట్లాడుతూ 'ప్రాణత్యాగం చాలా ఉన్నతమైనది. అయితే దానికంటే కూడా కష్టతరమైనవి ఉన్నాయి. ఏమిటవి? అహం, నాది అనే భావన, ఈగో, ఐడెంటిటీలను వదులుకోవడం. పదిసార్లైనా ప్రాణత్యాగం చేయడానికి సిద్ధపడుతారు కానీ, ఇవి త్యాగం చేయడం చాలా కష్టం' అని అన్నారు. ఈ మాటలు మన కార్యచరణకు దిక్సూచి కావాలి.

అలాగే ఏప్రిల్ 16న జువ్వాజి వెంకట సుబ్బయ్య (75) అనారోగ్యంతో గుంటూరులో కన్ను మూశారు. ఆయన నాలుగు దశాబ్దాలకు పైగా అవిశ్రాంతంగా విప్లవోద్యమంలో తనవంతు పాత్రను నిర్వహించారు. 28 సంవత్సరాలపాటు ఉద్యమంలో కీలకపాత్ర పోషించారు.

ఇప్పుడు ఈ అమరులంతా లేరు. కాని వాళ్ళ ఆశయాలు మిగిలే ఉన్నాయి. ఈ అమరులందరికీ అరుణారుణ జోహార్లు అర్పిస్తూ, వాళ్ళ ఆశయాలను ఎత్తిపడదాం!

# గంటి ప్రసాదన్న అందుకో జోహారులూ......

- డప్పు రమేష్

పల్లవి: అన్నా మాయన్న గంటి ప్రసాదన్న అందుకో జోహారులూ
అన్నా మాయన్న గంటి ప్రసాదన్న విప్లవ జోహారులూ

విజయనగరం జిల్ల బొబ్బిలి నీ వూరు
డిగ్రి చదివిన నీవు విప్లవం కొచ్చావు
కార్మికుల కూలీల శ్రామికుల ప్రేమించి
విప్లవా కారునిగ ప్రజలల్లో కలిశావు

॥అన్నా॥

ఆముదాల వలస, బొబ్బిలి, కోమర్తి
కార్మిక సంఘాల్ని కట్టుగా నడిపావు
రివిజనిస్టూ రాజకీయాలు విడువమని
విప్లవ రాజకీయాలను చెప్పావు

॥అన్నా॥

ఉన్నతాదర్శలతో బతుకుతూ ఉన్న
గెరిల్ల కామ్రేడ్లతో గన్ను బట్టావు
అడవిలో ఏడేండ్లు పార్టి బాధ్యతలల్లో
కామ్రేడ్ల స్నేహంతో ఎదిగావు నీవెంతో

॥అన్నా॥

శత్రు చేజిక్కినా బందిఖానలో వున్న
చేసినా బాసనూ విడువనని అన్నావు
అడివైన జైలైన బహిరంగముగ్గనైన
జంగు సైరను గానె జీవించినావన్న

॥అన్నా॥

ప్రజాయుద్ధంలోన ప్రాణాలు విడిచినా
అమరులా శవాలను తీసుకొచ్చేటి
అమరులా బంధుమిత్రుల సంఘముకు నీవు
పెద్దన్నగా నిల్చి ప్రేమనూ పంచేవు

॥అన్నా॥

అమరులా బందుమిత్రుల సంఘములో వున్న
ప్రతి ఒక్కరిని నీవు ప్రేమతో కలిశావు
కన్నీళ్ళు తుడిశావు కరుణ చూపించావు
కల్సి పోరుదమంటు కదిలించినావన్న

॥అన్నా॥

రాజకీయ ఖైదీల విడుదల కోరి
సి. ఆర్. పి. పి ని సిద్ధమూ జేశావు
ప్రగతి శీల కార్మిక సంఘముకు నీవు
ఉద్యమ సారథిగా వెంటుండి నడిపావు

॥అన్నా॥

సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమాల్ని
సంఘటిత పరిచే కృషి నీవు చేసావు
విప్లవ ప్రజాస్వామిక సంఘటనలోన
దేశమంతా దిరిగి పోరు కేకయినావు

॥అన్నా॥

దండకారణ్యాన ఆదివాసుల కాళ్ళ
కింద వున్నా ఖనిజ సంపదను కాపాడ
ఆపరేషన్ గ్రీను హంటు నెతిరేకిస్తు
ఎత్తావు నీ గొంతు దిక్కులదిరి పోంగ

॥అన్నా॥

అలుపెరుగనీ పోరు పట్టుదలను జూసి
కళ్ళెర్ర జేసింది సర్కారు నీ పైన
పట్ట పగలే నిన్ను నిట్ట విలువున చంపి
నే నెరుగ నంటుంది ఈ దొంగ సర్కారు

॥అన్నా॥

ఎనభై అయిదులోన పిల్లల డాక్టరు
రామనాథం గార్ని గిట్లనే జంపేసి
చంపినోళ్ళెవ్వరూ దొరక లేదనియంటు
సర్కారు సల్లగా సేతులెత్తేసింది!

॥అన్నా॥

జాఫాలక్ష్మారెడ్డి నర్రా ప్రభాకరు
పురుషోత్తమూ సారు ఆజామలీలాను
గొడ్డళ్ళతో నరికి కాల్చిచంపినగాని
భయపెట్ట జూపినా ఆగిందా వుద్యమం

॥అన్నా॥

బెల్లిలలితక్కనూ ముక్క ముక్కలు జేసి
కనకచారీ సార్ను కోబ్రాలతో జంపి
మన్నెం ప్రసాదును నరికి పడవేసినా
ప్రజాఉద్యమాల పోరాగి పోలేదు

॥అన్నా॥

గాంధి రాజ్యం మనది హింస ఉండొద్దంటు
కోర్టులు, చట్టాలు, జైళ్ళు వున్నాయంటు
రాజ్యమే గొడ్డళ్ళతో పట్ట పగలొచ్చి
నరికేసి చంపటం ఏ గాంధి రాజ్యము

॥అన్నా॥

ఎక్కడెంటీయారు, యాడ చంద్రబాబు
రాజశేఖర్‌రెడ్డి, కిరణ్ కుమార్ దాక
పార్టీలు మారినా జెండాలు మారినా
ప్రజల చంపుడు కాడ వీళ్ళంత ఒక్కటే

॥అన్నా॥

ప్రజాస్వామ్యంలోన హింసకు తావులే
దని చెప్పి సర్కారు జేస్తున్న హింసలివి
సర్కారు జేస్తున్న ఈ ముసుగు హత్యలను
ఐక్యపోరాటాలతో ఆపుదము రండి

॥అన్నా॥

# గంటి ప్రసాదం స్మృతిలో....

- కోటి

పల్లవి॥ ఎర్ర ఎర్ర వందనాలు ఎర్ర వందనాలు
మా గంటి ప్రసాదన్న నీకు ఎర్ర వందనాలు
॥ఎర్ర॥

కన్నతల్లి వందనాలు
కడుపు తీపి వందనాలు
సిక్కోలు వందనాలు
చిన్న పిల్లలొందనాలు
ఉద్దానం వందనాలు
ఉద్యమాల వందనాలు
యుద్ధానికి సిద్ధమైన ముద్దుబిడ్డ వందనాలు
॥ఎర్ర॥

అడవి తల్లి వందనాలు
ఆదివాసి వందనాలు
కంపినీల వందనాలు
కార్మికుల వందనాలు
కాలేజి వందనాలు
కళాసి వందనాలు
కష్ట జీవులందించే ఇష్టమైన వందనాలు
॥ఎర్ర॥

చేను సెలక వందనాలు
చెలయేరు వందనాలు
రైతుకూలి వందనాలు
రణస్థలి వందనాలు
నేతన్నల వందనాలు
రైతన్నల వందనాలు
ప్రాణమిచ్చిన నీకు పాదాభివందనాలు
॥ఎర్ర॥

విద్యార్థి వందనాలు
విప్లవాల వందనాలు
ఖైదీల వందనాలు
బంధువుల వందనాలు
పేద ప్రజల వందనాలు
ప్రజాకళల వందనాలు
గంటి ప్రసాదన్న నీకు గరీబోళ్ళ వందనాలు
॥ఎర్ర॥

ఆర్‌డిఎఫ్ వందనాలు
సిఆర్‌పిపి వందనాలు
ఆశయానికి వందనాలు
అమరుడు నీకొందనాలు
ధైర్యానికి వందనాలు
శౌర్యానికి వందనాలు
అమరుల బంధుమిత్రులందించే వందనాలు
॥ఎర్ర॥

# ప్రసాదం నీకు పరిపరి దండాలు

- సత్య

గంటి ప్రసాదూ నీకు ఘనమైన నివాళులు
పాదా పాదాన పరి పరి దండాలు
॥గంటి॥
ప్రజా సంఘాలకు అన్నా ప్రాణమైనావే
అందరి కళ్ళల్లో కనుపాపమైనావే
॥గంటి॥
నీ మనసు వెన్నన్నో నీ మాటా మధురమే
నిను మరువలెమన్నో నీ బాట నోస్తామో
॥నీ మనసు॥
బొబ్బిలి బిడ్డన్నో మా గంటి ప్రసాదూ
బడుగు వర్గాల బిడ్డమ్మో మా అన్న ప్రసాదూ
॥గంటి॥
అమరుల త్యాగాన్ని బుజానెత్తుకున్నావే
ఆదివాసులకు నువ్వు అండగ ఉన్నావే
॥అమరుల॥
ఆముదల వలసా ఆకలి కేకలు చూసావే
హక్కుల కొరకూ అన్నా పోరుజేసావే
॥గంటి॥
నల్లమల్ల తల్లీ నిన్ను అడుగుతుందన్నో
క్రిష్ణా గోదారీ చెల్లెమ్మా అడిగినే
॥నల్లమల్ల॥
అన్నా ఏడనీ అనురాగమేదనీ
ఆరాధించేటి ఆ కళ్ళు ఏవనీ
॥గంటి॥
చెంచూ గుడాలు నిన్ను చెంతకరమ్మానే
చెంగు చెంగునెగిరే లేడి కనులు రమ్మనే
॥చెంచూ॥
చిలకా పలుకూలై వాళ్ళ చెంతనుంటావా
చెలిమి నీవెయ్యి చేరుకునంటావా
॥గంటి॥
పొలిమేర రమ్మందే పోరువిత్తనమడిగిందే
పోరూ మొలకల్లో 'పురుడోసు' కొమ్మందే
॥పోరు॥
పొద్దూ అడిగిందే పోరు బిడ్డా అడిగిందే
ఎర్రని జెండానూ ఎగరేసి పొమ్మందే
ఎర్రని జెండాను ఎగరేసి పొమ్మందే
ఎర్రని జెండాను ఎగరేసి పొమ్మందే
ఎర్రని జెండాను ఎగరేసి పొమ్మందే

# రాజ్యహింస కుట్రలో రాలిపోయిన..

- వి. రాజారాం ప్రకాశ్

గంటి ప్రసాదం
ఓ విప్లవనాదం

విరబూసిన పరిమళం
విరజిమ్మే నిప్పుకణం
॥గంటి ప్రసాదం॥

బొబ్బిలిలో పుట్టినవ్
బాస్వరమై మండినవ్
బానిస సంకెళ్ళ తెంప, బాన్నుదై లేచినవ్
బద్మాష్ గాండ్ల వేటకొడవలితో కూలినకోటవు
॥గంటి ప్రసాదం॥

పోరాటాల పులిబిడ్డవు
పేదోళ్ళకు అన్నవు
అమర కుటుంబాల ఆత్మబంధువు
అగంతకుల వేటలో ఆగిన ఆటవు
॥గంటి ప్రసాదం॥

జనజాగృతి తొవ్వవు
జనం మాట ఊటవు
జంగ్ సైరన్ కూతవు
జంగిలి నాయళ్ళ చేతిలో రాలిన ఎర్రపువ్వువు
॥గంటి ప్రసాదం॥

నీపాట ప్రతినోట
నీమాట బతుకుమూట
నీఆట జనంబాట
తుపాకికి బలైన తూటల మాట
॥గంటి ప్రసాదం॥

వేటకొడవలి వేటెవరిది?
తుపాకి పేల్చిన చెయ్యెవరిది?
రాజ్యహింస కుట్రలో రాలిపోయినవ్
జనసంద్రం గుండెల్లో నిల్చిపోయినవ్
॥గంటి ప్రసాదం॥

# వేటాడే జ్ఞాపకం

**- పి. వరలక్ష్మి**

ఎందుకంత అసహనంగా ముఖం పెడతావ్?
కన్నీళ్ళు, జ్ఞాపకాలు, స్మృతులు, చిహ్నాలు
మనుషులకు సహజమే కదా.
ఇప్పుడు నువ్వెంత అసహ్యంగా
కనపడుతున్నావో తెలుసా?

నీకెలా తెలుస్తుంది.
నిన్ను నువ్వెప్పుడూ
చూసుకోవుకదా?
అసలు అద్దమంటేనే
నీకు పడకపోయె

ఒక్కసారి తడి కళ్ళలోకైనా చూడు
ఒక్కొక్కరు ఎందుకు స్మృతి చిహ్నాలవుతారో
ఒక్కొక్కరు తమను తాము రద్దుచేసుకొని
సామూహిక గానాలెలా అవుతారో

ఒక్కొక్కరు నిరాయుధంగా
వేల తుపాకుల కనుసన్నల్లో
వసంతాలు విరగబూయించే
చిరునవ్వులు చిలకరిస్తారో

ఒక్కొక్కరు చావును ఆలింగనం
చేసుకొని
నూతన మానవ
జననాన్ని కలగంటారో..
ఆ కలలో నువ్వూ
కనపడుతున్నావా!
అందుకేనా అంత కలవరపాటు??

మొండం అంచుకు వేలాడుతున్న శిరస్సు
ఇంకా మాట్లాడుతూనే ఉన్నదా
ఇంకా ఇంకా అడుగుతూనే ఉన్నదా
మాట తూట్లు పొడుస్తున్నదా
మానవత భయం పుట్టిస్తున్నదా
మనుషుల జ్ఞాపకాలు, స్మృతులు, చిహ్నాలు
నీ పాపాలను వేటాడుతున్నాయా??

అలా చూడకు
కోరలు తగిలించుకుని
ఇంకా ఇంకా
అసహ్యంగా కనపడుతున్నావ్

# నివాళి

**- తుర్లపాటి రామమోహన్‌రావు**

నెల్లూరు నడిబొడ్డున ముష్కరుల దాడిలోన
అమరుడైన ఆత్మబంధుడా...
అందుకో మా ఎర్రెర దండాలు
మా గంటి ప్రసాదం అందుకో మా లాల్‌సలాములు
॥నెల్లూరు॥

నీ చెరగని చిరునవ్వులే కలిగించును మాకుత్తేజం
చెదరని నీ దృఢ సంకల్పం మాకిచ్చును మనోనిబ్బరం
మనసున్నా మనిషివి నీవయ్యా మాగంటి ప్రసాదం
మానవతకు మరో రూపువయ్యా ॥2॥
॥నెల్లూరు॥

పోలీసుల తోడేళ్ళుగా మారి
చాటుగాను నిను వెంటాడి
అదనుచూచి దాడే చేశారా... నిన్ను
వెన్నుపోటు పొడిచి చంపారా
మానుండీ దూరం చేశారా-మా గంటి ప్రసాదం

మానవతను సమాధి చేశారా?॥2॥

॥నెల్లూరు॥

పేదోళ్ళ రాజ్యం కొరకు
ఆఖరి నిశ్వాసం వరకు
అలుపెరుగని పోరును జేసి
అజేయుడవు నీవై నిలిచి
చుక్కల్లో చుక్కై నిలిచావా మా గంటి ప్రసాదం
ధృవతారగా దారే చూపేవా ॥2॥

॥నెల్లూరు॥

తొలి పొద్దు పొడుపులోన నీ వదనం కనిపిస్తుంది
పున్నమి నెల రోజులోన నీనవ్వే కనిపిస్తుంది
గర్జించే వసంత మేఘమే - మా గంటి ప్రసాదం
నీ కంఠం వినిపిస్తుందయ్యా ॥2॥

॥నెల్లూరు॥

నువ్ చూపిన మార్గంలోన - నీ అడుగు జాడల్లోన
నీ ఆశయ సిద్ధి కోసమై - తుదికంటా పోరుతాములే
నీ చిందిన రక్తం సాక్షిగా - మా గంటి ప్రసాదం
ఎర్ర జెండ నెగరేస్తామయ్యా - ఆ ఢిల్లీ కోటపై

॥ఎర్రజెండ॥

# జన ప్రసాదం

**- వడ్డెబోయిన శ్రీనివాస్**

మనసు ఆదివాసి
మనిషి శ్రీకాకుళ పోరువాసి
అతడు చిగుళ్ళేసిన సుత్తెకొడవలి
పెదవుల్లో విరిసిన నక్షత్రం

అతడు తలుపులు తెరిచిన గుండెల్లో
అడివంటుకున్నది
పాపం!
ఎవరికి తెలియదు
అతడు సోకి
మనిషి పరిమళమవుతున్నామని
ఎవరికి తెలియదు
అతడి పక్కన నడిస్తే
సంకెళ్ళు తెగిన పాట వినిపిస్తుందని
ఎవరికి తెలియదు
గాయాల్లో వచ్చిన
పగిల్న మనుషులకు ప్రేమ పూసాదని
ఎవరికి తెలియదు
చీకటి పడి వచ్చిన మనసుల
సూర్యుడితో తడిచాడని
ఎవరికి తెలియదు
అతడు చినుకురాలని కాలాన్ని
చిగుళ్ళు వేయించాడని
ఎవరికి తెలియదు
అతడి వెలుక్కి

శత్రువు భయపడ్డాడని

బహుశా
ఎక్కడా బతకనివ్వని
ఈ ప్రైవేటు ప్రజాస్వామ్యం
చావు వాసనేస్తోంది
దేన్ని గాఢంగా ప్రేమించినా
ప్రసాదంలా -
వొక మృత్యువును మెళ్ళేసుకొని
తిరగడానికి
ఇక సిద్ధపడాలి
నేనైనా నువ్వైనా
మనమైనా

# అజేయం

**- కెనరీ**

చేస్తున్న పనులు కొన్ని
చేయాల్సినవి మరికొన్ని
మధ్యలోనే వదిలి
అర్థాంతరంగానే వెళ్ళిపోయాడు
అందర్నీ విషాదంలో ముంచి

అతడు బహిరంగంగా
చంపబడ్డాడు దారుణంగా

జీవితమంతా
అద్భుత స్వప్నాల తన్మయత్వాన్ని
స్పృశించిన అతను
నడచిన దారి పొడువునా
తొలకరికి చిగురుతొడిగిన పసిమి
చేతులు చాపి ఆహ్వానిస్తోంది
అపరిమితమైన ప్రేమను గుమ్మరిస్తూ

హంతకుని ఆచూకీ కోసం
ఆందోళన పడాల్సిందేం లేదు
అందరూ చూస్తుండగానే
పట్టపగలు దేహాన్ని కత్తులతో చీల్చి
గుండెల్లో తూటాలు దూర్చి
వికృత వికటాట్టహాసం చేసిన రాజ్యం
ఎంతటి సిగ్గుమాలిన మాలిన్యాన్నయినా భరిస్తుంది

పెదవులపై అమరుడు
వెల్లువగా పల్లవిస్తుంటే
హత్యం చేయగలదు ఆశయాన్ని
లక్ష్యం నిటారుగా నిలబడి
కొత్త ఆశల్ని రేకెత్తిస్తుంటే

# జనం కోసం

**- కోటయ్య పిన్నిబోయిన**

డాక్టర్ నన్ను బతికించండి
ప్రజల కోసం పని చెయ్యాలి
కామ్రేడ్! మీరన్న మాటలు
అనంత కోటి పీడిత ప్రజల
గుండెగుహల్లో ప్రతిధ్వనిస్తున్నాయ్!
ప్రజలపట్ల మీ ప్రేమకు
ఇంతకన్నా నిదర్శనం ఇంకేం కావాలి!
జనం కోసం బతికిన మీరు
మరణించలేదు కామ్రేడ్
జనంలో జీవించే ఉన్నారు!
కామ్రేడ్ మీ చివరి పలుకులు
'నన్ను చంపవచ్చు-కానీ
నా స్పిరిట్ చంపలేరు'
అద్భుతమైన మీ ఈ వజ్ర సంకల్పం
శత్రుమూకల రాతి గుండెల్ని
తుత్తునియలు చేసింది కామ్రేడ్
సముద్రపు హోరుగాలై శత్రు శిబిర భావజాలాన్ని
మట్టి కరిపించింది కామ్రేడ్!
చావుదు ధిక్కరించడమే కాదు
దాన్ని పరిహసించిన నిన్నుచూసి
జనం-నిన్నాకాశానికెత్తారు కామ్రేడ్!
మీరు మాకిచ్చిన రెండాయుధాలు
జనం - స్పిరిట్
భద్రంగా దాచుకొంటామ్
శత్రువుపై సంధించడానికి
ఇంతకంటే ఏం కావాలి?
మీ పార్థివ దేహంపై
అరుణారుణ కాంతి వస్త్రం కప్పినప్పుడు
వణకిన మా చేతులు
బిగుసుకుంటున్నాయ్!

అవిశ్రాంతమైన యుద్ధ రంగంలో
అలసిన మీ కన్నులు చూసి
వాగులైన మా కన్నులు
నేడు విస్ఫులింగాలు విరజిమ్ముతున్నాయ్!
రాజ్యహింసకు ప్రతిహింస తప్పదంటూ
అడుగులు వడివడిగా కదులుతున్నాయ్!

# కుట్ర కాలాన్ని జయించిన వసంత రుతువు

**- పెద్దికృష్ణ**

కల్లోల నిర్బంధంలో సైతం
ప్రజల్ని రివల్యూషనరీ చేస్తున్న
జన సైనికుడు

రక్తధార అవస్థల బంధీలో సైతం
దేహం నూతన
ప్రజాస్వామ్య గీతమై
సరిహద్దులు లేని ప్రపంచంలోకి
మానవత్వపు ప్రవాహమైంది

రాడికల్ విద్యార్థిగ గోడలపై రాతలురాసి
ఉద్యమ శ్వాసలకు ఊపిరయిన
శ్రీకాకుళ గిరిజన నగ్జల్బరీ సాయుధరైతాంగ
పోరాట పాదముద్రలకు అడుగుజాడయి
దిక్కు దివానా లేని జనానికి
దిక్కులు చూపి

ఉద్యమ అనుభవాన్నంతా చిలికి వడపోసి
వండిన వంటకాన్నంతా ఇచ్చాడు పోరుజనానికి
పగలు రాత్రి
వెలుతురంత ఉత్తేజాన్ని వెలిగించి
ఓ దేహానికి ఓదార్పు పంచుతున్న సమయాన
దేశాన్ని ఏలుతున్న దేశద్రోహుల కుట్రను
రక్తం చిందిస్తూ
శతృకాలాన్ని ఆత్మవిశ్వాసంతో
జయించిన వసంతరుతువు
గంటిప్రసాదం

# మేలుకొల్పుల ఉదయం

***- అంజనిబాల***

వీరబొబ్బిలి గడ్డపై ఒక వేకువజామున
పురుడుపోసుకొన్న శిశువు
శ్రీకాకుళం కొండల్లో నూతన చైతన్యం గాలి పీల్చి
ఉద్దానం మైదానంలో అంబాడి వీరరసంపాలు తాగి
కళ్ళ ముందు కదలాడిన కఠిన క్రూరత్వాన్ని చూసింది
తరతరాల దోపిడీ రూపాలపై కదనరంగమై దూకింది
ఉద్దానం ఉద్యమమై జీవనాడి నిస్పర్శించిందతణ్ణి...
కొత్త జీవితం ప్రారంభాన గాలి ఏదో సైగలు చేసింది
అడవి బిడ్డల ఆకలి దప్పులు
పీడనల రోదనలు మిన్నుముట్టినయ్
వారి అంగలార్పులు అతనిలో ఆర్తనాదాలు
ప్రతిధ్వనించాయి సుడిగాలై చుట్టుముట్టాయి
న్యాయం దప్పిన న్యాయ మార్గానికి తుది పలుకులు పలికే
త్యాగధనుల బాటలో తాను సాగిపోయాడు
అడవి అపురూప నిధుల ఖజానాను చేతులు మార్చే
జాతి దళారీలను ఎండగట్టాడు
బహుళజాతుల స్వార్థ ద్రోహుల దాహాన్ని నిరసించిన గొంతుక

అతను వ్యక్తికాదు బహువచన శక్తైనాడు పీడితులకి
శ్రమించే చెమట చుక్కకు విలువనిచ్చి అండదండలతో
భుజం భుజం కలిపి వారిలో ఒక మేలుకొల్పుల ఉదయమైనాడు
అమాయక ఆదివాసి హక్కేంటో తెలియజెప్పేందుకు
జీవితమంతా అవిశ్రాంత ప్రయాణీకుడయ్యాడు
అందరి సమసౌఖ్యాల కోసం అమరులైనవారి వారసులకు
కొండంత అండగా నిల్చి, నిత్యధైర్యసాహస వచనాలు పలికి
వారి బతుకుకు గుండెల్లో భరోసాహస్తమైన స్నేహ పరిమళం
సమాజ నిష్ఠూర నిజాలు పలికే జన నీతివాక్యమై మానవతా
మమకారపు జల్లై కురిసిన మానవీయ శక్తి
మనిషి మనుగడకై నిస్వార్థంతో నడిచే ఉద్యమాలకు
తనకు తానుగా సమర్పించుకొన్న ధన్యజీవి
బతికిన బతుకుకు సార్థకత సాధించిన
మానవతా సారంగ్రహిత
ఉద్యమాల గాలిపీల్చి అవే ఉచ్ఛ్వాస నిశ్వాసలుగా జీవించాడు
అడవి పచ్చపచ్చని సౌందర్యం చూసి లోకమంతా పచ్చదనం
బతుకు వసంతం కలలను నిజం చేసే కార్యంలో నిరంతర
తపనశీలి చీకట్లో మగ్గే సామాన్యులకు ఒక వెలుగుల
కాంతుల వలయమతడు
స్వార్థ స్వామ్యంలో సాగే రాజ్యంకు కంటి నలుసైనాడు
ప్రజాస్వామ్యంలో ముసుగు కప్పుకొన్న
ప్రపంచీకరణం సామ్రాజ్యవాదం
అతని అంతానికి వేటకొడవలైయ్యింది
బహుళజాతుల హస్తం తూటాలతో బలి బహుమానం ఇచ్చింది
అయినా ఆశయాల దిశలో సాగే వీరులకెప్పటికీ
మహోన్నత దీక్షా ప్రవచనమైనాడు
అడవి పుత్రుల చీకటి బతుకులో నిత్యం వెలుగుతున్న కాంతి
పీడిత తాడితులకు సదా అండదండలందించిన ఆపదలు తీర్చే
ప్రసాదమతడు

# కా. గంటి ప్రసాదంకు అరుణారుణ జోహార్లు

*- బండికోళ్ళ విజయభాస్కరరావు*

నక్సల్‌బరి శ్రీకాకుళం రగల్‌జెండా ఎత్తిపట్టినవాడు
కామ్రేడ్ గంటి ప్రసాదం
నక్సల్‌బరి విప్లవాగులను విస్తరింపజేయాలన్నాడు గంటి
విప్లవ వాగాడంబరిగాక విప్లవ కార్యార్థిగా కదంతొక్కాడు గంటి
మార్క్సిస్ట్ మేధావిగా పరిఢవిల్లాడు గంటి ప్రసాదం
పడక కుర్చీకి పరిమితంగాక కవాతు తొక్కేడు కార్యక్షేత్రంలో
విప్లవ రచయితగా రాతలకు పరిమితం కాక
రణక్షేత్రంలో రణం చేసినాడు గంటి
విప్లవ రచయితలు విప్లవవాదులుగా కాక
విప్లవకారులు కావాలనేవాడు గంటి
మార్క్సిజమ్ బోధించిన వాడు గంటి
ఉపాధ్యాయుడుగా మూల సూత్రాలను
విడమరిచి చెప్పేవాడు శులభశైలిలో అనుచరులకు
గతితార్కిక భౌతికవాదం బోధించేవాడు గ్రాహ్యమయ్యేలా
కార్యకర్తలకు
వేషభాషల్లో ప్రత్యేకతలు సంతరించుకున్నా
గంటి గమనం సుఖ సౌకర్యాలకు తావివ్వనిది
అసంఘటిత కార్మికులను చైతన్యపరిచాడు బొబ్బిలిలో
మునుముందుగా గంటి
కూడగట్టాడు జూట్ మిల్లు కార్మికులను,
స్థాపించాడు కార్మిక సంఘం వారికై
కళాసీలను, హమాలీలను హత్తుకున్నాడు గంటి గుండెలకు
నడిపించాడు సమరశీల సమ్మెలెన్నో ముందుండి విజయపథాన
పునరుద్ధరించాడు ప్రగతి శీలకార్మిక సమాఖ్యను
రాష్ట్ర వ్యాప్తంగా
దశదిశ నిర్దేశిస్తూ ప్రగతిశీల కార్మిక సమాఖ్యకు
దిక్సూచై నిలిచాడు తుదిశ్వాస వరకు
విప్లవ సంఘాల సమన్వయ కర్త గంటి
కార్యకర్తల సమావేశాలెన్నో నిర్వహించాడు
రాష్ట్ర నలుమూలలా నిర్విరామంగా
సునిశితంగా చెప్పేవాడు విమర్శ, ఆత్మవిమర్శ,
దిద్దుబాటు సూత్రాలను కార్యకర్తలకు
స్వీయ విమర్శను స్వీకరించేవాడు వినమ్రతతో గౌరవంగా గంటి
కురిపించేవాడు ఆప్యాయత అనురాగాలను కార్యకర్తలపై గంటి
అమరుల బంధుమిత్రుల సంఘానికి ఆలంబనం గంటి
దొంగ ఎదురు కాల్పులలో నేలకొరిగిన
అమరుల శవాల దరిచేరి
బంధువుల దరి చేర్చేవాడు ఎంతటి ప్రతికూల
పరిస్థితిలలోనైనా గంటి
అజ్ఞాతమైనా, జనజీవనమైనా,
జైలు జీవితమైనా, పోరాటబాటైనా,
లాఠీ దెబ్బలకైనా, తూటాల పేళుళ్ళకైనా
గంటి ప్రసాదింది మడమ తిప్పని విప్లవ ప్రస్థానమే!
విప్లవాన్ని ప్రేమించినవాడు - విప్లవాన్నే శ్వాసించినవాడు
విప్లం కొరకై పరితపించినవాడు - విప్లవం కొరకే
అమరుడైనవాడు గంటి
ఆదివాసుల హాహాకారాలను అగ్నిగుండాలుగా
మార్చాలన్నాడు గంటి
గ్రీన్‌హంట్ కాదది, ఆదివాసుల హంటేనని
ఎలుగెత్తి చాటాడు గంటి
ప్రపంచీకరణ పేదల పాలిట పెనుభూతం అన్నాడు గంటి
అమరవీరుడు గంటి ప్రసాదంకు అరుణారుణ జోహార్లు

# వాగ్దానం

*- గిన్నె రాజు*

సమస్త మానవ సౌఖ్యం కోసం
విశాలమయిన హృదయంపై
పొలకుడే హంతకుడై గాయం చేస్తే

చిందిన నెత్తురు సాక్షిగ
ప్రజా యుద్ధానికి ఊపిరవుతాం
త్యాగాల పునాదులపై నిలిపిన
ఆశయాల సౌధాన్ని
శత్రువు కబళిస్తే
చెల్లాచెదురైన ఆలోచనలను పోగేసి
దోపిడి వ్యవస్థకు గోరి కడతాం
వెలుగు రేఖలను వెతుక్కుంటూ
చీకట్లను తరుముకుంటూ
కలలు కనే కళ్ళలోని
స్వప్నాలను చెదరగొడితే
ఎరుపెక్కిన పుడమిలోంచి
విప్లవమై ఎదిగివస్తాం
అమరుల పాదముద్రలు వెతుక్కుంటూ
ఆత్మీయతా అనురాగాలతో
పోరుగానమై సాగివస్తాం
ఎగిసిపడే చితిమంటలతో
వాగ్దానం చేస్తూ
బంధుమిత్రుల బాందవుడికి
పోరాట వారసులవుతాం

# జోహార్లు కామ్రేడ్

**- జనజ్వాల**

ఏ మరణాల కోసం నీవు మాటల
నడకల వర్షమై కురిసావో... ఆ
మరణం నీవు అవుతే... ..,
వర్షం ఉండదు... ... పిచ్చిది
రాజ్యం భయపడింది
రాజ్యం మరిణించి
నిన్ను బతికించింది!
* * *
జనత్యాగి వర్షమా! విప్లవ విత్తనమా!
గంటి ప్రసాదం!
జోహార్లు
కామ్రేడ్

# అమరుడు గంటి ప్రసాదం స్మృతిలో

**- రామిరెడ్డి**

నీవు ఉప్పుకారం తిన్నావు
గనుకనే మనిషివైనావు
నీ ఒంట్లో చీమూ నెత్తురు పారుతుంది
గనుకనే ప్రజల వైపున్నావు
నీవు బతకడం గాదు
ఈ పీడిత ప్రజల విముక్తి గోరావు
కత్తికి ఆకురాయితో పదునెట్టినట్టు
నీ వివేకంతో, ధైర్యంతో ప్రజా చైతన్యం
చిందించినావు.....

నీ మూలుగుల్లో జవసత్వాలున్నాయి కాబట్టే
జనం కొరకు పోరు చేసినావు
అడవిని నమ్ముకున్న ఆదివాసుల జీవనం
ధ్వంసం చేస్తున్న సామ్రాజ్యవాదులను,
పెట్టుబడిదారులను.....,
దళారీ పాలకులనూ.... ఎదిరించే
సైనికులను చేసినవ్

ప్రజారాశులను....
దేశ వనరుల రక్షణ కొరకు
పోరాడే మూలవాసులపై
నిలిచి....
గెలిచినవ్....

చేపలా.....
నీటికి ఎదిరీదే సాహసులుగా
ఆదివాసీలను మలచినవ్......
సహచరుల నాయకత్వంతో
బలమైన యుద్ధాన్ని నడిపిస్తూ....
రాజ్యహింసలో రాలిపోయిన యోధులను
భూజానెత్తుకొని
రాజ్యహింసను ప్రశ్నించిన....!
అమరుల బంధుమిత్రులకు...
కడచూపి చూపించిన....
సాహసివి

నీ మడిమ తిప్పని పోరును చూసిన
పోలీసులకూ...
పాలకులకూ....
నిన్నెదిరించే శక్తి లేదు
కనుకనే....
కుట్రపన్ని...., కక్ష్యగట్టి....
దొంగదెబ్బతో....
నిన్ను అంతం చేసినమని మురుస్తుండ్రు
నీ రక్తంతో...
మరింత ఎరుపెక్కిన ఎర్రజెండా....
రెపరెపలాడుతూ...
జన సంకేతమై..., పోరు కెరటమై...
ప్రజలను పోరుకు సన్నద్ధం కమ్మంది

# కామ్రేడ్ చెలిమె

**- చెలిమె**

కామ్రేడ్
ఇది ఒక అరణ్యపు ఆత్మ కథ
ఇది ఒక అమరుడి ఆత్మ కథ
భయంకర నిశ్శబ్దంలో మోగిన
తుపాకీ గుండు చెప్తున్న కథ.... కామ్రేడ్
గుట్టుగా గుండెల్లో గూడుకట్టిన
విద్రోహాలు చెప్తున్న కథ... కామ్రేడ్
వందలాది తల్లులు తల్లడిల్లగా
అమరమైన ఒక తనువు చెప్తున్న కథ...
- కామ్రేడ్
భయంకర బందూకులు ఏకధాటిగా
ఎక్కుపెట్టగా ఏడుస్తూ ఏడుస్తూ
తుపాకీ గొట్టం చెప్తున్న కథ... కామ్రేడ్
అశ్రునయనాలు అలజడులు
చెప్తున్న కథ... కామ్రేడ్
శిథిలమై పోరాట శిఖరాల్లో
వేలాడిన శిరస్సులు చెప్తున్న కథ... కామ్రేడ్
వెచ్చని లేతపచ్చని సిగలో సింగారమై
గోగుల గుత్తులు గుట్టలపై రాలుతూ చెప్తున్న కథ... కామ్రేడ్
గుట్టలు కట్టిన శవాల గట్టున
తుపాకీ పుట్టుక చెప్తున్న కథ... కామ్రేడ్
భూమి కోసం, భుక్తి కోసం, విముక్తి కోసం వీచె విప్లవ పవనాలు
చెప్తున్న కథ... కామ్రేడ్
కామ్రేడ్.... ఇది నీ ఆత్మకథ

# గంటి ప్రసాదం

**- కట్టెల లింగస్వామి**

బెల్లి లలిత నుండి పురుషోత్తం హత్య వరకు
హక్కుల గొంతులను రాజ్యం
అణగదొక్కుతుంటె
హక్కుల ఉద్యమంగా
అమరుల బంధుమిత్రునిగా
గళమెత్తి గర్జించిన వాడు
గంటి ప్రసాదం

గంటి ప్రసాదం
ఒకపేరు కాదు
ప్రభుత్వ నిర్బంధాలపై
హక్కుల అణచివేతలపై
అమరుల ఆశయాలకై
కోట్లాది గొంతుకలై
గర్జించిన గళం అది

రాజ్యహింసపై పోరుచేస్తే
రాకాసి రాజ్యపాలకులు
రాబందు మూకలు (పోలీసులు)
వేట కొడవళ్ళై తపంచాలై
విరుచుకుపడుతుంది

ఫాసిస్టు కిరణ్‌కుమార్
కాచుకో ఇక
వేలాది ప్రజా సంఘాలై
కోట్ల గొంతుకల నినాదమై
కదలి వస్తున్నాం ఖబడ్దార్

# యుద్ధ ప్రయాణం

**- సంఘమిత్ర**

ఒక్కొక్కరం ఒక్కోపేరుతో వేరైపోవడం ఇష్టం లేక
మేమంతా ఒకేపేరును ఎంచుకున్నాం.
కనుకనే మేం పేరులేని వాళ్ళేం కాదు!
మేం ఊరు లేనివాళ్ళమూ కాదు!!
మా ఊరు నుంచి చాలా దూరంగా
ఎంతో ఘోరంగా తరిమివేయబడ్డవాళ్ళం
మా ఊరు తిరిగి చేరే ప్రయత్నంలోనే, ప్రయాణంలోనే
మేమిప్పుడు తలమునకలై వున్నాం
మా ఈ ప్రయాణం ఒక యుద్ధం లాంటిది
కాదు కాదు, అసలు యుద్ధమే మా ప్రయాణం
మా ఈ ప్రయాణానికి పరిస్థితులు అనుకూలంగా లేకుంటే
వాటిని సానుకూలంగా మార్చుకో ప్రయత్నిస్తాం
సానుకూలంగా ఉంటే,
మా ప్రయత్నాన్ని వేగవంతం చేస్తాం!
యుద్ధంలో వున్నవారెవరైనా
గెలుపు వైపే చూపు నిలపాలి
ఇది యుద్ధ నియమం
కనుకనే శత్రుబలాన్ని తక్కువగా చూసే తప్పుకు పాల్పడం
బలాబలాల తూకాన్ని సరిగ్గానే బేరీజు వేస్తాం
లేని బలమూ, లేని సానుకూలతలూ
ఉన్నాయనే ఊహల్లో తేలుతూ
ఉత్సాహ, ఉత్తేజాల సూదిమందుల్ని
రక్తనాళాల్లోకి ఎక్కించుకోవాల్సిన
అవసరం మాకు లేదు
ఎందుకంటే,
యుద్ధరంగం నుంచి తప్పుకునే అవకాశం మాకు లేనే లేదు
ఆ అవసరం మాకు అంతకంటే లేదు
ఈ యుద్ధం మేము కోరుకున్నది కాదు
శత్రువు మా నెత్తిన రుద్దిన యుద్ధం ఇది
చరిత్ర మాపై విధించిన శాసనం ఇది
యుద్ధం మా ఉనికికి ఊపిరి
యుద్ధాన్ని ఆపేసి మా ఊపిరిని ఉరి తీసుకోలేం

యుద్ధాన్ని వదిలేసి మా ఉనికిని బలితీసుకోలేం
పడుతూ లేస్తూ గూడు కడుతూనే ఉంటుంది సాలీడు
గూడు కట్టకపోతే
తాను బతికలేనన్న సంగతి మాత్రమే తెలుసు దానికి
సాలీడుకు గూడుంటేనే కూడు
గూటి కోసం, కూటి కోసం, అది చేసే పోరులో
పడుతూ లేస్తూ, లేస్తూ పడుతూ చచ్చిపోవడమంటూ జరిగితే
అది చావని తెలీనే తెలీదు దానికి
నిత్య నిర్బంధాల మధ్య దారుణ హత్యాకాండల మధ్య
రక్తార్పిత త్యాగాల రహదారుల గుండా
సాగిపోతూనే ఉంటుంది మా ప్రయాణం
ఓటమనే మాటకక్కడ చోటు లేనే లేదు
చరిత్రలో ఒకే ఒక్కసారి ఓడిపోయినవాళ్ళం మేము
ఆ ఓటమిని తిప్పికొట్టటానికి సాగుతున్నదే ఈ యుద్ధం
చరిత్ర విధించిన శాసనాన్ని సవాల్‌గా స్వీకరించాం
చరిత్ర చేతనే శెహభాష్ అనిపించేట్టు విజయాన్ని సాధిస్తాం
ఈ యుద్ధంలో చావాల్సి వస్తే
ఒకసారి కాదు, నూటన్నొక్కసార్లు చావ సిద్ధమవుతున్నాం
ఈ యుద్ధంలో కొనసాగాల్సి వస్తే
నూరు సంవత్సరాలే కాదు
వెయ్యిన్నొక్క సంవత్సరాలు బతకాలని కూడా కోరుకుంటున్నాం
మా ఈ సుదీర్ఘ ప్రయాణయుద్ధంలో మేం ఒంటరిగా లేం!
అశేష జనవాహినిని మా వెంటేసుకుపోతున్నాం
మేం ప్రజాసేవకులం, ప్రజాసైనికులం,
ప్రజాసేనానులం కూడా!!
కనుక ఎంతటి శక్తి సంపన్నమైనవైనా మా ముందు బలాదూర్!
ఇక ఒకటి కొట్టి రెండు కాచే తీరులోనే
మా యుద్ధం ఉండబోదు!!
మా ఈ ప్రయాణయుద్ధాన్ని
మహాక్రీడగా మార్చేస్తున్నాం
మా ఈ యుద్ధప్రయాణాన్ని
మహోత్సవంగా మలచేస్తున్నాం
మరింత దృఢంగానూ, ఇంకెంతో గర్వంగానూ
ప్రకటిస్తున్నాం
మా ఈ సుదీర్ఘ ప్రయాణయుద్ధంలో
తుది విజయం సాధించి తీరుతాం
మా ఈ సుదీర్ఘ యుద్ధప్రయాణంలో
మా గమ్యాన్ని చేరి తీరుతాం
ఇంతకీ చెప్పనే లేదు గదూ...
విప్లవం మా పేరు!
విముక్తి మా ఊరు!!

(**గమనిక:** ఈ కవితను కామ్రేడ్ గంటి ప్రసాదం 2001 జులై 28 అమరవీరుల దినోత్సవం సందర్భంగా నల్లమల అడవిలో సంఘమిత్ర పేరుతో రాసినది.

1999 డిసెంబరులో కామ్రేడ్స్ శ్యాం, మహేష్, నరేష్ అనే ముగ్గురు కేంద్రకమిటీ సభ్యులను పోలీసులు ఎన్‌కౌంటర్ పేరుతో కొయ్యూరు అడవుల్లో కిరాతకంగా హత్య చేసిన తర్వాత రెండవ సంవత్సరంలో అమరవీరులను స్మరించుకునే సందర్భంగా అప్పటివరకూ వారితో ఉన్న అనుబంధాన్ని, ప్రజాయుద్ధం త్యాగాలను కోరుకునే సందర్భంలో విడిపోయిన సంఘటనలను గుర్తుచేస్తూ రాసిన కవిత.

ఆ సమయంలో అక్కడే ఉన్న ఒక అజ్ఞాత కామ్రేడ్ దీన్ని ఇప్పటివరకూ భద్రంగా దాచుకున్నారు. ఇప్పుడు ఆయన సంస్మరణలో..

విచిత్రం ఏమంటే ఈ కవితలో ప్రజాసేవకులం అనే పదాన్ని వాడాడు కామ్రేడ్ గంటి ప్రసాదం. కత్తిపోట్లు, తుపాకి తూటాలకు తీవ్రంగా గాయపడి రక్తస్రావం అవుతున్న సమయంలో ఆయనను తోటి కామ్రేడ్స్ ఆసుపత్రికి తరలిస్తే చికిత్స చేయడానికి ముందుకొచ్చిన డాక్టర్ విజయకుమార్‌తో దాదాపు అపస్మారక స్థితిలోకి వెళ్తున్న సమయంలో కూడా కామ్రేడ్ గంటి ప్రసాదం.. డాక్టర్! నేను నా కోసం కాదు, ప్రజలకు సేవ చేయడానికి బతికే వుండాలి, నన్ను బతికించండి అని ప్రజలను తల్చుకున్నాడు. ప్రజలకు సేవ చేయలన్న మార్క్సిస్టు సూత్రానికి కట్టుబడి వున్నాడు.)

# కోవెలసెంటర్ @ బొబ్బిలి.కాం

**- రెడ్డి రామకృష్ణ**

బొబ్బిలి
కోవెలసెంటర్
కళాసి సంఘం
పాత బస్ స్టాండు
వీటితో సంబంధమున్న ఎవరైనా సరే
ఒక్కసారి కళ్ళు మూసుకొని
మీ మనసుపొరల్లోకి తొంగి చూడండి
ముప్పై ఏళ్ళ మైళ్ళరాయి దగ్గర
మండే కాగడా ఒకటి ఎదురు పడుతుంది

తదేకంగా దాన్నే చూడండి
తెల్లని వర్చస్సు
కళ్ళకు కళ్ళ జోడు
చేతిలో ఓ డైరీ... కనిపిస్తోందా
కంచుగంటలా ఖణేల్ మనే కంఠధ్వని తో
మేడే సభలో మాట్లాడుతున్నది గదా..అదే

మాటను విప్లవీకరించి
యువచైతన్యపు నగారా మోగించి
పురవీధుల్లో పదే పదే
వంగపండు పాటను
ఎర్రజెండాలా ఎగరేసిన కాగడా

ఆ పక్కనకూర్చున్న భోగాది అప్పలస్వామిగారినో
ఈ పక్కనున్న మెరిగాని గోపాలం గారినో
అడిగి చూడండి

అనుభవాలూ..అనుభూతుల అగ్గిసెగ
ఎగసిన ఉత్తేజమై మీలోకీ ప్రవేశిస్తుంది

ఎదురుగా నిలబడి ఉపన్యాసాన్ని వింటున్న
కార్మిక లోకపు హృదయ కవాటాలు తెరచిచూస్తారా
చూడండి
వారి మనసుల్లో ముద్రించుకున్న
ఒకే ఒక్క రూపం కాగడా
మీకు స్పష్టంగా కనిపిస్తున్నది గదా
దానిపేరే కామ్రేడ్ గంటి ప్రసాదం
........
పిచ్చివాడు మాత్రమే
నీడల్ని హత్యజేసి
నిజాల్ని చంపేసానని భ్రమిస్తుంటాడు
వీరుడెప్పుడూ తనశరీరంలో మాత్రమే జీవిస్తాడా!
తనచుట్టూ ఉన్న సమూహాల్లోనూ... జీవిస్తుంటాడు
వెలిగే కాగడా ఒంటరిదా ఎక్కడైనా
ఎన్నింటినో వెలిగిస్తూనే ఉంటుంది కానీ
కాగడాలు వెలుగుతూనే ఉంటాయి
రేపటి వెలుగును వాగ్దానం చేస్తూనే ఉంటాయి

## భాష్పాంజలి

**- బల్ల సరస్వతి**

ఓ గంటి ప్రసాదం నీ కంఠం
కంచు గంట వలె మోగుతున్నది
ఇంకా ఇంకా మోగుతూనే ఉంటుంది
నీటిలో నానదు నిప్పులో కాలదు
గాలికి ఎగిరిపోదు, అవినీతి
అన్యాయాలను అంతం చేయాలనే
నీ ఆశయం చిరకాలం స్థిరంగా నిలుస్తుంది
......
వేట కొడవళ్ళతో తుపాకీ గుళ్ళతో
నిన్నంతం చేయగలరేమో కానీ
ఆత్మీయుల, అమరుల బంధువుల
హృదయాల్లో వెలుగుతున్న ....నీ
ఆశయాల ధుని నెవరార్పగలరు?
............
భౌతికంగా నిన్ను అంతం చేసామని
సంబరపడుతున్న దోపిడీదారుల్లారా
ఆకలి, దు:ఖం, అన్యాయాల్లేని
సమాజం కోరుకుంటున్న ప్రజలు
ఉన్నంతకాలం ప్రసాదం గంటి ఉంటారు.
..........
ప్రజల సొమ్ము మెక్కి మెక్కి
మదమెక్కి బలుపెక్కి దమనకాండకు
పాల్పడుతున్న ప్రభుత్వాలను
ప్రజలే ఎండగడతరు ఎప్పటికైనా....
............
అతి సన్నిహిత మిత్రుడైన
గంటి ప్రసాదం ఇకలేరని
సావిత్రి కంటనీరు పెట్టి
కలవలరపడుతున్నది
నీ హితులు, మిత్రులు
బాధాతప్త హృదయులు
బాధపడి మదనపడి
బాష్పాంజలి ఘటిస్తున్నారు
నీ పునరాగమనాన్ని ఆశిస్తూ.......

## వచ్చే తొలకరిలో మన నల్లమలలో మనం మళ్ళీ ధూలా ఆడతాం కదూ!!

**- అనామధేయుడు**

వాళ్ళంతే-
అలా మౌనంగా వెళ్ళిపోతారు
మన భుజం మీది ఆయుధం మాత్రం
ఒక్కసారిగా బరువెక్కుతుంది

వాళ్ళంతే-
ఒక్కసారిగా గతంగా మిగిలిపోతారు
మన కళ్ళలో సుడులు తిరిగే జ్ఞాపకం మాత్రం
గుండెల్లో గాయమై కెరలుతుంది

వాళ్ళంతే-
చిన్న వీడ్కోలు వాక్యం కూడా ఉండదు
మన చెక్కిళ్ళ మీద ఎప్పటికీ తడియారని
కన్నీటి చెమ్మ మాత్రం సూటిగా గమ్యాన్ని నిర్దేశిస్తుంది

నల్లమలలో మోపిన తొలి అడుగులవి
నల్లమలలో కురిసిన తొలకరి చినుకులవి
నల్లమలలో తలెత్తిన తొలి గరిక పువ్వులవి
నల్లమలలో విరిసిన తునికాకుల తొలి రెపరెపలవి
నల్లమలలో గర్జించిన తొలి గన్నుల వెన్నులవి
నల్లమలలో గుబుర్లెత్తిన వెదురుల తొలి యుద్ధ గానాలవి
నల్లమలలో రూపొందించిన తొలి యుద్ధ వ్యాకారణాలవి

నిజమే కొన్ని వృక్షాలు కూలి ఉండొచ్చు
నిజమే కొన్ని శిబిరాలు వొరిగుండొచ్చు
రెండు చిన్న రాళ్ళ తుంపుల మధ్య తలెత్తుతున్న
పదును పచ్చిక సూటీగా చూస్తూనే ఉంది

అంతు దొరకని లోయల గుండెల్లో సుడులు తిరుగుతున్న
తుపాన్ అదును కోసం ఎదురు చూస్తూనే ఉంది

వాళ్ళంతే-
అలవోకగా అలా అడుగుజాడల్ని మిగిల్చిపోతారు
అవి చరిత్రగా ఘనీభవించి
భవిష్యత్ పతాకమై రేపటిని వాగ్దానం చేస్తాయి

వాళ్ళంతే-
ఆర్భాటమేమీ లేకుండా అలా నిశబ్దంగా కొనసాగిపోతారు
గడ్డకట్టిపోయిన ఆ శూన్యమే తదనంతర తరానికి
మరఫిరంగుల శబ్దాలై, శస్త్రాలై అమరుతుంది

వాళ్ళంతే-
ప్రత్యేకమైన రూపమంటూ ఉంచుకోరు
తర్ఫీదునిచ్చే యుద్ధ శిక్షణా శిబిరాలుగా మారి
విజయవంతమయ్యే ప్రతి దాడిలోనూ
ఎర్రజెండాలై రెపరెపలాడతారు

నల్లమలలో సుడులు తిరిగిన తొలి మేఘగర్జనలవి
నల్లమలలో మార్చింగ్ చేసిన చెంచుల పదునంబులవి
నల్లమలలో తెలంగాణ తురాయిల్ని పొదివిన చేతులవి
నల్లమలలో నిప్పురవ్వల్ని పెనుమంటలుగా
రగిలించిన గుండెలవి
నల్లమలలో వొలికిన ఒక్కో నెత్తుటి బొట్టునీ
ఒక్కో మందుపాతరగా మలచిన వ్యూహాలవి
నల్లమలలో ప్రతీ మలుపునూ ఇంకిన
చెమట బొట్టుల మథనాలవి

నల్లమలలో చేజారిన ప్రతీ ఆయుధాన్నీ జాగ్రత్తగా
దాచి ఉంచిన జమ్మి గుబురులవి

నిజమే కొన్ని అడుగులు పిగిలుండొచ్చు
నిజమే కొన్ని కలలు వొలికుండొచ్చు
ఝుమ్మని ఎగురుతున్న సీతాకోక చిలుకల
రెక్కల మీదుగా కొత్త రుతుపవనం వీస్తూనే ఉంది
నలిగిన ప్రతీ కాలిబాటా సరికొత్త స్పర్శకోసం
వేకువై ఎదురు చూస్తూనే ఉంది

గురవయ్య సారూ!
మన నల్లమలలోని
ప్రతీ పాయలోనూ
నా ఒక్కో నెత్తుటి బొట్టునీ
ఒక్కో విత్తనంగా నాటుతున్నాను

మళ్ళీ ఈ చెంచుగూడాల్లో
మీరు మొలకెత్తుతారు కదూ?

మన నల్లమలలోని
ప్రతీ అణువులోనూ
నా ఒక్కో కన్నీటి బొట్టునీ
ఒక్కో మిణుగురుగా వెలిగించి ఉంచుతున్నాను
మళ్ళీ మన నల్లమల
వెలుతురు జెండాల జాతరవుతుంది కదూ?!

*(జవ్వా వెంకట సుబ్బయ్య గారు (గురవయ్య సారు) స్మృతిలో)*



సంస్మరణ:

## మృదుస్వభావి-ఉద్యమ నిర్మాత

**- డా. మానేపల్లి**

జూలై 4, విరసం ఆవిర్భావ దినోత్సవ సందర్భంగా-నెల్లూరులో ఆ రోజు సభ జరిగింది. దీనికి హాజరయ్యేందుకు గంటి ప్రసాదంగారు నెల్లూరు వచ్చారు. (ఆ సభ కార్యక్రమ పత్రాలు చెంచయ్యగారు నాకూ పంపించారు). ఆ సమయంలో పట్టపగలు అపరాహ్ణవేళలో గంటి ప్రసాదంగారిపై దుండగులు దాడి చేశారు. ఆ దాడిలో ఆయనకు కత్తిపోట్లు, మూడు రౌండ్ల తుపాకి గుళ్ళు తగిలాయి. రక్తమడుగులో కొట్టుకుంటున్న ఆయన్ని ఆస్పత్రి తరలించారు. ఆయన శరీరంలోంచి మూడు తుపాకి గుళ్ళు తొలగించారు. కాని ప్రాణాన్ని మాత్రం రక్షించలేకపోయారు. మర్నాటి తెల్లవారుజామున ఆయన మరణించారు. ఆయన భార్య కామేశ్వరమ్మగారు చాలా సౌమ్యురాలు.

శ్రీకాకుళం జిల్లాలో 1989-2002 మధ్యకాలంలో ఉద్యోగం చేశాను (డిగ్రీ కళాశాల రీడర్). ఆ సమయంలో కర్రిమణి హత్య కేసు- నిజనిర్ధారణ కమిటీలో ఒకసారి, మామిడి అప్పలసూరిగారు మరణించినపుడు- పరామర్శించడానికి కోమర్తి వెళ్ళినపుడు మరొకసారి ప్రసాదంగార్ని కలిశాను. ఆ దరిమిలా విరసం, ఎపిసిఎల్‌సి సభల్లోనూ ఇతరత్రానూ ఆయన్ని కలిశాను. ఆయన మహోపన్యాసకుడు కాదు గాని చాలా నిక్కచ్చిగా తగిన రీతిలో ప్రసంగం చేసేవారు. వ్యక్తిగా మృదుస్వభావి. మిత్ర సులభుడు. ఆయన తమ్ముడనుకుంటాను విశాఖజిల్లాలో టీచర్‌గా పనిచేస్తున్నప్పుడు, 2002లో గావును ఒకసారి కలిసినట్టు గుర్తు.

ప్రసాదంగారి హత్యకు పూర్తి బాధ్యత ప్రభుత్వానిదీ, పోలీసులదీ. విప్లవకారుల్ని, ఉద్యమ నాయకుల్నీ చంపితే - ప్రజాపోరు ఆగిపోదు. కాగా మరింత ముందుకు పోతుంది. ఆయన్ని హత్య చెయ్యడం పచ్చి దుర్మార్గం. ప్రభుత్వం తన పిరికితనాన్ని, దుర్మార్గస్వభావాన్ని బయటపెట్టుకుంది.

గంటి ప్రసాదం అమర్‌హై! విప్లవం వర్ధిల్లాలి! మార్క్సిజం-లెనినిజం వర్ధిల్లాలి!

# ఆదర్శ కమ్యూనిస్టు ఆలూరి భుజంగరావు

- వరవరరావు

షహీద్ భగత్‌సింగ్ గురించి బిపిన్‌చంద్ర, ఎజి నూరానీ, చమన్‌లాల్ వంటి చరిత్రకారులు, న్యాయకోవిదులు, పరిశోధకులు శోధించి ఇప్పటికీ వెలికితెస్తున్న ఎన్నో ఉత్తేజకరమైన సంఘటనలు, సందర్భాలు, దార్శనిక భావజాలంకన్నా ముందు తెలుగు పాఠకుల ఒక తరాన్ని విప్లవ భావజాలం వైపు ఆకర్షించిన, నిలిపిన ప్రామాణికగ్రంథం 'సింహావలోకనం'. భగత్‌సింగ్ సమకాలికుడైన యశపాల్ భగత్‌సింగ్‌ను కేంద్రబిందువుగా చేసుకుని తానుకూడ తలమునకలుగా పాల్గొన్న విప్లవోద్యమం గురించి రాసిన ఆ గ్రంథం యశ్‌పాల్‌దని గుర్తుపెట్టుకున్నంతగా తెలుగు పాఠకులు దాని అనువాదకుడు ఆలూరి భుజంగరావుగారిని గుర్తుపెట్టుకున్నారా? భగత్‌సింగ్ తల్లి, అన్న కుటుంబం నుంచి ఆయన అరుదయిన జీవిత విశేషాలు విని ఇవ్వాటికీ మిగతా ఎవరికన్నా కూడ భగత్‌సింగ్ దార్శనికతను ఇవ్వాటి సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామిక ఉద్యమంలో భాగంగా ప్రచారం చేస్తున్న ఆయన మేనల్లుడు ప్రొఫెసర్ జగమోహన్‌సింగ్ వలె భగత్‌సింగ్ అంతర్‌బహిర్ లోకాలను చూసినవాడు యశ్‌పాల్. ఆలూరి భుజంగరావుగారు అనువాదం చేయకపోతే హిందీలో రాసిన ఆ పుస్తకం తెలుగుపాఠకులకు అందుబాటులోకి వచ్చేదే కాదు.

ప్రేంచంద్ 'రంగభూమి' నవల అంత ఉద్గ్రంథమైనా ఏకబిగిని అది చదివేసిగాని బయటి ప్రపంచంలోకి రాలేకపోయానని నిన్న జూన్ 20 సాయంత్రం గుంటూరులోని ఆలూరి భుజంగరావుగారి అంత్యక్రియల దగ్గర నాతో ఒక పాఠకురాలు అన్నది. ప్రేంచంద్ సాహిత్యం, రాహుల్ సాంకృత్యాయన్ సాహిత్యం చదవని బుద్ధిజీవిని, సామాజిక స్పృహకలిగిన వ్యక్తిని ఊహించుకోవడం కష్టం. హిందీ, ఇంగ్లిషులలో అవి చదువలేనివారు, చదవనివారు అవి మా చిన్నప్పుడే చదివాం గాని వాటిలో ప్రేంచంద్ 'గబన్', 'నోరా', రాహుల్ సాంకృత్యాయన్ 'జయయౌధేయ', 'విస్మృత యాత్రికుడు', 'దివోదాసు', 'దర్శన్ దిగ్దర్శన్ ' (ప్రాక్పశ్చిమ దర్శనాలు) మొదలయిన పుస్తకాలను ఆలూరి భుజంగరావుగారు అనువాదం చేసారని గుర్తుపెట్టుకోలేదు, ఆయనతో పరిచయం చేసుకోవాలని అనుకోలేదు అని బాధపడినవాళ్లు కూడ ఉన్నారు. ఆలూరి భుజంగరావుగారు కిషన్‌చందర్ 'వాయుగుండం', 'పరాజయం' నవలలు కూడ అనువదించారు.

అయితే ఇదంతా ఐక్య కమ్యూనిస్టుపార్టీ, ఆ పార్టీ ప్రచురణసంస్థలు 1930ల నుంచి 50ల వరకు నెలకొల్పిన ఉత్తమ విలువలు తెలిసినవారికి ఆశ్చర్యకరమైన విషయాలు కావు. గొప్ప సృజనాత్మక రచయితలందరినీ గొప్ప అనువాదకులుగా కూడ తీర్చిదిద్ది అనువాదం కోసమే ఒక సమర్థవంతమైన రచయితల బృందాన్ని తయారుచేసిన ఘనత కూడ ఐక్యకమ్యూనిస్టుపార్టీదే.

తెనాలిలో సుప్రసిద్ధ నవలారచయిత శారద కృషియైనా, ఆ తర్వాత కాలంలో గుడివాడలో 'సాహిత్యనికేతన్' ఏర్పాటుచేసి ఆలూరిభుజంగరావుగారు చేసిన కృషియైనా పూర్తిగా అట్లా ఒక నిర్మాణంలో భాగమని చెప్పలేం.

నక్సల్బరీ 'వసంత మేఘ గర్జన' తర్వాత కూడ ఆ సంప్రదాయాన్ని కొనసాగించిన ఏకైకవ్యక్తి మాత్రం ఆలూరి భుజంగరావు. సమకాలీన చేదునిజాలను యశ్‌పాల్ చెప్తే ఆయన మాటలు ఈ లోకానికి చెప్పాల్సినవని అనుకున్నాడు. 1968 తర్వాత సరోజ్‌దత్తా చెప్తే కూడ ఇవి ఇవ్వాటి అవసరాలు, ఈ తరం తెలుసుకోవాల్సిన వాస్తవాలు అనుకొని అనువాదం చేసాడు. విగ్రహారాధనగా మారి భారత పునర్వికాస పితృత్వాల చర్విత చరణాలను సరోజ్‌దత్తా సాహసంగా ప్రశ్నిస్తే ఆ చిన్న చిన్న పొత్తాలను భుజంగరావుగారు తెలుగులోకి అనువదించి నక్సల్బరీ తరానికి అందించారు. 'గాంధీజీ' పై 'మరోసారి ఈ దేశం మోసపోకూడదు' వంటి కవితలు ఇటువంటి రచనలు తెలుగులో వెలుగు చూడకుండా సాధ్యమయ్యేవికావు.

సామాజిక మార్పును కోరే నిజాయితీకల బుద్ధిజీవికి ఆలూరి భుజంగరావు జీవితం ఒక ఆదర్శం. అటువంటి జీవితం ఎనభైఅయిదేళ్లు గడవగలగడమనేది నిజంగానే అసిధారావ్రతం. ఆ జీవితం కూడ ఎట్లా మొదలయింది – దుర్భరంగా, ఇవ్వాళ మనం ఊహించుకోలేని అష్టదరిద్రంలో. ఆంధ్రాప్యారిస్ అని పిలుచుకున్న తెనాలిలో ముగ్గురిజీవితం అట్లా మొగ్గదొడిగింది. బురదగుంటలో చావకుండా బతికిన చిగురువలె, సుడిగాలికి తట్టుకొని నిలిచిన గడ్డిపోచవలె. ఆ ముగ్గురు 'శారద' పేరుతో 'మంచీచెడూ', 'అపస్వరాలు', 'ఏదీసత్యం' – వంటి జీవితసత్యాలను ఆవిష్కరించిన నవలలు, కథలు రాసిన నటరాజన్ అనే తమిళుడు, ఆలూరి భుజంగరావు, ప్రకాశం. ప్రకాశం ఈ ముగ్గురి బృందానికి కమ్యూనిస్టు భావజాలాన్ని అంటించిన నాయకుడు. భుజంగరావుగారి తెనాలి జీవితంలో ఇంతే దుర్భరమైన జీవితాన్ని అనుభవించిన రావూరి భరద్వాజ కూడ ఉన్నారు. ఆలూరి భుజంగరావు హోటల్ వర్కర్‌గా పనిచేస్తూ, చదువు, రచన ఒక వ్యసనంగా గడిపిన బాల్యం, నవయవ్వనాల గురించి 'శారద'ను కేంద్రస్థానంలో పెట్టి రాసిన 'సాహిత్యబాటసారి శారద', తన తర్వాత జీవితాన్ని కూడ ఆవిష్కరించిన 'గమనాగమనం', 'గమ్యం దిశగా గమనం' పుస్తకాల్లో చదువుతూ ఉంటే ఇన్ని కష్టాలు తట్టుకొని, ఇంత దారిద్ర్యాన్ని, ఇంత ప్రమాదాన్ని ఎదుర్కొని ఈ ఐక్కపలచని మనిషి నిండుజీవితం ఎట్లా గడిపాడా అని ఆశ్చర్యం వేస్తుంది. అయితే 'శారద' బతికున్నంతకాలం (చాల అల్పాయుష్కుడుగా, దారిద్ర్యం నుంచి విముక్తి లేకుండా దారిద్ర్యానికే ఎర అయ్యాడు 'శారద') ఆలూరి భుజంగరావు సృజనాత్మక రచనలు ఆయనే చేయాలనుకున్నాడు.

ఆయన జీవితంలోని మూడుదశల్లో మూడవదశలో అరవయ్యో, డెబ్బయ్యో పడిలో గానీ ఆయన ఎక్కువ సృజనాత్మక రచనలు చేయలేదు. 'కొండవాగు', 'ప్రజలు అజేయులు' వంటి నవలలు,

'అరణ్యపర్వం' వంటి కథలు – అన్నీ ఆయన కమ్యూనిస్టుజీవితంలోని, విప్లవోద్యమంలోని స్వానుభవాలు.

'సాహిత్యబాటసారి శారద'లో మనకు ఆయన శారదవంటి ఒక నిప్పులో పుటం పెట్టిన సాహిత్య నిమగ్నజీవిని పరిచయం చేస్తూ, ఆ పరిచయక్రమంలో దేశ, కాల, పాత్రల్లో శారదను, తనను లొకేట్ చేస్తే, 'ప్రజలు అజేయులు'లో 1980, 90లలో తెలంగాణలో జరిగిన విప్లవోద్యమం, అందులో నల్గొండజిల్లా పీపుల్స్‌వార్ కార్యదర్శిగా అమరుడైన కిరణ్ చుట్టూ ఆ రెండు దశాబ్దాల ఆటుపోటులను చిత్రించాడు. కోరుట్లలో రాడికల్ ఉద్యమంతో ఆకర్షితుడైన కిరణ్ పూర్తికాలం విప్లవకారుడుగా మారి పీపుల్స్‌వార్‌పార్టీలో చేరి అంచెలంచెలుగా ఎదిగి నలగొండజిల్లా విప్లవోద్యమ నిర్మాణం చేస్తూ కార్యదర్శి అయి యాదగిరిగుట్ట పోలీసుస్టేషన్‌పై దాడి చేసి ఆయుధాలు స్వాధీనం చేసుకొని సాహసికంగా తప్పించుకుంటున్నపుడు మూసీనది ఉప్పొంగి దారులు మూసుకపోయి పోలీసులకు ఎదురుపడి 'ఎన్‌కౌంటర్' అయిన కథనం కల్పనకన్నా గగుర్పొడిచే వాస్తవం. ఆ కిరణ్ స్వయంగా భుజంగరావుగారి అల్లుడు. ఆలూరి భుజంగరావుగారు ఒంటరి విప్లవ పరివ్రాజకుడు కాదు. నిన్నటిదాకా ఆయన వేలుపట్టుకొని ఏభైఏళ్లుగా ఆయనతో విప్లవపథంలో నడుస్తున్న లలితగారితో పాటు ఆయన తన నలుగురు కూతుళ్లనూ విప్లవోద్యమంలోకి తెచ్చాడు. తెచ్చాడంటే తన బహిరంతర ఆచరణలో అటువంటి వాతావరణాన్ని కల్పించాడు. ఆ తర్వాతకాలంలో వాళ్లు ఎటువంటి జీవితాలను ఎంచుకున్నా ఆయన రక్తబంధుత్వం కూడ వర్గబంధుత్వ దృక్పథాన్ని నిలుపుకునే తనదైన ఒక జీవితాదర్శాన్ని ఆయన వదిలిపోయాడు.

గుడివాడలో హిందీపండిట్‌గా పనిచేసిన కాలంలో ఆయనకు గంజి రామారావు, మునిస్వామిగార్లతో పరిచయం, గాఢానుబంధం ఏర్పడింది. అదే ఆయనను విప్లవ రాజకీయాల్లోకి తెచ్చింది. 1986లో ఉద్యోగ విరమణ తర్వాత ఆయన పూర్తికాలం అనువాద దశనుంచి విప్లవం కోసం సాహిత్య కృషి చేసే పనిని ఎంచుకున్నాడు. 1984లో లేటువయసులో విప్లవంపై ఘాటుప్రేమతో విరసంలో చేరాడు. అక్కడ కూడ ఆగకుండా ఆరుసంవత్సరాల పాటు అజ్ఞాతజీవితంలో గడిపి దండకారణ్య విప్లవోద్యమం నిర్వహిస్తున్న 'ప్రభాత్' హిందీపత్రిక సంపాదకవర్గంలో బాధ్యతలు పంచుకున్నాడు.

ఐక్యకమ్యూనిస్టు పార్టీ దశలో రాహుల్ సాంకృత్యాయన్, ప్రేంచంద్, కిషన్‌చందర్, యశ్‌పాల్‌వంటి రచనలు అనువదించడానికి ఎంచుకున్నట్లే నక్సల్బరీ, శ్రీకాకుళం, జగిత్యాల, దండకారణ్య విప్లవోద్యమదశలో తెలుగు నుంచి హిందీలోకి 'విప్లవ సాహిత్యాన్ని' అనువాదం చేసి దేశానికంతా తెలంగాణ, దండకారణ్య విప్లవోద్యమాలను పరిచయం చేసాడు. సాధన రాసిన 'రాగో' నవల, సికాస కథలు 'బొగ్గుపొరల్లో', విరసం సంకలనం చేసిన 'నేలతల్లి విముక్తికోసం' కథలు, దండకారణ్య అమరవీరులు, అల్లంరాజయ్య కథ 'అతడు' హిందీలోకి అనువాదం చేసాడు.

ముప్పైఏళ్లుగా విరసంలో సభ్యుడుగా ఆయన క్రమశిక్షణ గురించి చెప్పాలి. ఆయన, లలితగారు ఆయన ఆరోగ్యం అనుమతిస్తే రాకుండా ఉండే సభ, సమావేశం ఉండవు. శ్రద్ధగా వినాలి, చర్చలో పాల్గొనాలి, అంతే కాదు ఇద్దరూ చంకకు తగిలించుకుని తెచ్చే పుస్తకాలు పరచి అవి సభాస్థలి దగ్గర అమ్ముతూ కూచోవాలి. ఏకకాలంలో ఒక బుద్ధిజీవిగా, ఒక కార్యకర్తగా, అన్నిటినీ మించిన సాంస్కృతిక యోధునిగా ఆయన ఆఖరిశ్వాసవరకు కూడ ఇప్పటితరానికి ఒక కఠోరమైన ఆచరణ నమూనగా నిలిచిపోయాడు. కెవిఆర్ విప్లవరచయితలసంఘం అనే పదసముదాయంలో విప్లవం, రచన, సంఘ చైతన్యం – ఏ ఒక్కటీ తక్కువ చేయాల్సింది కాదు అని అంటుండేవాడు. ఆలూరి భుజంగరావుగారి జీవితం విరసంకు రెట్టింపు గనుక ఆయనను అంతకన్న మించిన ఆదర్శ కమ్యూనిస్టుగా ఆవాహన చేసుకోవడం ఈ తరానికి సార్థకమైన స్ఫూర్తి.

21.06.2013

తాజాకలం –

ఈ సంస్మరణలో ఒక విస్మృతి జరిగిందని పెండ్యాల మల్లేశ్వరరావు (భూషణం), కృష్ణక్క గుర్తుచేసారు.

చిత్తూరుజిల్లాలో 'ఎన్‌కౌంటర్' అయిన సి. రా (సి. రామచంద్రారెడ్డి) ఆలూరి భుజంగరావుగారి పెద్ద అల్లుడు. ఆయన విరసం సభ్యుడు కూడ. తిరుపతిలో చరిత్ర ఐచ్ఛికంగా ఎం.ఎ. చేసాడు. త్రిపురనేని మధుసూదనరావుగారి ప్రభావంతో విప్లవ రాజకీయాల్లోకి వచ్చి మొదట రాడికల్ విద్యార్థిసంఘంలో, ఆ తర్వాత హైదరాబాదు బృందావన్ హోటల్లో ఉద్యోగం చేసిన రోజుల్లో విరసంలో క్రియాశీలంగా పనిచేసాడు. ఆ తర్వాత పూర్తికాలపు విప్లవ అజ్ఞాత జీవితాన్ని ఎంచుకొని పీపుల్స్‌వార్ పత్రిక 'క్రాంతి'లో పనిచేసాడు. కామ్రేడ్ కె.ఎస్. నాయకత్వంలో ఏర్పడిన పార్టీ చిత్తూరుజిల్లా నిర్మాణ బాధ్యతల్లో ఉండగా అరెస్టయి బూటకపు ఎన్‌కౌంటర్‌లో అమరుడయ్యాడు. ఆలోచనాపరుడు, కవి, రచయిత అయిన సి.రా. రచనలను, సి.రా.పై స్మృతి వ్యాసాలను కలిపి విరసం పుస్తకంగా కూడ ప్రచురించి సంస్మరణసభలు నిర్వహించింది. ☆

# విప్లవం ఒక బాధ్యత

- వి. చెంచయ్య

ఎవర్ని చూసినా చిరునవ్వు విరబూసే ముఖం, అమాయకత్వంతో కూడిన చూపు, ప్రేమాభిమానాలకు ప్రతిరూపం, ఈ దేశంలో విప్లవం అనివార్యం అన్నంత ఆత్మవిశ్వాసం, కమ్యూనిస్టు ఉక్కు క్రమశిక్షణ, చిత్తశుద్ధి, అల్పసంతోషం, అనల్ప సాహసం ఇవన్నీ కలిస్తే ఆలూరు భుజంగరావు.

85 ఏళ్ళ వయసులో కూడా ఉత్సాహంగా విరసం సభలకు హాజరుకావడం, ఎక్కడకు వెళ్ళినా ఆయన సహచరి లలితాగారితో కలిసి వెళ్ళడం, సభల్లో విప్లవ సాహిత్యం అమ్మడం, అంతపెద్ద సాహితీవేత్త అయినా సీదాసాదాగా ఉండడం ఆయన ప్రత్యేకత.

నేను కళాశాల అధ్యాపకుడిగా చేరిన తొలి దశకంలో 1978-80 ప్రాంతాల్లో అప్పటి ఇంటర్మీడియట్ తెలుగు వచన విభాగంలో 'దాశరాజ్ఞ యుద్ధం' పేరుతో ఒక పాఠం ఉండేది. చరిత్ర సంబంధమైన విషయం కావడంతో, చరిత్ర పట్ల నాకున్న ప్రత్యేక ఆసక్తితో భారతదేశం మ్యాపు తీసుకువెళ్ళి మరీ పాఠం చెప్పేవాణ్ణి. తెలుగు అధ్యాపకుడిగా నేను క్లాసుకు మ్యాపు తీసుకవెళుతుంటే అందరూ ఆశ్చర్యంగా చూసేవారు. ఆ 'దాశరాజ్ఞ యుద్ధం' రచయిత ఆలూరి భుజంగరావు ఆయనతో నాకు తొలి పరిచయం అలా జరిగింది. నేను ఆసక్తితో చెప్పిన కొద్ది పాఠాలలో అదొకటి. వ్యక్తితో పరిచయం లేకపోయినా ఒక రచయితగా భుజంగరావు పట్ల గౌరవం ఏర్పడింది.

ఆ సందర్భంగా ఇంకో తమాషా జరిగింది. మా గురువు రచయిత అయిన భుజంగరాయ శర్మగారు అప్పటికింకా మా కళాశాల (జవహర్ భారతి, కావలి)లో సీనియర్ తెలుగు అధ్యాపకులుగా ఉండేవారు. ఆలూరి భుజంగరావు అప్పటికి మా ప్రాంతంలో పెద్దగా పరిచయస్తుడు కాకపోవడం, భుజంగరాయశర్మగారు అందరికీ తెలిసి ఉండడం వల్ల విద్యార్థులు పరీక్షల్లో భుజంగరావు పేరు బదులు భుజంగరాయ శర్మ పేరు రాసేవారు. ప్రతి క్లాసులో ప్రత్యేకంగా రచయిత పేరు గురించి చెప్పవలసి వచ్చేది. అలా అధ్యాపకులైన మాకూ, మా విద్యార్థులకూ భుజంగరాయ శర్మగారితోపాటు భుజంగరావు పేరు కూడా బాగా పరిచయం.

అప్పటికే నేను విరసం సభ్యుణ్ణి కూడా కావడం వల్లా, సాహిత్యం, చరిత్ర, తత్వశాస్త్రం నా అభిమాన విషయాలు కావడం వల్లా భుజంగరావు తెలుగువారికి పరిచయం చేసిన రాహుల్ సాంకృత్యాయన్ రచనలూ, యశ్‌పాల్ సింహావలోకనం చదివాక ఆయనపై మరింత ఆసక్తి పెరిగింది.

1985లో నెల్లూరులో జరిగిన ఒక సన్నివేశం గురించి ఇక్కడ చెప్పడం అవసరం. అప్పటికి సంవత్సరం క్రితమే 1984 మాకి వలస విరసం సభల్లో భుజంగరావు విరసం సభ్యుడిగా చేరాడు. 1985లో నెల్లూరు టౌన్‌హాలులో జరిగిన కోస్తా ప్రాంత రైతు కూలీ సదస్సుకు భుజంగరావు కూడా హాజరయ్యాడు. ఆ సదస్సుకు బయటి ప్రాంతాల నుండి రావలసిన నలుగురు వక్తలలో ఒక్కరూ రాకపోవడంతో, ఆరోజంతా ఏదో విధంగా ఆ సదస్సుకు నిర్వహించవలసిన బాధ్యత కె.వి.ఆర్. పైనా, నా పైనా పడింది. ఉదయం నా అధ్యక్షతన కె.వి.ఆర్. వక్త, మధ్యాహ్నం కె.వి.ఆర్. అధ్యక్షతన నేను వక్తని. మా ఇద్దరితోనే తెల్లారదు గదా! స్థానిక జననాట్యమండలి మా పరువు కొంత కాపాడింది. ఉదయం సెషన్‌లో కె.వి.ఆర్. మాట్లాడాక, అధ్యక్షుడిగా నేను శ్రోతల్లోంచి కొందరిని వాళ్ళ అనుభవాలు చెప్పమని ఆహ్వానించా వేదికపైకి వచ్చిన వాళ్ళలో ఆలూరి భుజంగరావు ఒకరు.

అంతకుముందే నెల్లూరు జిల్లాకు చెందిన ఒక అమరుడి తండ్రి వేదికపైకొచ్చి తన ఆవేదనను, బాధను వ్యక్తం చేశాడు. పెద్ద పెద్ద నాయకుల మాటలు విని యువకులు ఉద్యమంలో చేరి ప్రాణాలు పోగొట్టుకుంటున్నారని ఆయన మాటల సారాంశం. ఆయన మాటలే భుజంగరావు వేదికపైకి రావడానికి ప్రేరణనిచ్చాయి. పెద్దల మాటలు విని యువకులు ఉద్యమంలోకి రావడమే కాదు, యువకుల త్యాగాలు చూసి నాలాంటి వృద్ధులు సైతం ఉద్యమం వైపు ఆకర్షింపబడుతున్నారని భుజంగరావు మాట్లాడిన తీరు అందరిలో ఉత్తేజాన్నీ ఉత్సాహాన్నీ కలిగించింది. ఆయన మాటలతో హాలంతా చప్పట్లతో మార్మోగిపోయింది.

ఆ తర్వాత కొంతకాలానికి భుజంగరావు రాసిన 'సాహిత్య బాటసారి శారద' అనే పుస్తకాన్ని చదివాక, శారద జీవితంతోబాటు భుజంగరావు జీవితంలోని కష్టాలూ, ఆటుపోట్లూ అర్థమయ్యాయి. ఒకపక్క జీవన పోరాటం చేస్తూ, మరోపక్క గొప్ప రచయితలుగా రూపొందిన క్రమం అర్థమయింది. నటరాజన్ అనే ఒక తమిళ యువకుడు బతుకుతెరువు కోసం తెనాలి వచ్చి, హోటల్ వర్కర్‌గా ఉంటూ, పది నిమిషాలు తీరిక దొరికితే పుస్తకాలు చదువుకుంటూ, రచనలు చేస్తూ, అప్పుడప్పుడూ హోటల్ యజమాని ఆగ్రహానికి గురవుతూ, అప్పటి పత్రికల్లో వారం వారం కాలమ్స్ రాసేస్థాయికి ఎదిగిన శారద (నటరాజన్)ను తెలుగు సాహిత్యలోకానికి పరిచయం చేసిన గొప్ప పుస్తకం అది. శారద భుజంగరావుకు సన్నిహిత మిత్రుడు కావడంతో ఆ పుస్తకంలో ఇద్దరి జీవితానుభావాలూ చోటు చేసుకున్నాయి. మొత్తం మీద సాధారణ పాఠకులకే గాకుండా, రచయితలకు సైతం భుజంగరావు జీవితానుభవాలూ, సాహిత్య కృషీ ప్రేరణనిస్తాయి. ఆ తర్వాత కొన్నేళ్ళకు కళాశాల అధ్యాపకుల కోసం నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగుశాఖ ఆధ్వర్యంలో జరిగిన రిఫ్రెషర్ కోర్సులో పాల్గొన్న నేను శారద జీవిత సాహిత్యాల గురించి ఒక వ్యాసం రాసి చదివితే, ఆ కోర్సుకు హాజరయిన 40 మంది అధ్యాపకులు కిక్కురుమనకుండా విన్నారు. అలా వినిపింపజేసిన

గొప్పదనం శారదదీ, శారద గురించి రాసిన భుజంగరావుదీ మాత్రమే.

ఈ జూన్ 20న వేకువజామున 3 గంటలప్పుడు ఫోను ద్వారా విన్న భుజంగరావు మరణవార్త దిగ్భ్రాంతికి గురి చేసింది. దిగ్భ్రాంతికి కారణం ఆయన ఎనభై అయిదేళ్ళ యువకుడు కావడం! మధ్యాహ్నానికల్లా గుంటూరు చేరాను. విప్లవ విజయంపట్లా, సమాజ భవిష్యత్తుపట్లా ఎప్పుడూ ఆయనలో నిరాశా నిస్పృహాలు కనిపించలేదు. శవ పేటికలో ఉన్న భుజంగరావు మృతదేహాన్ని చూస్తుంటే – 'నా బాధ్యత తీరిపోయింది, విప్లవాన్ని కొనసాగించడంలో ఇక మీ బాధ్యత మిగిలి ఉంది' అని హెచ్చరిస్తున్నట్టు అనిపించింది. ఆ పక్కనే ఏర్పాటు చేసిన భుజంగరావు రచనల ప్రదర్శనపైకి చూపు వెళ్ళింది. దాదాపు అన్ని పుస్తకాలూ పరిచయమైనవే అయినా, మళ్ళీ ఒకసారి అన్నిటినీ ఒకచోట చూసే అవకాశం లభించింది. అంతవరకూ నేను చూడని ఒక పుస్తకం అక్కడ కనిపించింది. అది ఆయన కథల సంపుటి 'అరణ్యపర్వం'. అది పదహారేళ్ళ క్రితం 1997లో అచ్చయినా నేను చూడలేకపోయినందుకు బాధపడ్డాను. వెంటనే దాన్ని సంపాదించి, కావలికి వచ్చి చదివిందాకా మనసు కుదుట పడలేదు. అందులో కొన్ని కథలూ, కొన్ని కథనాలూ ఉన్నాయి. కథలకన్నా కథనాలు నన్నెక్కువగా ఆకర్షించాయి. చాలా సహజంగా కనిపించే భుజంగరావు కథనశక్తి పాఠకున్ని తనతోబాటు లాక్కువెళుతుంది. అందులో ముఖ్యంగా దండకారణ్య ఉద్యమాన్ని గురించిన తన ప్రత్యక్షానుభవాన్ని వివరించే 'కొండవాగు' విప్లవ స్ఫూర్తిని కలిగించే రచన. వయసుమళ్ళిన తర్వాత, 20 రోజులపాటు జరిగే పార్టీ రాజకీయ తరగతుల కోసం అడవికి వెళ్ళిన అనుభవాలను వివరించే రచన. 20 సంవత్సరాల వయసులో ఉన్న మహిళా గెరిల్లా కామ్రేడ్లను చూసి, స్ఫూర్తిని పొంది భుజంగరావు ఇలా రాసుకున్నాడు – "ఏ దేశంలో స్త్రీలు కూడా వర్గశత్రువుతో పోరాడడానికి గెరిల్లాదళంలో చేరి, బందూకు చేబూని విప్లవ పోరాటంలోకి దూకుతారో, ఆ దేశంలో దోపిడీ రహితమైన సామ్యవాద వ్యవస్థ తప్పక స్థాపించబడుతుంది. వర్గశత్రువు, దోపిడీ ప్రభుత్వం ఎంత నిర్బంధాన్ని అమలు చేసినా విప్లవ పోరాటాన్ని ఆపలేవు.' ఈ ఆత్మవిశ్వాసం భుజంగరావులో 85 ఏళ్ళ వయసులో కూడా సడలిపోలేదు. ఆ అడవిలో చెట్ల నుండి కిందకు రాలిపడుతున్న పండుటాకుల దృశ్యాన్ని చూసి, నూతన ప్రజాస్వామిక విప్లవ విజయం కోసం ప్రాణాలర్పిస్తున్న అమరవీరుల త్యాగాలను స్ఫురణకు తెస్తోందంటాడు.

'ఆకలి' కథలో తెనాలిలోని నెహ్రూ కేఫ్ హోటల్ గురించి, అందులో పని చేసేవాళ్ళ గురించి రాశాడు. శంకర్‌రావు అనే పిల్లవాడు ఆ హోటల్‌లో బాల కార్మికుడు. యజమానిపెట్టే శారీరక హింసల్ని భరించలేక ఆ పిల్లాడు బీడీలు తాగే అలవాటును బలవంతంగా చేసుకున్నాడు. ఎందుకంటే బీడీలు తాగడానికి కొంతయినా విశ్రాంతి లభిస్తుంది! తన మిత్రుడు శారద ప్రత్యక్ష అనుభవాలు భుజంగరావుకి ఉండనే ఉన్నాయి. 'ఆకలి' పేరుతో కథ రాశాడేగాని, అందులో కల్పన ఏమాత్రం లేదనిపిస్తుంది. కొన్ని సందర్భాల్లో వాస్తవాలే కథకు అనసరమైన కల్పనల్లా కనిపిస్తాయి. 'నిన్నటికి నేడు ఏమవుతుంది?' అన్న కథ కూడా ఇలా కల్పనలా కనిపించే వాస్తవమే. 1950లో రేపల్లెలో జరిగిన సంఘటన. భారతదేశ తొలిప్రధాని నెహ్రూ పరిపాలన సాగుతున్న రోజులు అంతకంటే ముఖ్యంగా తెలంగాణ పోరాటం కొనసాగుతున్న రోజులు. నిజాం పాలనలోకంటే, స్వతంత్ర భారత సైన్యంతో తలపడుతూ తెలంగాణ గెరిల్లాలు అధికాధికంగా ప్రాణాలర్పిస్తున్న రోజులు! అప్పుడు కోస్తా రాయలసీమ జిల్లాలు కలిసి ఉన్న మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రి అచ్చమైన తెలుగువాడు టంగుటూరి ప్రకాశం పంతులు 'ఆంధ్రకేసరి' పరిపాలన! భారత సైనికుల దుర్మార్గాల వల్ల కుటుంబ సభ్యుల్ని పోగొట్టుకున్న వాళ్ళు, ఆ బాధ తీరడానికి తనివిదీరా ఏడవడానికి కూడా అవకాశం లేదు. ఎందుకంటే ఏడిస్తే తెలిసిపోతుంది. ఆ ఏడ్చే వాళ్ళను కూడా తీసుకెళ్ళి హింసిస్తారు. నిన్నటికి నేడు ఏమవుతుందని కథకు సరైన పేరు పెట్టాడు భుజంగరావు. నిన్న అంటే నిజాం పాలన. నేడు అంటే స్వతంత్ర భారత నెహ్రూ పాలన. రెండిటికీ ఏమీ తేడా లేదని చెప్పడం ఉద్దేశం.

విప్లవ రాజకీయ వాసన లేని కథా వస్తువును తీసుకున్నా, విప్లవ రాజకీయ దృక్పథాన్ని కలిగించే విధంగా ఆలోచన రేకెత్తిస్తాడు భుజంగరావు. గొప్ప కథకులకు ఉండే లక్షణం ఇది. పోలీసాఫీసరు ఇంట్లో పనిచేసే జవానుకూ, ఇస్త్రీ షాపులో కూలికి పనిచేసే అతనికి అర్ధరూపాయి దగ్గర తగాదా పడి కొట్టుకుంటారు. ఇద్దరూ తమతమ యజమానుల కోసం తగాదా పడతారేగాని తమకోసం కాదు. ఇస్త్రీ బట్టలకివ్వాల్సిన డబ్బులో అర్ధరూపాయి తక్కువగా ఇచ్చి పంపిన పోలీసాఫీసరు ఆ విధంగా తన అధికార దర్పాన్ని తన దగ్గర పనిచేసే వాడిద్వారా ప్రదర్శిస్తాడు. అర్ధరూపాయి తగ్గినా ఒప్పుకోని నిజాయితీని ప్రదర్శిస్తాడు. ఇస్త్రీ షాపులో కూలికి పని చేసేవాడు. 'ఎవరు ఎవరి కోసం కొట్టినట్టు? ఎవరు ఎవరి కోసం దెబ్బతిన్నట్టు?' అనే ప్రశ్నలతో ముగుస్తుంది కథ. కుటుంబరావు అన్నట్లు ఆనందం అంటే బుద్ధి వికాసమే. సాహిత్యంవల్ల కలగాల్సిన ఆనందం ఇలాంటిదేనని భుజంగరావు సాహిత్యం నిరూపిస్తుంది.

భుజంగరావు అనువాద సాహిత్యంగానీ, స్వతంత్ర సాహిత్యంగానీ, ఆయన జీవితాచరణగానీ మనల్ని ఉద్యమంవైపు పరుగులు పెట్టిస్తాయి. ఆయన ఆలోచన విప్లవం. ఆయన ఆచరణ పోరాటం. ఆయన సాహిత్యం విప్లవ పోరాట చైతన్యం. 'పరుగు' కథలో ఆయనే అన్నట్టు జీవితమూ పరుగే, విప్లవమూ పరుగే! భుజంగరావు అనుభవంలోలాగే ఆ పరుగు బాధ్యతతో కూడుకున్నదేగాని, బాధతో కూడుకున్నది కాదు, కాకూడదు! 

**సవరణ:** అరుణతార మార్చ్–ఏప్రిల్ 2013 సంచిక (30వ పేజీ) లో బి. చంద్రశేఖర్‌కు నివాళి చూశాను. కా. చంద్రశేఖర్ మంచి వక్త మాత్రమే కాదు. మంచి రచయిత కూడా. ఎన్‌జిఓల కథ, శాంకో వాంజెట్టీలాంటి పుస్తకాలు రాశాడు. ఎన్‌జిఓల కథని 2003 మార్చి అరుణతారలో శంకర్ చక్కగా విశ్లేషించారు కూడా. రచనలు నిలిచిపోతాయి. అవి చదివి ఎడ్యుకేట్ అవుతాం. చంద్రశేఖర్‌లోని ముఖ్యమైన పార్శ్వం మిస్ చేయడం బాధాకరం.

- కృష్ణాబాయి

# ఆయన జీవితం మాకు ఆదర్శం!

ఈ రోజు నాన్నగారు లేరంటే చాలా దుఖం ముంచుకొస్తోంది. ఇంతతొందరగా నాన్నగారు మమ్మల్ని వదిలి వెళతారని ఊహించలేదు. నాన్నగారు మీరు ఎలా వున్నారు అని అడిగితే మాకేన్నాయనా తిండికి బట్టకు లోటులేదు. ఈ దేశంలో తొంభయి శాతం ప్రజలు కనీసం తిండి-బట్ట లేక జీవిస్తున్నారు. వాళ్ళకన్నా మేము చాలా హాయిగా బతుకుతున్నట్టే అని చెప్పేవారు. నాన్నగారు ఉయ్యూరు సి.బి.ఎం. స్కూల్‌లో పని చేసేరోజుల్లో అత్యవసర పరిస్థితి వచ్చినప్పుడు చాలా బాధలు అనుభవించాల్సి వచ్చింది. నాన్నగారికి దాదాపు ఆరు నెలలు జీతాలు లేవు. అయినప్పటికీ నాన్నగారు ఏనాడు మామీద విసుక్కోవటం మాకు తెలియదు. ఆర్థికబాధలలో కూడా చాలా ఆనందంగా గడిపాము. ఆయన పిల్లలం అందరం బాగానే స్థిరపడ్డాము. కాని మానించి ఎప్పుడూ కనీసం మందులకోసమయిన దబ్బులు తీసుకునేవారు కాదు. మా నాన్నగారు చాలా ముక్కుసూటి మనిషి. అన్యాయాన్ని ఏమాత్రం సహించేవారు కాదు. ఉయ్యూరు సి.బి.ఎం. స్కూల్ లో నాన్నగారు హిందీ పండిట్ గా పనిచేసేవారు మేమూ అదే స్కూల్ లో చదువుకునేవాళ్ళం. ఒకసారి ఉపాధ్యాయులు సమ్మె చేసారు. మొత్తం స్కూల్స్ అన్నీ సమ్మెలో పాల్గొన్నాయి. మా స్కూల్ని మూసివేయించడానికి సమ్మెలో పాల్గొనే ఉపాధ్యాయ సంఘాలవారు మా స్కూల్‌కి వచ్చారు. అయితే స్కూల్ మేనేజ్మెంట్ మమ్మల్ని అందరిని స్కూల్ వెనుక హాస్టల్ లోకి పంపించి స్కూల్ మూసేసినట్టు ఆ ఉపాధ్యాయ సంఘాల వార్రిని నమ్మించారు. ఉపాధ్యాయ సంఘాలు వెళ్ళిన తరువాత మాములుగా మా క్లాసులు జరిగిపోయాయి. ఇటువంటి ద్వంద్వ నీతికి నాన్నగారు వ్యతిరేకులు.

చిన్నప్పటినుంచి నాన్నగారు కష్టాల లోనే పెరిగారు. కమ్యూనిస్టు రాజకీయాలతో మమేకమయి చివరకు కమ్యూనిస్ట గానే అమరులయ్యారు. ఆయన జీవితం మాకు ఆదర్శం. నాన్నగారి చిరునవ్వు మమ్మల్ని ఎప్పుడూ వెన్నంటే ఉంటుంది

కామ్రేడ్ నాన్నగారికి లాల్ సలాం

అశ్రునయనాలతో

మీ చిన్నాడు

**ఆలూరి సత్యవతి**

# మార్గదర్శకులకు వినమ్రంగా.....

ఏ విషయాన్నయినా కుటుంబ సభ్యులందరం కలిసి కూలంకుషంగా చర్చించిన తర్వాత నిర్ణయాన్ని తీసుకోవటం, తీసుకున్న నిర్ణయాన్ని అమలు పరచడం... ప్రజాస్వామిక వాతావరణాన్ని ఇంట్లో నెలకొల్పారు. పూర్తి ప్రజాస్వామ్యబద్ధంగా చర్చించి, నిర్ణయాన్ని తీసుకునే సామర్ధ్యాన్ని మీరు మాకందించారు. నాకు ఊహ తెలిసినప్పటినుండి మీతో పాటు సాహిత్యసభలన్నింటికీ తీసుకు వెళ్ళేవారు. సభలకు వెళ్ళటం, వక్తల ప్రసంగాలను శ్రద్ధగా వినటం తర్వాత వాటి గురించి మీతో చర్చించటం...పోను పోను రాజకీయాలను అవగాహన చేసుకోవటం నేర్చుకున్నాను. నిరంతరం అధ్యయనం చేయాలని చెప్తూనే మార్క్సిస్టు దృష్టికోణాన్ని అలవరచారు.

చిన్నతనం నుంచీ సాహిత్యాన్ని చదవటం, రచనలు చేయటం నా జీవితంలో విడదీయరాని భాగాలయ్యాయి. నేను రచించిన ఏ కవితనైనా, కథనైనా మీరు చదవాల్సిందే! సవరించాల్సిందే! మీకు నా మీద అపరమితమైన మమకారం. అననుకూల పరిస్థితులలో సాహిత్యాన్ని రాయాలన్న తృష్ణను చంపుకోలేక మానసిక వ్యథకు నేను గురవుతున్నప్పుడు నన్ను తీర్చిదిద్ది నిలబెట్టిన మీరు మహోన్నతులు.

సమాజంలో వర్గం ఉన్నది. వర్గ దృష్టికోణంతో రచనలు చేయాలని పదే పదే మీరు చెప్పేవారు. నా రచనలను వర్గదృష్టికోణంతో పదునెక్కించే ప్రయత్నంలో మీ మాటలు నాకెంతో ఉపకరించాయి. తిని కూర్చునే వాళ్ళ జీవితాలను రాసేవాళ్ళు చాలా మందే ఉంటారు. కూటికి, గూడుకులేని నిరుపేదల, అన్నార్తుల, అభాగ్యుల జీవితాలను ఎవరు రాస్తారు? మార్క్సిస్టు దృక్పథం కలిగిన వాళ్ళు నిరుపేదల పక్షాన రాయాలని పదే పదే మీరు గుర్తు చేసేవారు. శ్రామిక ప్రజల జీవితాలను, వారి పోరాటాలను ఆవిష్కరించాలన్న భావన కలగటానికి మీ మాటలు ఎంతగానో దోహదపడ్డాయి.

పుస్తక అనువాదంలో మూలానికి దెబ్బ తగలకుండా, అనువదించటంలో ఏమాత్రం రాజీపడకుండా అకుంఠిత దీక్షతో చెయ్యాలన్న మీ సూచనలను స్వల్పంగానైనా నేర్చుకోగలిగాను. మీరు చెప్పే అనేక విషయాలు కాదనలేని సత్యాలు. అవి జీవితానికి చాలా దగ్గరగా ఉంటాయి. నా కలం పేరును ఒకప్పుడు నిలొవ్నాగా, తర్వాత కవినిగా మీరే పెట్టారు.

నాన్నగారూ! మీరు లేకపోవటం నా మటుకు నాకు ఎంత తీరని లోటో! మీకే తెల్సు. నేను మాటలలో వ్యక్త పరచలేను. మీ ఆశయాల సాధనలో భాగంగా సాగే నా రచనలన్నింటికీ మీరు వెన్నంటే ఉంటారు...మీరు నమ్ముకున్న ఆదర్శం, ఆశయం ఎంతో ఉన్నతమైనది. ప్రజల పక్షానే సాహిత్య రచన కొనసాగిస్తానని మాట ఇస్తున్నాను...

జులై 3వ తారీఖున గుంటూరులో జరిగిన మీ సంస్మరణ సభలో గంటి ప్రసాదం ప్రసంగించారు. 4వ తారీఖున నెల్లూరులో అత్యంత అమానుషంగా, పాశవికంగా ప్రభుత్వం దాడి చేయించింది. నేటి ప్రభుత్వాలు ప్రశ్నించే హక్కును దారుణంగా కాలరాచి వేస్తున్నాయనటానికి ఈ సంఘటన నిదర్శనం... ఆలూరి భుజంగరావు గారి కుటుంబం తమ నివాళిని తెలియపరుస్తూ...

అన్నా గంటి ప్రసాదం.... మీరు అమరులు. అమరులకు మరణం లేదు. మీ ఒక్క గొంతునొక్కితే ....వేనవేల గొంతులు ఎలుగెత్తుతాయి... మీ ఆశయాలను తమ భుజస్కందాలపై మోసుకెళ్తారు... అంతిమ విజయం ప్రజలదే.....

విప్లవాభినందనలతో....

**కవిని**

# భుజంగరావుగారి జ్ఞాపకాలలో...

- ఆలూరి లలితాపరమేశ్వరి

ఆలూరి భుజంగరావుగారితో నాకు 1960 నవంబరు 25వ తారీఖున వివాహం జరిగింది. మా నాన్నగారు కమలనాభ ప్రసాదురావు ఎలిమెంట్రీ స్కూలు మాష్టారు. అభ్యుదయ భావాలు కలిగిన కళాకారుడు. సినీ నటుడు కూడా. మాధవపెద్ది, అబ్బూరి, పులిపాక మొదలైనవాళ్ళతో కలిసి నాటకాలు వేసేవారు. ఆ రోజుల్లో తెనాలి కళలకు పుట్టినిల్లు! మా అన్నయ్య తాలూకా హైస్కూల్లో హిందీ పండిట్. నేతి పరమేశ్వరశర్మగారితో కలిసి నాటకాలు వేసేవాడు. 45 సంవత్సరాలకే మమ్మల్ని, ఈ లోకాన్ని వదిలివెళ్ళిపోయాడు.

అమ్మ రమాదేవికి ఆడ పిల్లలు చదువుకొని ఉద్యోగాలు చేయడం ఇష్టం. అన్నయ్య, తమ్ముడు హైస్కూలు చదువులకు వచ్చారు. పొలం మీద అప్పు చేసి అక్కయ్య వివాహం చేసారు. ఆర్థిక మాంద్యంతో మా ఇల్లు కూరుకుపోయింది. మొగపిల్లలను చదివించాలి తప్పదు. ఇంక ఆడపిల్ల చదువే భారం. హైస్కూలు చదువు మానిపించి ఇంట్లో కూర్చోబెట్టారు నన్ను!

చదువు అంటే నాకు ప్రాణం. నేను చదివిన మొదటి పుస్తకం 'బాల నాగమ్మ నాటకం'. అప్పుడు నా వయసు 12 సంవత్సరాలు!

శారద, రంగనాయకమ్మ మొదలగు వారి రచనలు వారపత్రికల్లో చదివేదాన్ని. బెంగాల్, హిందీ తెలుగు అనువాదాలు కూడా. అన్నయ్య హిందీ పరీక్షలకు వెళ్ళేవాడు. వాడి సాయంతో నిఘంటువును దగ్గరపెట్టుకొని స్వతంత్రంగా హిందీని నేర్చుకున్నాను. చదువు మీద ఉన్న నా ఆసక్తిని చూసి, హైస్కూల్‌కి పంపి చదివించలేక పోయినందులకు బాధపడేవారు అమ్మ, నాన్నగారు!

స్వతంత్ర భావాలతో చిన్నప్పటి నుంచి పెరిగాను. రచయితలు అంటే చాలా ఇష్టం.

'ఏమండీ పేపరు రాదా ఇంటికి'!

మొదటిసారి భుజంగరావుగారిని అడిగాను.

'ఏం! పేపరు చదువుతావా?' అన్నారు.

'రోజూ ఆంధ్రప్రభ ఇంటికి తెప్పిస్తారు నాన్నగారు!' అన్నాను.

ఆ రోజు నుంచీ సాయంత్రం స్కూలు నుంచి వచ్చేటప్పుడు పేపరు తెచ్చేవారు, ఉదయం తీసుకువెళ్ళేవారు. ఈ రోజు వరకూ ఎక్కడ ఉన్నా దినపత్రిక తెప్పిస్తూనే ఉన్నారు. భుజంగరావుగారిలోని సహజమైన వ్యక్తిత్వం ఇది!

'ఇంకేమి చదువుతావు నువ్వు?'

'చలం రచనలు చదవలేదు!'

'ఎందుకనీ? ఆడవాళ్ళను గురించి ఆత్రతో రాసిన కవి కదా?'

'చలం రచనలు చదివితే ఆడవాళ్ళు ఇళ్ళు వదలి పోతారట అందుకు!' అన్నాను.

'చలం గొప్ప రచయిత ఆయన రచనలను తప్పక చదవాలి!' స్కూలు లైబ్రరీ నుంచి బ్రాహ్మణీకం-అనే పుస్తకాన్ని తెచ్చి ఇచ్చారు!

నేను తెలుగు పరీక్షలు రాస్తానంటే పుస్తకాలు తెచ్చి భుజంగరావుగారే పరీక్షలకు ఫ్రిపేరు చేశారు. సంస్కృత పేపరు కూడా ఉన్నది. తెనాలిలో పరీక్షలు రాసాను. ఆ సంవత్సరం పిల్లల చదువులు పూర్తిగా దెబ్బతిన్నాయి. అప్పుడు నా ముందుకు-పిల్లల భవిష్యత్తా లేక-నా చదువా? అన్న ప్రశ్న వచ్చింది. నాకు నేనే పిల్లల కోసం నా చదువును రద్దు చేసుకున్నాను!

'నీవు పరీక్షలకు చదవ్వోయి! పిల్లలను ప్రైవేటుకు పంపుదాము!' అని నాకు నచ్చచెప్ప చూసారు భుజంగరావుగారు. కానీ అందుకు నా మనసు అంగీకరించలేదు. నా బిడ్డలను నేనే చదివించుకోవాలన్న నిర్ణయానికి వచ్చాను!

పిల్లలంటే భుజంగరావుగారికి పంచప్రాణం నేను పిల్లలను విసుక్కుంటే ఆయన బాధపడేవారు. పిల్లలను అపురూపంగా చూసుకునేవారు. తండ్రికి పిల్లలపై మమకారం పిల్లలకు తండ్రి అంటే గౌరవం! ఇంటి విషయాలు ఏదైనా నాతో పిల్లలతో చర్చించి నిర్ణయానికి వచ్చేవారు. ప్రేమ మమకారాలతోనే ప్రతి విషయాన్ని పరిష్కరింపచేసేవారు!

పూజలు-పునస్కారాలు చేయవద్దని బలవంత పెట్టలేదు. కాకపోతే! పూజలవల్ల ప్రయోజనం లేదు. నీ టైము ఎందుకు వృథా చేసుకుంటావు? అనేవారు! క్రమంగా నాలో పరివర్తన వచ్చి పూజలు చేయడం మానేశాను!

మా ఇంట్లో సాహిత్య గోష్టులు జరిపేవారు భుజంగరావుగారు. నేను కూడా ఉత్సాహంగా నా భావాలను చెప్పేదాన్ని! ఇంట్లో పని, పిల్లల చదువు. నేను చదువుకోవడం ఇవే తప్ప బైటికి వెళ్ళేదాన్ని కాదు!

'ఏమోయ్ ఈ రోజు సాయంత్రం పుచ్చలపల్లి సుందరయ్య మన గుడివాడకు వస్తున్నారు. చిత్రప్రదర్శన కూడా పెట్టారు చూద్దువుగాని రా? ఎప్పుడూ ఇంట్లోనే ఉంటున్నావు కాస్త బైట ప్రపంచం చూడవోయ్!' అన్నారు.

సుందరయ్యను చూడాలనిపించి 'సరే'నని ఆయన వెంట నేను పిల్లలు వెళ్ళాము. సభ పూర్తి అయినాక ఇంటికి వచ్చాము! మొదటిసారి వెళ్ళిన సభ నాకు గొప్ప స్ఫూర్తినిచ్చింది!

'మా నాన్నగారు చనిపోయేటప్పటికీ 'ఒడ్లు-పాడిగేదెలు-ఇల్లు ఉన్నాయి! మాదాయాదులే మా అమ్మచేత 'అప్పులు ఉన్నాయని సంతకం పెట్టమన్నారు. మనవాళ్ళే కదా అని, కాగితాలు చూడకుండానే వాళ్ళు ఎక్కడ పెట్టమంటె అక్కడ సంతకాలు పెట్టింది అమ్మ! నాన్నగారు చనిపోయిన మరుక్షణం ఇల్లు-ఒడ్లు-గేదెలు ఏవీ మావి కాకుండా పోయాయి! నడిరోడ్డున నిలబడ్డాము మేము. చిన్న పిల్లలం ఏమి చేస్తాం? 'నీవు బైట ప్రపంచం చూడాలి బి.పి ఎప్పుడు పెరుగుతుందో, ఎప్పుడు తక్కువవుతుందో తెలియని పరిస్థితి నాది.

పిల్లలు చిన్నవాళ్ళు నువ్వు బైట ప్రపంచాన్ని చూడాలి లేకపోతే అన్యాయమౌతారు!' అని ఎప్పుడూ చెబుతూ ఉండేవారు!

గుడివాడ వచ్చినాక 'విరసం' సభలకు వెళ్ళడంతోపాటు మహిళా సంఘంలోనూ సభ్యురాలిని అయినాను! స్త్రీల కార్యక్రమాలలో పాల్గొనేదాన్ని. ఆ రోజుల్లో మా ఇల్లు సాహితీపరులతో సందడిగా ఉండేది! మా అన్నదమ్ములంటే భుజంగరావుగార్కి ఆప్యాయత, బావగారి భావాలను గౌరవించేవారు.

ఉదయం కాఫీ తప్పనిసరిగా తాగేవారు. దూరప్రాంతానికి వెళ్ళినప్పుడు రిక్షా మీద ఎక్కడ కాఫీ దొరుకుతుందో అక్కడికి వెళ్ళి తాగి వచ్చేవాళ్ళం. కాఫీ అంటే భుజంగరావుగార్కి అంత ఇష్టం.

రాహుల్జీ రచన 'దర్శన్-దిగ్దర్శన్ తెలుగులోకి అనువాదం చేసినాక భుజంగరావుగారి ఆరోగ్యం బాగా దెబ్బతింది. బి.పి. బిళ్ళలు వాడితే కాళ్ళు చేతులు చల్లబడేవి. నరాలు బలహీనపడ్డాయి. విశ్రాంతి అవసరమని తెనాలి డాక్టరు చెప్పారు!

ఉదయం కాఫీ తాగితే శారీరకంగా బాధలు వస్తున్నాయని ఎంతో ఇష్టపడే కాఫీని దాదాపు 6 నెలలు మానేశారు. ఏదైనా పనికిరాదు అనుకుంటే తృణప్రాయంగా భావించేవారు!

పుస్తకాలు వేయడం, ప్రూఫులు దిద్దడం తానే చేసుకునేవారు. ఎవరి సాయమూ అడిగేవారు కాదు. భుజంగరావుగారి వ్యక్తిత్వమే అంత. అందుకే ఆయనకు అన్ని విధాల సహకారంగా ఉండేదాన్ని! రానురాను, మనిషి తోడులేకుండా ప్రయాణాలు చేయలేకపోయేవారు. ఎక్కువగా సభలకు మా మూడవ అమ్మాయే తండ్రితోటి వెళ్ళేది. మా చివరమ్మాయి కూడా!

'సింహావలోకనం' మొదటి భాగం వేసిన నెల రోజులకే కాపీలు అయిపోయినాయి. అప్పుడు భుజంగరావుగారి సంతోషం అంతా, ఇంతా కాదు. వెంటనే మొదటి భాగం రెండవ ముద్రణ వేయించారు!

తాను చదువుతూ ఉన్న పుస్తకంలో అక్కడే, ఆ రచయిత గురించి, ఆ పుస్తకంలోని విషయాన్ని గురించి తన అభిప్రాయం రాసుకోవడం భుజంగరావుగార్కి అలవాటు!

క్రమంగా విరసం సభలలో ఆయనతో కలిసి పుస్తకాలు పెట్టుకు అమ్మేదాన్ని. ఉపన్యాసాలు ఆయననే వినమనేదాన్ని. కానీ ఒప్పుకునే వారు కాదు. తాను పుస్తకాల దగ్గర కూర్చొని నన్ను వినడానికి పంపేవారు!

పిల్లల పెళ్ళిళ్ళు వాళ్ళ ఇష్ట ప్రకారమే చేసాము. ఉద్యమ అవసరాల రీత్యా ముందుగానే రిటైరు అయి ఇద్దరం తట్ట, బుట్ట సర్దుకువెళ్ళాము! అప్పటి మా ఇంటి పరిస్థితి-పిల్లల పరిస్థితి ఘోరాతి - ఘోరంగా ఉన్నది. అయినా వాళ్ళు పెట్టిన తారీఖున ప్రయాణమైనాము. అప్పుడు మా దగ్గర ఉన్న మహిళా కామ్రేడ్ 'మాష్టారు? పిల్లలను ఈ స్థితిలో ఉంచి అమ్మ కూడా మీతో రావడానికి సిద్ధపడింది. నేను మీ నిబద్ధతకు గర్వపడుతూన్నాను!' అంటూ మాకు వీడ్కోలు చెప్పింది!

సమయానికి రచనలు - రిపోర్టులు రాసి అందించేవారు! రాత్రిళ్ళు టేబుల్ లైటు దగ్గర రాసుకునేవారు. టేబుల్ లైటు ఆన్ చేసి తనురాసేవి హిందీలోనో - తెలుగులోనో పూర్తి చేసి పడుకునేవారు భుజంగరావుగారు!

'అమ్మా! బాపూ రాత్రి తాను రాసేవి పూర్తి చేసి కాగితాలు మడిచి, దానిపై పెన్ను పెట్టి పడుకున్నారు!' అని ఆనందంతో మిలమిలామెరిసే కళ్ళతో చెప్తున్న ఆ కామ్రేడ్ ముఖారవిందాన్ని నేను ఎప్పుడూ మరిచిపోలేను!

భుజంగరావుగారు రెండు కళ్ళు కనుపించడం లేదు. అప్పుడు భూతద్దం సాయంతో హిందీలోకి అమరవీరుల చరిత్రను అనువాదం చేసి ఇచ్చారు.

'మీరొకరికి ఒకరు బాడీగార్డులు మీకు ఇంకొాళ్ళు సాయమెందుకు?' అంటూ ఉండేవారు. కామ్రేడ్ ఐ.వి. అన్నకు మా లాల్‌సలామ్!

'బాపూ మీ దగ్గరకు మేము రాలేకపోవచ్చు. మీ ఆరోగ్యం బాగుండకపోతే మీ కొడుకు దగ్గరకు వెళ్ళండి!' భుజంగరావుగారి ఆరోగ్య పరిస్థితి చూసి అన్నాడు ఆ కామ్రేడ్!

ఈ దగుల్బాజీ ప్రభుత్వం ఆ కామ్రేడ్‌ని పొట్టన పెట్టుకుంది. అమరుడు 'రాంజీకి' మా లాల్‌లాల్‌సలామ్!

కంటికి ఆపరేషన్ చేయించాలి బి.పి. అన్‌కంట్రోల్‌గా ఉన్నది. ఆ పరిస్థితుల్లో ఆ జీవితానికి 'వీడ్కోలు' చెబుతూ కొడుకు దగ్గరకు వచ్చాము!

ఒక కంటికి మామూలు ఆపరేషన్ చేసి, సుక్లం తీసి అద్దాలు ఇచ్చారు గుల్బర్గలో! ఆపరేషన్ జరిగిన దగ్గర నుంచీ చెవిలో నించి మెదడు నరాలు నిరంతరాయంగా ఒకరకమైన ధ్వనులతో బాధగా ఉన్నదని చెప్పేవారు భుజంగరావుగారు!

అప్పుడే తెలుగు నుంచి హిందీలోకి 'రాగో', 'అతడు', 'బొగ్గు పొరల్లో' అనువాదం చేసి ఇచ్చారు భుజంగరావుగారు!

'నేను చెబుతూ ఉంటే ఎవరన్న రాసిపెడితే బాగుండును!' అని అంటూ ఉండేవారు. అప్పటి నుంచి భుజంగరావుగారు చెబుతూ ఉంటే నేను చిత్తు రాసి పెట్టేదాన్ని. ఆ రకంగా నైనా, ప్రజలు అజేయులు మొదలగు స్వతంత్ర రచనలు చేసి 'రాహుల్ సాహిత్య సదనం' పేరు మళ్ళీ ప్రజల్లోకి తెస్తూ సొంతంగా అచ్చు వేసుకున్నాము! ఉద్యమ అవసరాలకు అడివికి వెళ్ళి వచ్చారు భుజంగరావుగారు. నేను వెళ్ళలేదు!

మేము మా ఇంట్లో ఎట్లా ఉండేవాళ్ళమో, రహస్య జీవితంలో కూడా సహజంగానే ఉండేవాళ్ళం!

ఈ ఫాసిస్టు ప్రభుత్వం మా ఇద్దరి అల్లుళ్ళను పొట్టన పెట్టుకుంది!

ఇంకా రచనలు రాసేటప్పుడు ఇద్దరం బాగానే పోట్లాడుకునేవారం. సిద్ధాంత పరంగా, రచనా పరంగా పోట్లాడుకుంటూనే ఆయన చెప్పేవారు. నేను రాసిపెడుతూనే ఉండేదాన్ని! మా ఇంటి విషయాలకు మేము ఎన్నడూ ఘర్షణ పడలేదు!

భుజంగరావుగారిని ఇక అనుక్షణమూ చూసుకోవాల్సి వచ్చింది. సభ్యత్వం లేకుండా ఆయనతో ఉండాలంటే బాధనిపించి 'నేను రచయిత్రి కాను, పాఠకురాలిని 'విరసం' సభ్యత్వానికి ఏ అర్హతలు కావాలి అక్కా? అని కృష్ణాబాయిని అడిగాను!

'మీరు సభ్యత్వం కావాలని అడిగారే, అదే అర్హత!' అన్నది కృష్ణక్క!

అప్పటి నుంచీ నేనూ 'విరసం' సభ్యురాలినైనాను!

75 సంవత్సరాలు ఆయనకు 60 సంవత్సరాలు నాకు ఆ వయసులో గుంటూరులో ఇల్లు ఎతుక్కుని కొత్త జీవితం

మొదలుపెట్టాము ఇద్దరం. సి.ఎస్.ఆర్. ప్రసాదులో నిబద్ధతతో కూడిన వ్యక్తిత్వం భుజంగరావుగార్కి ఇష్టం. ఇంకా రుక్మిణి, సంగ్రాముల సహకారం సరేసరి!

గుంటూరు రాకముందే భుజంగరావుగార్కి రెండు కళ్ళకూ మూడుసార్లు ఆపరేషన్‌లు జరిగాయి. బి.పి కంట్రోలు కావడం లేదు. ఆయన శరీరంలో ఏవో తెలియని బాధలు. చాలా ఆసుపత్రులు తిరిగాము. హైదరాబాదులో ఒక డాక్టరు గుండె జబ్బుకు మాత్రలు ఇచ్చారు. ఇక ఆయన్ను తీసుకుని నేను, మా బాబు రాయవెల్లూరు వెళ్ళాము!

'మీకు గుండె జబ్బు లేదుకదా? ఈ మందులు ఎందుకు వేసుకుంటున్నారు?' అని భుజంగరావుగార్ని అడిగారు డాక్టరు! మందులన్నీ తీసేసి తక్కువ పవరు బి.పి. బిళ్ళలు ఇచ్చారు. గుండె జబ్బు లేదని! తలకు స్కానింగ్ తీయించినా ఏమీ కనబడదని చెప్పారు ఆ డాక్టరు. అయినా తలకు స్కానింగ్ తీయించాము గుల్బర్గలో తలలో దోషమేమీ కనుపించలేదు!

ఇంక గుంటూరు వాసులమైనాము. ఆ స్థితిలో ఒకరోజున సంగ్రామ్‌గారు హోమియోపతి డాక్టరు ఉప్పాల సత్యనారాయణగారి దగ్గరకు తీసుకువెళ్ళారు భుజంగరావుగారిని చూడాలంటే! హోమియోపతి మందులు ఇచ్చారు డాక్టరుగారు. క్రమంగా చెవినించి తల్లోకి వచ్చే ధ్వనులు తగ్గాయి. తలకు మఫ్లరును తీసివేయగలిగారు భుజంగరావుగారు!

ఉదయం బి.పి. బిళ్ళ 11 గంటలకు హోమియోపతీ బిళ్ళలు ఇప్పటిదాకా వాడుతూనే ఉన్నారు. ఏమన్నా చిన్నవి పొన్నవి బాధలొస్తే రవీ డాక్టరు దగ్గరకు వెళ్ళేవాళ్ళం!

ఎక్కడకు వెళ్ళాలన్నా దోవలు తెలిసేది కాదు. 'రిక్షావాడు సరిగా తీసుకువెళ్ళతున్నాడా?' అని అడుగుతూ ఉండేవారు. ఫోనులో ఎక్కువసేపు మాట్లాడలేకపోయేవారు భుజంగరావుగారు!

ఆరు నెలల నుంచీ బాగా డీలా పడ్డారు. పేపరు నేను చదువుతున్నా వినలేక పడుకునేవారు. 'చిన్న శబ్దం కూడా మెదడు భరించలేకపోతున్నది. శరీరంలో చెప్పలేని బాధలు వస్తూ పోతున్నాయి!' అనేవారు భుజంగరావుగారు. విపరీతంగా నిద్ర పోయేవారు. ఎప్పుడు లేపినా కాసేపు పడుకోనీయవోయి?' అనేవారు. ఉదయం ఇడ్లీ, లేక దోసె, మధ్యాహ్నం అన్నంలో మజ్జిగ వేసుకు తినేవారు. నోటికి ఏ రుచి లేదనేవారు. రోడ్డు మీదకు వెళ్ళలేని ఆశక్తత వచ్చిందని 'ఇంక శరీరం నా మాట వినడం లేదనేవారు'!

పిల్లలు వాళ్ళ ఇళ్ళకు రమ్మంటే 'దోవలో నాకు ఏదన్నా అయితే, నీవు చాలా ఇబ్బంది పడతావు. మనల్ని చూడాలంటే, వాళ్ళే వస్తారు. ఈ శరీరం శిథిలమైపోయింది. చివరి ఘడియల్లో ఈ శరీరాన్ని ఆసుపత్రిపాలు చేయకు. ప్రశాంతంగా ఈ తనువు చాలించనీ! నేను పోంగానే ముందు సి.ఎస్.ఆర్. ప్రసాదుకు ఫోను చెయ్యి. సంగ్రాముకు కూడా?' ఎక్కువ సార్లు ఈ మాటలే చెబుతూ ఉండేవారు!

శ్రీశ్రీ రోడ్డు ఆవిష్కరణ రోజున 10 గంటలకే రడీ అయి 'తొందరగా బయలు దేరవోయి'! అన్నారు. అక్కడకు వెళ్ళివచ్చినాక ఇంకా బలహీనపడ్డారు. ఎంత బలహీనంగా ఉన్నా, మనిషి ఉషారుగా కనిపించేవారు భుజంగరావుగారు!

'ఏ అర్ధరాత్రో ఈ ప్రాణి గాలిలో కలసిపోతుంది. డబ్బులు ఇంట్లో ఉంచు. మనుషులు సాయానికి వస్తారు. డబ్బులంటే ఆ టైమున వాళ్ళ దగ్గర ఉండడం కష్టం!' అనేవారు భుజంగరావుగారు.

జూన్ 19వ తారీఖు మా తమ్ముడి బండి మీద తన మందుల కోసం వెళ్ళారు. దాదాపు పావు తక్కువ 9 గంటలకు బావగారిని ఇంటికి తెచ్చాడు.

'అక్కయ్యా? బావగారు హాయిగానే ఉన్నదన్నారు. బాగానే తిరిగారు నాతో!' అని వాడు వెళ్ళిపోయాడు!

పళ్ళు తోముకుని స్నానం చేసి, చపాతీ తింటూ 'గుంటూరు బాగా టవున్ అయిందోయ్!' అన్నారు. వార్తలు చూసారు. ఇంక కూర్చోలేనని పడుకున్నారు! 10 గంటలకు కప్పు పాలు ఇచ్చాను. దాదాపు 12 గంటలప్పుడు నిద్ర పట్టడం లేదని మంచం మీద పుస్తకాలు సర్దుకున్నారు!

ఎడమ చెయ్యి నెప్పి అన్నారు. చేతికి నూనెరాసాను. 'రాజిగాడికి ఫోను చెయ్యి' అన్నారు భుజంగరావుగారు. మా తమ్ముడికి ఫోను చేసి రమ్మన్నాను. వాడు వచ్చాడు. 12 గంటలు దాటుతుండగా! అప్పటికే మేమిద్దరం బైట తిరుగుతూ ఉన్నాము. భుజంగరావుగారికి శరీరంలో బాధ వస్తే అటు ఇటు తిరగడం అలవాటు. నేను కూడా ఆయనతో తిరుగుతూ ఉంటాను!

మనిషికి చెమటలు పడుతూ ఉన్నాయి. బైట కుర్చీ వేసా. కూర్చోన్నారు. దొడ్లోకి వెళ్ళాలన్నారు. వెళ్ళి వచ్చారు. 'ఏమిటోయి ఫ్రీమోషన్ అయింది!' అంటూ కాళ్ళూ చేతులూ కడుక్కుని, లుంగీని మార్చుకున్నారు. మంచినీళ్ళు ముంచుకు తాగారు. అప్పటికీ 1 గంట దాటింది.! రాజా ఆసుపత్రికి తీసుకువెళదాము ఆటోని పిలు!' అన్నాను నేను. వాడు అంబులెన్స్ కోసం ప్రయత్నిస్తూ ఉన్నాడు. 2 గంటలా చాయల అంబులెన్స్ వచ్చింది.

కుర్చీలో కూర్చున్నారు. ఆయన పక్కనే ఉండి మంచినీళ్ళు కావాలంటే ఇచ్చాను. నోటిలో నీళ్ళు పోశాను. ఒక గుక్క మింగారు. కనుగుళ్ళు గిర్రున తిరుగుతూ లోపలికి పోయినాయి! ఒక్క గుటక మింగి కళ్ళు మూసుకున్నారు! అంతే ఇంక కళ్ళు తెరవలేదు. హాయిగా విశ్రాంతిగా కుర్చీలో పడుకున్నారు. ఏమండీ, ఏమండీ అన్నా పలకలేదు భుజంగరావుగారు!

'చావు అంత సులభమా? దిక్కుతోచలేదు నాకు. అంబులెన్సు వచ్చింది!' ప్రాణం పోయింది.! అన్నారు. 'ఆసుపత్రికి తీసుకెళ్ళండి?' అన్నాను నేను. 'లేదు ప్రాణం పోయింది. లాభం లేదన్నారు' బైట మంచం మీద పడుకోబెట్టి వాళ్ళు వెళ్ళిపోయారు!

ఒకే ఆదర్శం ఒకే భావాలతో 52 సంవత్సరాలు కలిసి బతికాము! ఒక్కదాన్ని చేసి వెళ్ళిపోయారు. ఇంక ఒక్కదాన్నే పోరాటం చేయాలి!

'మాటకన్నా ఆచరణే గీటురాయి!' అనేవారు.

సహచరుడు, స్నేహితుడు, ప్రేమపాత్రుడు అయిన భుజంగరావుగారితో 52 సంవత్సరాలు సహజీవనం చేసాను నన్ను ఒంటరిదాన్ని చేసి తాను నిష్క్రమించారు. ఇద్దరం నడిచిన దోవలో నేనూ ప్రయాణిస్తానని చెబుతూ!...

కామ్రేడ్ ఆలూరి భుజంగరావుగార్కి లాల్‌సలామ్ చెబుతూ!

మీ సహచరి

ఆలూరి లలితాపరమేశ్వరి



# భూమి పై చలించిన వాడు

- ప్రభు

ఆలూరి భుజంగరావు గారు తెలుగు సాహిత్యానికి చేసిన కృషి ప్రత్యేకమైనది. ముఖ్యంగా అనువాదకుడిగానే ఎక్కువ గుర్తింపు వచ్చినా స్వతంత్ర రచనలో ఆయన శైలి విభిన్నంగా ఉంటుంది. వచనం రాయడంలో ఆయన మనతో మాట్లాడుతున్నట్టుగా ఉండే మౌఖిక శైలి మన మనసుని పట్టి లాగుతుంది.

బ్రిటిష్ పరిపాలనలో ఉండిన తెలుగు దేశంలో ఎందుకో గాని తెనాలి, బందరు రెండూ ప్రత్యేకత కలిగిన ఊళ్ళు. 'బందరు పిచ్చోడు' అనేది మనకొక జాతీయం. రెండోది 'మీది తెనాలే.. మాది తెనాలే..'. తొలి దశలో ఆంగ్ల ప్రభావం ఉత్తరాంధ్ర మీద ప్రసరించింది. తరువాత కాలంలో విద్యకీ విజ్ఞానానికి సాహిత్యోద్యమాలకీ, రాజకీయోద్యమాలకీ ఈ రెండు ఊళ్ళూ కేంద్రాలుగా నిలిచాయి. చాలా మంది ప్రముఖులు ఈ రెండు ఊళ్ళకీ చెందిన వారే. ఆ వారసత్వం క్రమంగా రాజకీయాలలో, మేధోరంగంలో కమ్యూనిస్టు ప్రభావం వేపుకి మళ్ళింది. ఈ దశలో జన్మించి పరిణమించిన వారే ఆలూరి భుజంగరావు. అందుకే ఆయన సాహిత్య కృషి మార్క్సిస్టు సౌందర్యం వేపు పయనించింది.

దిక్కు మొక్కు లేని జనంకి ఆయనే రాసుకున్న నేపథ్యంలో "జాషువా గబ్బిలం, త్రిపురనేని రామస్వామి చౌదరి శంభుక వధ, కమ్మ బ్రాహ్మణోద్యమం, కమ్మ బ్రాహ్మణ పౌరోహిత్యం, బొల్లిముంత శివరాం రచనలు, గోపరాజు రామచంద్రరావు నాస్తికత్వం, టేగ్రాబుర్ర కథ, జీవి కృష్ణారావు కీలుబొమ్మలు, వీటన్నింటిని మించి దర్శి చెంచయ్య విప్లవ చర్యలు, భగత్ సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల ఉరితీత ...." ఇవన్నీ తెనాలి యువకుల మీద గాఢమైన ప్రభావం చూపాయి. ఈ ప్రభావం భుజంగరావుగారిలో చూడవచ్చు.

బాల్యంలోనూ, యవ్వనంలోనూ దుర్భరమైన దారిద్ర్యాన్ని అనుభవిస్తూ హిందీ భాషలో పట్టు సాధించి సాహిత్యరంగంలోకి ప్రవేశించారాయన. ప్రేమ్‌చంద్ రచనల అనువాదాలతో తెలుగు పాఠకులకి దగ్గరయ్యారు. ప్రేమ్‌చంద్ రచనల్ని అనేక మంది అనువదించి ఉండవచ్చు. కానీ భుజంగరావుగారు గుర్తున్నంతగా మిగిలిన వారు గుర్తుండరు, శరత్ సాహిత్యానికి బొందలపాటి శివరామకృష్ణలా. నిజానికి ప్రేమ్‌చంద్ జీవితానికీ భుజంగరావుగారి జీవితానికీ చాలా పోలికలు కనిపిస్తాయి. 'నేనొక సామాన్యుడిని. జీతపు రాళ్ళకోసం పల్లెటూరి బడిపంతులుగా జీవితాన్ని అరగదీస్తున్న వాణ్ణి.' అని చెప్పుకుంటాడు ప్రేమ్‌చంద్. అలాగే భుజంగరావుగారు కూడా. ప్రేమ్‌చంద్ కాంగ్రెస్‌లో క్రియాశీలకంగా పనిచేసినట్టే భుజంగరావుగారు కమ్యూనిస్టుగా పని చేసారు. గ్రామీణ జీవితంతో ప్రేమ్‌చంద్ కున్న అనుభవమే భుజంగరావుగారికి కూడా ఉంది. ఆయన స్కూలు మాస్టారుగా చాలా గ్రామాలతో పరిచయం గురించి గమనాగమనం, గమ్యంకోసం గమనం వంటి రచనలలో రాశారు. ఆయన అనుభవాలన్నీ కథలకీ, నవలలకీ అద్భుతమైన ముడిసరుకు.

యశపాల్ సింహావలోకనం అనువాదం భుజంగరావుగారి జీవితంలో ప్రధాన ఘట్టం. గబన్ అనువాదం ఆయనకు సాహిత్యలోకంలో స్థానం సంపాదిస్తే, సింహావలోకనం ఆయన దృక్పథాన్ని తెలియజేసింది. సింహావలోకనం అనువాదంలో ఆయన తాదాత్మ్యం చెందారనిపిస్తుంది. భారత స్వాతంత్ర్య పోరాటంలో మహోజ్వల ఘట్టాన్నీ, అసమానమైన త్యాగశీలతనీ, చిత్రించిన సింహావలోకనం తెలుగు యువత మీద బ్రహ్మాండమైన ప్రభావాన్ని చూపింది. సీరియల్‌గా వచ్చినప్పుడూ, తరువాత పుస్తకరూపంలో వచ్చినప్పుడూ అది యువతరాన్ని కుదిపేసిందని చెప్పవచ్చు. భగత్‌సింగ్ జీవితాన్ని, ఆనాటి విప్లవకారుల జీవితాన్ని పునరాధ్యయనం చేయడానికి ఆ పుస్తకం ఒక ప్రేరణగా నిలిచిందనడం అతిశయోక్తి కాదు.

ఆ పుస్తక ప్రభావం భుజంగరావుగారి మీద కూడా ఉంది. ఆయన చివరి దాకా విప్లవ స్ఫూర్తిని నింపుకునే ఉన్నారు. జయయౌధేయ, దివోదాసు, లోకసంచారి, భారతీయ దర్శనం, ప్రాక్పశ్చిమ దర్శనాలు, మధుర స్వప్నం ఇలా ఎన్నో అనువాదాలతో ఆయన రాహుల్జీని తెలుగు రచయితగా మార్చేశారు.

అనువాదాలు మాత్రమే కాదు. రచయితగా ఆయన మంచి వచనం రాయగలిగిన వారు. సంఘటనల్ని దృశ్యంగా మరల్చడంలో ఆయన రాత అబ్బుర పరుస్తుంది. గమనాగమనం, గమ్యం దిశగా గమనం వంటివి ఆయనే మన పక్కన కూర్చుని చెపుతున్నారా అన్నంత ఆత్మీయంగా ఉంటాయి.

దరిదాపుగా సాహిత్యలోకం మరచిపోయన శారదను ఆయన జీవితాన్ని మనకి పరిచయం చేసిన సాహిత్యబాటసారి శారద ఎనభైలలో వచ్చిన మంచి పుస్తకాలలో ఒకటి. ఆర్థిక మాంద్య కాలంలోని పేదరికం, రచయితలుగా ఎదగడానికి వారు చేసిన కృషి అందులో కళ్ళకు కట్టినట్టు చిత్రించారు. ముఖ్యంగా ఆర్థిక బాధల్ని పక్కన పెడితే వారి హాస్యప్రవృత్తి, జీవిత పోరాటంలో వారు యోధులుగా నిలబడగలగడం మన్ని చాలా ఉద్రిక్త పరుస్తుంది. శారద మరణం గురించి ఆయన చిత్రించిన తీరు నిజంగా కళ్ళమ్మట నీరుతిరిగేలా ఉంటుంది. పైగా అందులో శారదను బొమ్మకట్టినట్టు ఆయనచేసిన వర్ణన చాలా గొప్పది. చొక్కా మీద కాఫీ చిందులు, పెదాల మధ్య బీడీ అంటూ చేసిన వర్ణన శారదను మన కళ్ళ ముందు నిలబెడుతుంది.

వ్యక్తిగతంగా ఆయన ఎంతో ప్రేమించగల మనిషి. ఆయన లోకాన్ని, ప్రజల్నీ ఎంత ప్రేమించారో అంతగా ఆయన్ని ప్రేమించ

నివేదిక

# ప్రజల క్షేమమే జీవితపు విలువగా బతికిన ఆలూరి భుజంగరావు సంస్మరణ

- సంగ్రామ్

వ్యక్తిగత జీవితానికి, సాహిత్య రచనకు, రాజకీయ ఆచరణకు మధ్య ఎలాంటి అభేదము లేకుండా, నిజాయితీగా, నిక్కచ్చిగా బతికినవాడు కా. ఆలూరి భుజంగరావు అని విరసం రాష్ట్ర కార్యదర్శి కా. వరలక్ష్మి మాట్లాడారు.

గుంటూరులో జరిగిన ఆలూరి భుజంగరావు సంస్మరణ సభకు విరసం జిల్లా కన్వీనరు సంగ్రామ్ అధ్యక్షత వహించారు. కా. వరలక్ష్మి భుజంగరావు రచించిన నైనా నవలికను ఆవిష్కరించి తన ప్రసంగాన్ని కొనసాగించారు. మూల రచయితను గుర్తుంచుకున్నంతగా అనువాదకుడిని గుర్తించడం. అనువాదం ఒక సాహిత్య ప్రక్రియ. ఇతర భాషాసాహిత్యాలను చూడడానికి కిటికి వంటిది. ఈ అనుసృజనలో కూడా వారి వారి వ్యక్తిగత ప్రతిభలు, అభిరుచులు మనకు వ్యక్తమౌతూనే ఉంటాయి. అట్లా భుజంగరావు అనుసృజన గొప్ప లక్ష్యంతో కూడుకొన్నది. ఆయన కేవలం నవలా సాహిత్యాన్నేగాక అనితరసాధ్యమైన 'ప్రాక్పశ్చిమ దర్శనాలు, భారతీయ దర్శనం'లాంటి తత్వశాస్త్ర గ్రంథాలను కూడా అనువదించారు. కమ్యూనిస్టు ఉద్యమ తొలి దశలో ఆయన అనుసృజన ఒక వరవడిని పెట్టింది. దానిని తదనంతరం కూడా కొనసాగించారు. 1987లో చాలా ఆలస్యంగా విరసం సభ్యత్వం పట్టుబట్టి తీసుకొన్నారు. చివర వరకు కమ్యూనిస్టుగా బతకాలని ప్రగాఢంగావాంఛించి ఆచరించారు. ఉద్యోగ విరమణ తర్వాత అజ్ఞాత జీవితం గడిపి ఆ అనుభవాల నుండి 'నైనా' 'ప్రజలు అజేయులు'వంటి నవలలు మనకు అందించారు. ఎంతో నిజాయితీగా సూటిగా సరళంగా ఉండే ఆయన రచనలు, పాఠకులను కూడా ఆ వాతావరణంలోకి తీసుకవెళ్ళేవి. సాగుతున్న యుద్ధంలోకి మనల్ని కూడా నిమగ్నమయ్యేటట్లు చేయగల చిత్రీకరణ. ఆయన జీవితంలో అనుభవించిన దుర్భర దారిద్రం ఎంతటిదో గమనాగమనం చదివితే అర్థం అవుతుంది. అదే ఆయనను ప్రజాపక్షపాతిగా చివర వరకు నిలిపింది. శారదవంటి ప్రజారచయితలను తెలుగు పాఠకులకు అందించడానికి దోహదపడిందన్నారు.

కా. కళ్యాణరావు మాట్లాడుతూ, ఇది ప్రజా సందర్భం అని-రచన, జీవితం-ఆయుధం గురించే మాట్లాడవలసిన సన్నివేశంలో ఉన్నామన్నారు. అంటే యుద్ధాన్ని కీర్తించడం కాదు. దాని చైతన్యాన్ని ప్రజలకు అందించడం, ప్రేమించడం నేర్పాలి. యుద్ధ అనివార్యతను గుర్తింపజేయాలి అన్నారు. భుజంగరావు యుద్ధానికి దూరంగా లేరు. యుద్ధం మధ్యలో ఉండే రచనలు చేశారు. ప్రేమచంద్‌ను, రాహుల్ సాంకృత్యాయన్‌ను ప్రేమించి ఆ రచనలను తెలుగు సాహిత్య లోకానికి అందించారు. ప్రేమచంద్ రచనలో ఉన్న మనిషితనం, మట్టివాసన ఆయనను ఆలోచింపజేసింది. ఆయన స్వంత రచనలలో ఆయన వ్యక్తిగత అనుభవాలు, తన చుట్టూ ఉన్న సామాజిక చలనశీలతను రికార్డు చేశారు. అందువలనే అవి చరిత్ర రచనలు కూడా అయ్యాయి. ఆయన యుద్ధ అమరత్వాన్ని వారసత్వంగా తీసుకొని, సమాజం పట్ల బాధ్యతపడి రచనలు చేశారు. మన మీద కూడా ఆ బాధ్యతను, విశ్వాసాన్ని ఉంచి నిష్క్రమించారన్నారు.

అమరుల బంధుమిత్రుల సంఘం బాధ్యులు గంటి ప్రసాదం మాట్లాడుతూ సహజసిద్ధమైన చరిత్రలోని గతితర్క చలన సూత్రాలను అర్థం చేసుకొని దానితోపాటు అడుగులు వేస్తూ భాగస్వామ్యులైన వాళ్ళ చరిత్రలో గుర్తుండిపోతారు. చరిత్ర నడకలో అనేక మలుపులు, నిరాశలు సంతోషాలు ఉండవచ్చు కాని చరిత్ర మూల సిద్ధాంతాలను ఆకళింపుజేసుకున్న వ్యక్తులు ఏ ప్రభావాలకు లోనుగాక ఆశయాన్ని ఓ విలువగా స్వీకరిస్తారు. అలాంటి వారిలో భుజంగరావుగారు ఒకరు అని అన్నారు.

సీనియర్ జర్నలిస్టు రాఘవశర్మ మాట్లాడుతూ మా బంధువులంతా దుర్భర దారిద్రం అనుభవిస్తున్న భుజంగరావుగారిని వదిలివేశారు. అయితే ఆయన జీవితం, సాహిత్యం నన్ను ఆయనకు దగ్గర చేర్చింది. ఆయన ఎల్లప్పుడూ శ్రమజీవుల పక్షానే ఆలోచించాడని అన్నారు.

ఈ సభలో ప్రముఖ కవి అద్దేపల్లి ప్రభు తన అనుభవాలను పంచుకున్నారు. ఆయన కుమారుడు ఆలూరి ప్రసాద్ మాట్లాడుతూ నాన్న అయినందున ఆయన నాకు పదిశాతం మాత్రమే చెందుతాడు. సమాజానికి మిగిలిన 90 శాతం చెందుతాడు అన్నారు. ఈ సభకు కా. రుక్మిణి ఆహ్వానం పలుకగా, సి.ఎస్.ఆర్ ప్రసాద్ వందన సమర్పణ చేశారు.

ఈ సభకు రచయితలు, సాహిత్యాభిమానులు, విప్లవాభిమానులు విరివిగా హాజరయి జయప్రదం చేశారు.



---

గలం. ఆయన విశాల దృక్పథం, పొల అలకలు, పాత తరం వాళ్ళకే చేతనైన మొండితనం, విప్లవ కార్యాచరణ పట్ల అవిరళమైన నమ్మకం ఇవన్నీ ఆయన వ్యక్తిత్వాన్ని సమున్నతంగా నిలబెట్టిన అంశాలు.

మనం చరిత్రగా చదువుకున్న అనేక సంఘటనల్లో ఆయన జీవించిన వారు. ప్రతి సంఘటనలోనూ తన చలనాన్ని పెంపొందించుకుంటూ శిఖరాయమానంగా ఎదిగిన వ్యక్తి.

ఆయన భూమిపై చలించిన వాడు.



# జీవితమంత అక్షరం

- పాణి

భుజంగరావుగారు పోయారని తెలిశాక నన్ను ఒక ప్రశ్న వెంటాడింది. ఇంతకూ ఆయన జీవన తత్వం ఏమిటి? అని. భుజంగరావుగారు చాలా మామూలు రచయిత. హిందీ రాని వాళ్లకు ఆయన అనువాదాలు ఒరిజినల్‌గా తెలుగులోనే రాసినట్టు ఉంటాయి. ఇలాంటి మనిషి గురించి జీవన తత్వం ఏమిటి? అనే ప్రశ్న చాలా గంభీరమనిపిస్తుందేమో. కానీ తప్పక వేసుకోవాల్సిందే.

శారద గురించి ఆయన రాసింది చదువుతూ ఉంటే భుజంగరావుగారి గురించి చదివినట్టే ఉంటుంది. మిగతా కథలు, నవలల్లో కూడా ఆయన జీవితం కనిపిస్తూ ఉంటుంది. అదంతా గుర్తుకు వస్తే- జీవితం అనేది భుజంగరావుగారిని వెంటాడిందని అనిపిస్తుంది. అగ్రకులంలో పుట్టడం వల్ల అమానుషమైన అంటరానితనం అనుభవంలోకి రాకపోవడం తప్ప లోకంలో మిగతా ఎన్ని రకాల దరిద్రాలు, కష్టాలు ఉంటాయో అన్నీ ఆయన అనుభవించారు. కానీ ఆయన జీవితానికి లొంగిపోలేదు. అది ఆయనలోని విశిష్టత. జీవితానికి లొంగిపోయి ఉండింటే ఆయన ఇవాళ మనం తలచుకోవలసినంత మనిషి అయి ఉండేవారు కాదు. నాలుగు మూలల నుంచి జీవితం వెంటాడుతూ ఉన్నా ఆయన తన చైతన్యంతో దాన్ని ఒడిసి పట్టుకొని చేతిలోకి తీసుకొని లొంగదీసుకున్నారు. తన చైతన్యం కొద్దీ నిర్దేశించుకున్న పద్ధతిలో జీవితాన్ని పునర్మించుకున్నారు. దాని ముందు అన్నీ బలాదూరయ్యాయి.

అనుకున్నట్లు జీవించడానికి చాలా అంతర్గత శక్తి ఉండాలి. అలాంటిది లేకుంటే భుజంగారావుగారిలాగా జీవించడం కుదరదు. జీవితం ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో అందరికీ చాలా ఆలోచనలు ఉంటాయి. ఏవేవో రాసేస్తూ ఉంటాం. మాట్లాడుతూ ఉంటాం. కానీ అట్లా ఉండటం చేతకావడం లేదని మరొకరు చెప్పనవసరం లేకుండా మనకూ, ఇతరులకూ తెలిసిపోతూనే ఉంటుంది. ప్రపంచంలో పేదరికానికి ఉన్నంత నిర్దయ మరి దేనికీ ఉండదు. భుజంగరావుగారు దాన్ని పూర్తిగా అనుభవించారు. కానీ నమ్మకాలు సడలలేదు. దారి తప్పలేదు. తాను నిర్ణయించుకున్నట్టే కడ దాకా జీవించారు. ఇది అపురూపమైనది.

పెద్ద ఆశయాలు ప్రకటించుకొనీ, సొంత జీవితంలోనో, ఉద్యమ జీవితంలోనో చిన్న కష్టం వచ్చినా, అనుకోనిది ఎదురెక్కి వచ్చినా తల్లకిందులైపోవడం చూస్తున్నాం. ఏదైనా సొంతం అనుకూలంగా ఉంటేనే. పిసరు తేడా వచ్చినా గడియారం ముల్లు పూర్తిగా వెనక్కి తిరిగిపోతుంది. కానీ భుజంగరావుగారిని పుట్టుకతోనే వల్లమాలిన కష్టాలు వరించాయి. తన చైతన్యం వల్ల వృద్ధాప్యంలో అజ్ఞాతవాస కష్టాలనూ ఎంచుకున్నారు. మొత్తం మీద శ్రమ, కష్టం మధ్యనే ఊహ వచ్చినప్పటి నుంచి మార్క్సిజం పక్షాన, ఉద్యమాల పక్షాన నిలిచి.. అదే పలవరింతగా, జీవితంగా, జీవన విధానంగా ఉండటాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? ఇలాంటి వాళ్లు ఎందరో వెళ్లిపోయారుగాని, వాళ్ల జీవితాలు ఆ పద్ధతిలో ఎలా నిర్దేశితం అయ్యాయో మనం విశ్లేషించుకోగలిగామా? అనే సందేహం కలుగుతోంది. ఏవో కొన్ని చెప్పుకుంటాంగాని ఒక మనిషి వ్యక్తిత్వం అలా రూపొందిన తీరు సొంతం తెలుకోవడం సాధ్యమేనా?

భుజంగరావుగారి గురించి ఆలోచిస్తోంటే వేటపాలెం వెంకాయమ్మ, గోరు మాధవరావు గుర్తుకు వచ్చారు. వీళ్ల మధ్య ఎన్నో తేడాలు క ఉండవచ్చు. కానీ అట్టడుగు నుంచి వచ్చి చివరంటా ఒకేలా జీవించడం అనే విషయంలో గొప్ప సామ్యం ఉంది. కొందరు సామాజికంగా, ఆర్థికంగా చాలా పై స్థాయిలో ఉండి కూడా చాలా సింపుల్‌గా, తమ కంటూ ఏమీ లేకుండా జీవించి వెళ్లిపోయిన వాళ్లున్నారు. వాళ్ల జీవితం చూస్తే చాలా ఆదర్శప్రాయం అనిపిస్తుంది. కానీ భుజంగరావు, వెంకాయమ్మ, మాధవరావులాంటి వాళ్లను తలుచుకుంటే ఇంకా చాలా అనిపిస్తుంది.

భుజంగారావుగారి జీవన తత్వం ఏమిటి? అనే ప్రశ్నకు ఇలా చెప్పుకోవచ్చేమో. సామాజిక జీవితంలోని అతి ముఖ్యమైన ఇవ్వడం-తీసుకోవడం అనే సంబంధంలో ఆయన తీసుకోవాలనుకోకపోవడం, తీసుకోగలిగిన చోటులోకి వెళ్లకపోవడం ఆయన జీవన తత్వం. తీసుకోవడం ఎన్ని రకాలుగా ఉంటుంది? సంపద, అధికారం, గుర్తింపు.. లాంటివి తీసుకోడానికి మనిషికి కార్తవీర్యార్జునుడిలాగా ఎన్ని చేతులుంటాయో.. చెప్పలేం. ఆయన సాహిత్యజీవి కదా.. ఆ రకంగా కూడా ఏమీ తీసుకోవడం ఆయన ప్రత్యేకత. చివరికి గుర్తింపు అనేది కూడా ఒక రకమైన తీసుకొనే వ్యవహారమే. ఆ రూపంలో కూడా ఆయన ఏమీ తీసుకోలేదు. బయటి సాహిత్య ప్రపంచంలోనేకాదు, ఆయన చివరంటా ఉన్న విప్లవ సాహిత్య ప్రపంచంలో కూడా ఆయన ఏ గుర్తింపూ కోరుకోలేదు. అలాంటివి ఏమీ లేకుండానే అచ్చమైన సాహిత్య బాటసారిలాగా వెళ్లిపోయారు. రచన సామాజికం అనే అవగాహన ఎంతో గాఢంగా ఉంటేగాని ఇది సాధ్యం కాదు.



ఆలూరి భుజంగరావుతో ఇంటర్వ్యూ :

# బౌద్ధం దళిత రాజకీయ భూమికా...?

- సజ్జా వెంకటేశ్వర్లు

బౌద్ధాన్ని స్వీకరించి దానిలో చాలా దూరం ప్రయాణించాక నేటి సమాజానికి అది చాలా ఎడంగా పోయిన ఆలోచనలుగా గుర్తించి, కమ్యూనిజంలోకి వచ్చి ఎన్నో విశేష రచనలు చేశారు రాహుల్ సాంకృత్యాయన్. ఆయన రచనల్ని తెలుగువారికి అందించిన వారిలో శ్రీ ఆలూరి భుజంగరావు గారు ముఖ్యులలో ఒకరు. మళ్ళీ ఇవాళ కొందు దళిత మేధావులు బౌద్ధం గురించి చేస్తున్న చర్చల్లో భాగంగా దాని మంచి చెడ్డలు గురించి శ్రీ ఆలూరి భుజంగరావుగారితో 26 జూలై 1999న విజయవాడలో సజ్జా వేంకటేశ్వర్లు జరిపిన ప్రత్యేక ఇంటర్వ్యూ ఇది.

నమస్కారం మాష్టారు. ఈ రోజు ఒక ప్రత్యేక అంశం గురించి మీ వంటి పెద్దలు చెబితే తెలుసుకోకోరి వచ్చాను. నా కోసం కొంత కాలాన్ని కేటాయిస్తారా? 'తప్పకుండా'. కూర్చోండి మాట్లాడుదాం. అడగండి.

1. బౌద్ధ తాత్త్విక భూమిక దళితుల రాజ్యాధికారాన్ని అంగీకరిస్తుందా?

జ. బుద్ధుడు బహుజన హితాయ, బహుజన సుఖాయ అన్నాడు. బహుజన రాజ్యాధికారాన్ని అతడెక్కడా ఉదహరించలేదు. దళితులకు రాజ్యాధికారం పోరాటం ద్వారా మాత్రమే వస్తుంది. అహింసకు పెద్దపీటం వేసిన బౌద్ధం దళితుల పోరాటాన్ని ఎలా అంగీకరిస్తుంది?

2. మరి ఇవాళ కొందరు దళితవాదులు బౌద్ధాన్ని తమ రాజకీయ తాత్త్విక భూమికగా, బౌద్ధం దళిత శక్తుల రాజ్యాధికారానికి మార్గాన్ని అందించే సాధనంగా ప్రచారం చేస్తున్నారు. దీని గురించి ఎలా స్పందిస్తారు.

జ. బుద్ధుడు కులాన్ని కాక జాతిని అంగీకరించలేదు. బౌద్ధ సంఘాల్లో బ్రాహ్మణుడు, పంచముడు (దళితుడు) ఒకే వరసన భోజనం చేయుట కద్దు. జాతి వివక్ష లేదు. సంఘాల వరకు! మరి అక్కడ దళితుడే లేనప్పుడు అతడి రాజ్యాధికారం అనే సమస్య ఇవాళ్టి భూమికగా బౌద్ధానికి ఎక్కడి నుండి అన్వయించగలం? అదీకాక బుద్ధుడు మహారాజుల్ని, చక్రవర్తుల్ని తిరస్కరించి, ప్రత్యేక రాజ్యాన్ని ఏర్పరుస్తాననే స్థితికి ఏనాడూ వెళ్ళనే లేదు. అంతేకాక, మహారాజుల, చక్రవర్తుల స్వార్థానికీ, అధికారానికీ నొప్పి కలిగించే పనిని బుద్ధుడు ఏనాడూ చేయలేదు.

పైగా బుద్ధుడు తన సంఘంలో సైనికుల్ని చేర్చుకోడాన్ని నిషేధించాడు. అలాగే రుణగ్రస్తుల్ని చేర్చుకోడాన్ని నిషేధించాడు. ఈ రెండు చర్యలు చక్రవర్తులకూ, ధనికస్వాములకు అనుకూలమైనవే. ఈ విధంగా బుద్ధుడు ప్రభువుల పట్ల తన విధేయతను ప్రకటించుకున్నాడు. కాకపోతే ఒకరిద్దరు రాజకుమారుల్ని సన్యాసులుగా మార్చారు.

ఇవాళ్టి దళితులు బౌద్ధం తమ రాజకీయ తాత్త్విక భూమిక చేసుకోవడం అంటే, పాలక వర్గ భావజాలంలో పడి కొట్టుకుపోవడమే అవుతుంది.

3. ఇవాళ దళితుల్ని పట్టి పీడిస్తున్న అన్ని రకాల అణిచివేతలకు పరిష్కారంగా, అంబేద్కర్ బౌద్ధంలో మరి సేద తీరాడు కదా?

జ. బుద్ధుణ్ణి, కాక బౌద్ధాన్ని నిజాయితీగా ఆశ్రయించిన వారికి అన్ని సమస్యల పరిష్కారంగా సన్యాసమే కేంద్రమవుతుంది. ఇవాళ దేశమంతటా సన్యాశ ఆశ్రమాలు ఏర్పరచి ప్రజల సమస్యలు పరిష్కరించలేం కదా? మరింక పీడనకు గురికాబడే వారంతా మరో మార్గం తొక్కక తప్పదు. ఇక్కడ మర్చిపోగూడని విషయం ఒకటి ఉంది. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటాన్ని నెత్తుటేరుల్లో ముంచేస్తున్న సమయంలోనే, భారత రాజ్యాంగ రచనను కొనసాగించారు అంబేద్కర్.

4. బుద్ధుడు హిందూ మత ఆధిపత్యాన్ని, మరీ ముఖ్యంగా బ్రాహ్మిణీకల్ కల్చర్‌ని ఏ మేరకు తిప్పి కొట్టాడు?

జ. బౌద్ధం ఆనాటి బ్రాహ్మణ ఆధిపత్యాలన్నింటినీ ఇప్పుడు ప్రచారం జరుగుతున్నంతగా అడ్డుకోలేక పోయింది. అందుకు కారణం బ్రాహ్మణులైన మంత్రులు, రాజాధిరాజులు బుద్ధుడి ఆరామాలకు విరివిగా విరాళాలు ఇవ్వడమే. అవి వారు స్వీకరించడమే. అంతేకాక బౌద్ధం తనవెంట దేశ దేశాలకు వ్యాపార సభ్యతను మోసుకు తిరిగింది. అందులో భాగమే కోటీశ్వరులైన వణిక్కులు (వైశ్యులు) బౌద్ధారామాలకు బంగారు వజ్ర వైఢూర్యాల కానుకలు సమర్పించుకున్నారు. ఆనాటి మతాలన్నీ సంపన్న వర్గాల సహాయ సహకారాలతోనే వెలుగులోకి వచ్చాయి. బౌద్ధం కూడా అందులో ఒకటి.

5. బౌద్ధం ఏ తాత్త్విక చింతన కారణంగా విశ్వవ్యాపితమైంది. ఆనాటి కాల పరిస్థితులు వివరిస్తారా?

జ. పదిహేడవ శతాబ్దంలో హెగెల్ చెప్పిన పదార్థ నిరంతర పరివర్తనశీల సిద్ధాంతాన్ని, బుద్ధుడు 25 వందల సంవత్సరాల క్రితమే ప్రకటించాడు. ఇది సామాన్యమైన విషయం కాదు. విశ్వపదార్థంలోని ప్రతిఒక్కటి (మనసుతో సహా) ప్రతిక్షణం కూడా పరివర్తన చెందుతున్నదనే సత్యాన్ని, తన కాలంలో బుద్ధుడు ప్రకటించడమంటే, ఇవాళ మనం ప్రజాపోరాటాల్ని సమర్థించడం కన్నా ప్రమాదకరమైనది. అయితే ఆనాటి సమాజం రాజరికం నుండి వ్యాపార ప్రాధాన్యంగల పరివర్తనకు చెందుతున్నది. అలాంటి సమాజానికి నిత్య పరివర్తన శీల సిద్ధాంతం అవసరమైంది.

6. ఇవాళ్టి సాహిత్య అవసరాల రీత్యా 'సింహావలోకనం' తరువాత అంతటి శక్తివంతమైన అనువాదం తెలుగులో రాకపోవడం వెనుక కారణాల్ని వివరిస్తారా?

కామ్రేడ్ గంటి ప్రసాదం సంస్మరణలో...

# నిరంతర జ్ఞాపకం మన గంటి

- చలసాని ప్రసాద్

చావు పుట్టుకల పొలిమేరలలో
ఆవులించెనొక చితాగ్ని గుండం
అనాథ జీవుల సమాధులన్నీ
అఘోరించి ఘోషించాయి (శ్రీశ్రీ)

అన్నట్టుగా నెల్లూరు పురవీథుల్లో తన నెత్తురొలికించి, మనందరినీ శోకసముద్రంలో ముంచెత్తాడు. మెడమీద కత్తివేటు, ముందు భాగంలో విషఖడ్గం చొరబాటు. కసిదీరక పొట్టలో గుళ్ళు. చేరువలో ఉన్న ఆసుపత్రికి తరలింపు. 'విప్లవం కోసం నన్ను బతికించండి' అంటూ వైద్యులకు విన్నపం. అయినా అప్పటికే చేయి దాటిపోయింది. విప్లవ ఉద్యమంలో కన్నుమూసిన వారి ఆప్తులనీ, మిత్రుల్నీ, బంధువుల్నీ ఊరడిస్తూ, ఎందరెందరితోనో పెనవేసుకు పోయాడు. ప్రతిఒక్కరితో పాలూ, నీరులా కలిసిపోయాడు. ప్రభుత్వానికి అదే కన్నెర్ర అయింది. మాటు కాసి, వేటు వేసి పొట్టన పెట్టుకుంది. ప్రజల కన్నీరు ఏరులయింది. జూలై 6న బొబ్బిలి నిజంగా కన్నీటి కడలిగా మారిపోయింది.

కడుపులోని దుఃఖంవలె
కరుళ్లెత్తి పడెడు కడలి
పచ్చని లోకమును చెరుప
వచ్చెడు శైశిర పిశాచి (దాశరథి)

ఆ కన్నీటి సంద్రాలలో వేలకు వేలు కెరటాలు.
కన్నీరు మానవుడిని బతికించగలిగితే
అమృతంలా అది కరువయ్యే (ఆత్రేయ)

ఇది అక్షర సత్యం. బొబ్బిలి (6వ తేదీ) లో అంత్యక్రియలయి పోయిన తరువాత ఎవరికి వారు ఇళ్ళకూ, ఊళ్ళకూ మళ్ళారు.

రక్తారుణ వైజయంతి
రమ్మన్నది పోతున్నాం (దాశరథి)

అని పాడుకుంటూ వెళ్ళారు. గంటి ప్రసాదం చూద్దామని కోరుకున్న విప్లవ విజయ సాధనలో మనందరం సమిధలం కావలసిందే.

గంటి ప్రసాదం (1949-2013) జీవిత విశేషాలు చెప్పుకుందాం. బొబ్బిలి దగ్గరలో పుట్టి పెరిగాడు. చదువు, సంధ్యలు కూడా అక్కడే. ప్రసాదం నాన్న పేరు కాశీపతి, అమ్మ పేరు వాసమ్మ. ఈ దంపతులకి ఆరుగురు మగ పిల్లలు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చాలాకాలంపాటు తెలుగు శాఖాధిపతిగా పనిచేసిన ఎస్. వి. జోగారావు గారికి (1928-92) కాశీపతి గురువుగారు. కాశీపతిగారు 1954లో చనిపోయారు. అప్పుడువారి ఆఖరి అబ్బాయి చంటికి నిండా రెండేళ్ళు కూడా లేవు. చంటి పెట్టు పేరు సుబ్రహ్మణ్యం. శ్రీకాకుళం జిల్లా పీపుల్స్‌వార్ పార్టీ కార్యదర్శిగా పని చేశాడు. నన్ను బాబాయి అని పిలిచేవాడు. పార్టీ నిర్మాణానికీ, అభివృద్ధికీ విశేషంగా కృషి చేశాడు. కొప్పుర్‌దంగ్ ఎన్‌కౌంటర్ (9 ఆగస్టు 1998) లో అమరుడయ్యాడు. తల్లి వాసమ్మకి చదువు రాదు. కాని మహాభారతం కంఠతా వచ్చు. హరికథా పితామహుడయిన ఆదిభట్ల నారాయణ దాసు (1864-1945) గారి ఆశు సంప్రదాయం అది. అంతే కాదు. కన్యాశుల్కం ఆమెకు కంఠోపాఠం. ఉమ్మడి కమ్యూనిస్టు ఉద్యమంలోని పార్టీ నాయకుడు గంటి రాజేశ్వరరావు వీరికి సగోత్రికుడేగాని, సమీప బంధువు కాదు. అయితే బోరి ఎన్‌కౌంటర్ (10 జూలై 1970) లో వెంపటాపుసత్యంతోపాటు అమరుడయిన ఆదిభట్ల కైలాసానికి ఈమె దగ్గర బంధువు. ఆరుగురు అన్నదమ్ములలో ఇద్దరు అమరులయ్యారు. ఇద్దరు అనారోగ్యంతో చనిపోయారు. ఇద్దరే మిగిలారు.

గంటి ప్రసాదం విప్లవ కార్యాచరణ నుంచి మనం నేర్చుకోవాల్సింది చాలా ఉంది. నీటిలో చేపల్లా మనం నిత్యం జనం నుంచి జవసత్వాలు పొంది వారి విముక్తికై పోరాడవలసి ఉంది. అదే మన గంటి ప్రసాదం స్ఫూర్తి.

అతని జీవితం మనకి మార్గదర్శి. ఒక రష్యన్ రచయిత అన్నట్లు జీవితకాలమంతా నేను మానవ సమాజ విముక్తి కోసమే పాటుబడ్డాననుకునేవాడే ధన్యజీవి. అలాంటి సార్థకజీవి, ధన్యజీవి మన గంటి ప్రసాదం.



---

జ. మీ ప్రశ్నను తిరగేస్తే బావుంటుంది ఎలా? సింహావలోకనం జరిగిన కాలంలో (1927 నుంచి 33 వరకు) ఆ చర్యలు లేక ఆ పోరాటాలు మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌కు చెందిన చైతన్యవంతమైన యువకులు తాము స్పందించి, పరాయి పాలకుల మీద పోరాడుతూ అనన్యమైన త్యాగాలు చేశారు. ఆ త్యాగాల ప్రతిఫలం తమకే దక్కుతుందన్న నమ్మకం అప్పటి భారత ఉన్నత వర్గాలకు ఉన్నది. కానీ ఈనాడు తెలుగు నేలన స్పష్టమైన వర్గదృష్టికోణంతో తమ త్యాగ ఫలితం సాధారణ ప్రజలకే దక్కాలనే ఆశయంతో అందుకు తగిన ఎత్తుగడలు సిద్ధాంతాలతో తెలుగు యువకులు పాలకవర్గాలతో పోరాడి ప్రాణాల్ని అర్పిస్తున్నారు. కనుకనే ఇప్పుడు తెలుగు నుంచి భారతీయ భాషలన్నింటిలోకీ మన పోరాట చరిత్ర వెలుతున్నది. పాణిగ్రాహి, చెరబండరాజు, గద్దర్, శ్రీశ్రీ, నిఖిలేశ్వర్ ఇంకా ఎందరో రచనలు అందుకు ఉదాహరణగా చెప్పవచ్చును.

7. చిట్టచివరగా పీడిత ప్రజల ఆగ్రహ వ్యాకరణాన్ని వివిధ సాహిత్య రూపాల్లో వ్యక్తీకరిస్తుంటే, దాన్ని బాలగోపాల్ వంటి మేధావులు 'శాడిజం' అని ముద్ర వేయడంపై మీరు ఎలా స్పందిస్తారు.

జ. ఈ మహాకాల ప్రవాహంలో ఐదు, పది సంవత్సరాలకూ చెప్పుకోదగిన వ్యక్తిత్వమే లేదు. ఎందుకంటే పదేళ్ళ క్రితం బాలగోపాల్ ఉపన్యాసాల్ని రచనల్ని విన్నాను. చదివాను. ఇవాల్టికీ ఆయన రాతలు చూస్తేనే ఉన్నాను. ఇవాళ ఆయనలో వచ్చిన పెడధోరణుల్ని గమనిస్తానే, ఆనాడు ఆయన నెత్తికెత్తుకున్న ఆయన కమిట్‌మెంట్ మరువలేము. అయితే అప్పటి తన ఉపన్యాసాల్ని, సాహిత్యాన్ని శాడిజానికి తలమానికం చేస్తే, మరి ఇప్పటి తన శాడిజానికి రూపు ఏ ఇజం అనగలదో వేచి చూద్దాం.

మాష్టారు చెప్పడం పూర్తయ్యాక మళ్ళీ తాను చెప్పిన జవాబుల్ని చదివి వినిపించుకున్నాక నేను సెలవు తీసుకొని బయటపడ్డాను.

*(ప్రకృతీ సాహితీ, ఆగస్టు - అక్టోబర్ 1999)*



# గంటి ప్రసాదం హత్య సందర్భంగా..

## ఇది ఇక్కడతో ఆగేది కాదు. ప్రజాసంఘాలకు, ప్రజాస్వామ్యవాదులకిది సవాల్ !

**- వరవరరావు**

పోలీసు అధికారులసంఘం గంటి ప్రసాదం హత్యపై భుజాలు తడుముకొని మావోయిస్టు పార్టీ నాయకుడిగా, మిలీషియ సభ్యుడిగా పని చేసిన గంటి ప్రసాదంకు సుదీర్ఘమైన నేర చరిత్ర ఉన్నందున,ఆయనకు ఎంతో మంది శత్రువులు ఉండొచ్చునని, ఆయన హత్యతో తమ ప్రమేయం లేదనడానికి ఒక బలహీనమైన స్వీయరక్షణ వాదనతో ముందుకు వచ్చింది.

పోలీసు అధికారుల సంఘం, మఫ్టీలో పోలీసులే వచ్చి హత్య చేశారని అన్నప్పుడు గాని,ఎన్‌కౌంటర్ల సందర్భంగా గానీ, అందుకు బాధ్యత వహించాల్సింది ప్రభుత్వమే అని చేస్తున్న ఆరోపణ నుంచి ప్రభుత్వాన్ని కాపాడడానికే ఎప్పుడూ ముందుకు వస్తున్నది. అది ఏ ప్రభుత్వమైనా సరే, ఎన్‌కౌంటర్లు అన్నీ ప్రభుత్వ హత్యలే కనుక వాటిని హత్యా నేరం కింద కేసు నమోదు చేసి, న్యాయవిచారణ చేసి,స్వీయరక్షణ కోసమే చేశారని రుజువు చేసుకోవల్సిన బాధ్యత వాళ్లదే అనే ఎపిసిఎల్‌సి మొదలైన హక్కుల సంఘాలవాదన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఐదుగురితో కూడిన ధర్మాసనం ఏకగ్రీవంగా ఆమోదించింది. సుప్రీంకోర్టుకు వెళ్లి ఈ తీర్పు అమలు మీద పోలీసు అధికారుల సంఘం స్టే తెచ్చింది. ఎపిసిఎల్‌సి వాదనలు విని సుప్రీంకోర్టు కేంద్రానికి, ఆయా రాష్ట్రాలకు నోటీసులు పంపినాక కానీ ఆయా ప్రభుత్వాలు అందులో కక్షిదారులు కాలేదు. పోలీసుల చేతుల్లోని ఆయుధాలు ఎట్లా ప్రభుత్వం ఆదేశించిన ప్రత్యర్థులను చంపుతున్నాయో పోలీసులు కూడ అట్లా హంతక ముఠాలు అవుతున్నారని, కాగూడదన్నదే ఈ ఆరోపణల్లో ఉన్న బలమైన వాదన. ప్రభుత్వం కోరుకుంటే ఎన్‌కౌంటర్లు కాని, ఇటువంటి హత్యలు కాని ఉండవనేది ఇదివరకు ఎన్నోసార్లు రుజువైంది. 3లో ఎన్టీఆర్ అధికారంలోకి వచ్చిన రోజుల్లో , 90 జనవరి నుంచి సెప్టెంబర్ దాకా చెన్నారెడ్డి పాలనలో, 2004 మే నుంచి 2005 జనవరి దాకా వైఎస్ఆర్ పాలనలో ఎన్‌కౌంటర్‌లు లేవు. అదే ఎన్టీఆర్ కాలంలో 5జనవరితో ప్రారంభించి ప్రజాసంఘాల నాయకులను చంపే పద్ధతిని ప్రవేశపెట్టారు. కరీంనగర్ జిల్లా ఎ.పి.సి.ఎల్.సి నాయకుడు, న్యాయవాది గోపిరాజన్నను ఆయన ఇంటిముందే ఆర్ఎస్ఎస్ వాళ్లు పోలీసుల ప్రోత్సాహంతో హత్య చేశారు. విచారించడానికి వెళ్లిన ఎ.పి.సి.ఎల్.సి కార్యదర్శి బాలగోపాల్ తలపై ఇనుపరాడ్‌తో కొట్టారు. ఇంకా నిర్దిష్టంగా సెప్టెంబర్ 3న వరంగల్‌లో ఆయన క్లినిక్‌లో పిల్లల వైద్యుడు, ఎపిసిఎల్‌సి ఉపాధ్యక్షుడు డాక్టర్ రామనాథంను చంపారు. జగిత్యాలలో 6 నవంబర్ 9న వేకువ జామున ఎపిసిఎల్‌సి కరీంనగర్ నాయకుడు, స్వాతంత్ర్య సమరయోధుడు జాపాలక్ష్మారెడిని కరీంనగర్ పక్కన అల్గునూరులో ఆయన ఇంట్లో జొరబడి పాయింటు బ్లాంకు రేంజ్‌లో కాల్చి చంపారు. జాపాలక్ష్మారెడ్డిని చంపిన పోలీసు అధికారి ఎవరో ఇపుడందరికీ స్పష్టంగా తెలుసు. 91 డిసెంబర్ 7న వరంగల్ జిల్లా ఎపిసిఎల్‌సి కార్యదర్శి, బార్ అసోసియేషన్ కార్యదర్శి నర్రాప్రభాకర్ రెడ్డిని ఆయన ఇంట్లో జొరబడి చంపారు. అపుడాయన చేతిలో నెలల పసి పాప ఉన్నది. ఇది చెన్నారెడ్డి కాంగ్రెస్ ప్రభుత్వం కాలం. 92లో నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు 'వార్త' దినపత్రికలో పనిచేసే గులాం రసూల్ అనే జర్నలిస్టును ఎన్‌కౌంటర్ పేరుతో చంపేసారు. గులాం రసూల్ విషయంలో మినహాయించి పైన పేర్కొన్న ఎవరి హత్య గురించి గానీ , ఆ తర్వాత కాలంలో ఎవరి హత్య గురించి గానీ ప్రభుత్వం ఎటువంటి దర్యాప్తు జరిపించలేదు. గులాం రసూల్ విషయంలో కూడ అది ఎన్‌కౌంటర్ పేరుతో పోలీసులు చేసిన హత్యనా,ఆత్మరక్షణ హత్యనా అని కాకుండా గులాం రసూల్ నక్సలైటా కాదా అన్నది న్యాయవిచారణ అంశంగా తీసుకొని జస్టిస్ టిఎల్ఎన్ రెడ్డి కమిషన్ గులాం రసూల్ నక్సలైటేనని తేల్చివేసింది.

కోర్టులలో కంటి తుడుపు ప్రాథమిక దర్యాప్తు నివేదిక అయినా ఇచ్చారా అన్నది ప్రాసిక్యూషన్‌కే తెలియాలి, ప్రభుత్వాలకే తెలియాలి. ఒక్క గద్దర్ మీద హత్యా ప్రయత్నం (6 ఏప్రిల్ 1997) సందర్భంగా మాత్రం సిబిసిఐడి విచారణ వేసారు గానీ ఇప్పటికీ ఆ నివేదిక ఏమైందో తెలియదు. ఈ సంవత్సరం కుడా ఆ విషయంలో ప్రభుత్వ విచారణ ఫలితమేమిటి, చర్య ఏమిటి అని ఆయన సహచరి విమల ముఖ్యమంత్రిని కలిసింది కాని.. మౌనమే సమాధానం.

గులాం రసూల్ జర్నలిస్టు అయినట్లే డాక్టర్ ఆమెడ నారాయణ వరంగల్ కెఎంసిలో చదువుతూ మొగిలిచెర్లలో క్లినిక్ పెట్టుకున్న పేదల డాక్టర్. డాక్టర్ రామనాథం ఆదర్శమే తప్ప ఆయన ఏ సంఘంలోనూ పని చేయడం లేదు. మొగిలిచెర్ల వరంగల్ పీపుల్స్‌వార్ నాయకుడు సుదర్శన్‌రెడ్డి (ఆర్‌కె) ఊరు. అదొక్కటే ఆయన చేసిన నేరం. కడుపులో నొప్పి నెపంతో ఆయన స్కూటర్‌కు అడ్డువచ్చి ఆపి మఫ్టీలో వచ్చిన పోలీసు కాల్చి చంపాడు.

ఇవన్నీ పోలీసులు మఫ్టీలో వచ్చి కాల్చి చంపిన ఉదంతాలైతే ఇంక తెలంగాణ గానకోకిల బెల్లి లలిత నుంచి కత్తులతో నరికి చంపడం ప్రారంభమైంది. ఆమెను పదిహేడు ముక్కలు చేసి బావిలో పడేసారు. ఎపిసిఎల్‌సి రాష్ట్ర జాయింట్ సెక్రటరీ పురుషోత్తంను 23 నవంబర్ 2000న దిల్‌సుఖ్‌నగర్‌లో ఆయన ఇంటికి వంద గజాల దూరంలో నరికి చంపారు. మాజీ నక్సలైట్ నయీంముఠా తామే చంపామని మీడియాకు చెప్పుకున్నది కూడ. ఇది మాత్రం కోర్టులో విచరణ జరిగి సాక్ష్యాలు లేవని కొట్టేసారు.

మూడు నెలలు కూడ గడవకముందే పురుషోత్తం సంస్మరణ సభ ఆవరణలో నల్లగొండలో జిల్లా ఎపిసిఎల్‌సి కార్యదర్శి ఆజంఅలీని కూడ ఇదే ముఠా కత్తులతో నరికి చంపింది. ఈ మూడు చంద్రబాబు నాయుడు పాలన కాలంలో మాజీ నక్సలైట్ నయీం ఆధ్వర్యంలో

జరిగిన హత్యలు. తన చెల్లిల్ని అవమానపరచాడని ఈదన్న అనే లొంగిపోయిన నక్సలైట్‌ను కూడ నయీం తాను జైల్లో ఉండగానే అతి దారుణంగా చంపించాడు. ఇవన్నీ ప్రభుత్వ ప్రత్యక్ష మద్దతుతో ఒక డిఐజి పోలీసు పర్యవేక్షణలో జరిగాయని మీడియా కోడై కూసింది. కరీంనగర్ జిల్లాలో తెలంగాణ జనసభ రవీందర్ రెడ్డిని చంపారు. 2002లో వరంగల్‌లో తెలంగాణ కళాసమితి ఐలన్నను, డిటిఎఫ్ చంద్రశేఖర్‌ను, ఆటో నడుపుకునే శంకర్‌ను, ఆసుపత్రిలోపనిచేసే సురేందర్‌ను పద్మాక్షమ్మ గుట్టకు తీసుకవెళ్లి ఎన్‌కౌంటర్ పేరుతో చంపారు. ఇవి కాక అజ్ఞాతంలో ఉన్న ఎందరో నక్సలైట్లను ఎన్‌కౌంటర్ల్ పేరుతోనే కాకుండా, కోవర్టు హత్యలు చేయించాడు చంద్రబాబు. 9లో పీపుల్స్‌వార్ నగర కార్యదర్శి సుభాష్, మెదక్ జిల్లా కమిటీ సభ్యుడు భానుతో పాటు లారీ ఓనర్ నాగార్జున రెడ్డి (చెరబండరాజు అల్లుడు) అనే ఏ సంబంధం లేని లీగల్ వ్యక్తిని ఎన్‌కౌంటర్ పేరుతో చంపారు. అచ్చంపేటలో టెలిఫోన్‌బూత్ నడుపుకునే వ్యక్తిని, వరంగల్ జిల్లాలో గంగిరెద్దువాళ్లను ఎన్‌కౌంటర్ పేరుతో చంపిన వంటి ఉదంతాలు ఇంకెన్నో...

ఈ కాలమంతా టైగర్స్ పేరుతో బెదిరింపులు, హత్యా ప్రయత్నాలు, హత్యలు ప్రజాసంఘాల నాయకుల దైనందిన జీవితం ఒక భీతావహ స్థితిలో కొనసాగిన కాలమది. ముఖ్యంగా కోవర్టు హత్యలు చేస్తూ, రియల్‌ఎస్టేట్ దందాలు, వ్యాపారులను బెదిరిస్తూ సెటిల్‌మెంట్లు చేస్తున్న మాజీ నక్సలైట్లు ఒక డిఐజి కనుసన్నల్లో ఒక నిర్భాణంగా పని చేస్తున్నారని, ఒక మాజీ నక్సలైట్, ఒక పోలీసు అధికారి కూతురు పెళ్లికి విలువైన నెక్లెస్ బహూకరించాడని ఎలక్ట్రానిక్ మీడియాలో చూపి మీడియా కోడై కూసినపుడు చంద్రబాబు ప్రభుత్వం సీనియర్ అధికారి రంగాచారి (ఐఎఎస్) కమిషన్ వేసిందిగానీ అధికారులెవరూ సహకరించక అది దర్యాప్తు విరమించుకున్నది.

2004 అక్టోబర్‌లో ప్రభుత్వంతో రెండు విప్లవ పార్టీల చర్చలు మొదటి దఫా ముగిసాక 2005 జనవరి న కర్నూలులో టైలర్‌షాపు నడుపుకునే లక్ష్మి అనే చైతన్యమహిళా సంఘం కార్యవర్గ సభ్యురాలిని ఎన్‌కౌంటర్ పేరుతో చంపివేయడంతో మళ్లీ రాజ్యహింస మొదలైంది. అదే జనవరి 15న తెలంగాణ రాష్ట్ర సమితి వరంగల్ జిల్లా ఉపాధ్యక్షుడు నల్లా వసంత్‌ను, తెలంగాణ జనసభ రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు సుదర్శన్ (నిజామాబాద్‌లో పోస్టల్ ఉద్యోగి)ని 'ఎన్‌కౌంటర్' చేశారు. 2006 ఆగస్టులో మహబూబ్‌నగర్‌లో స్కూల్‌కు పోతున్న డిటిఎఫ్ జిల్లా నాయకుడు, పిడిఎం, తెలంగాణ జనసభ నాయకుడు కనకాచారిని గొడ్డలితో నరికి చంపారు. ఇదే వరుసలో ఇదే జిల్లాలో హోలదాసరి సంఘం నాయకుడు, డిటిఎఫ్ కార్యకర్త మునెప్పను బస్‌స్టాండ్‌లో కాల్చి చంపారు. కరీంనగర్‌లో కళింగరావును చంపారు. ప్రకాశం జిల్లాలో సహకార బ్యాంకులో పనిచేసే కులనిర్మూలన పోరాట సమితి రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు మన్నెం ప్రసాద్‌ను బ్యాంకు ఆవరణలోనే బయటికి పిలిచి కత్తులు, గొడ్డళ్లతో నరికి చంపారు. వైఎస్ఆర్ హయాంలో ఈ హత్యలన్నిటినీ వివిధ ప్రాంతాల కోబ్రాల పేర్లతో తామే చేసామని ప్రకటించుకున్నారు. (పోలీసు - రక్షకుడు అనే మాట నుంచి గ్రేహౌండ్స్ - బూడిదరంగు తోడేళ్ళ వరకు పోలీసు వ్యవస్థలో సంక్షేమదృష్టి కనీసం భావనలో సంహారక దృష్టికి పతనమయిపోయింది. చాలనట్లు పగపట్టి చంపే నాగుపాములమనే అర్థంలో తమకు తాము పిలుచుకునే ప్రభుత్వ ప్రోత్సాహక హంతకముఠా పేరు ఇప్పుడు కేంద్రం రూపొందించిన మావోయిస్టుల పై దాడి చేసే ప్రత్యేక అర్ధసైనిక బలగాలకు పొడి అక్షరాల సంక్షిప్త నామమయింది - కోబ్రా బెటాలియన్ - ఆంధ్రానమూనా అంటే ఇదికూడానేమో).

ఇవి ప్రజాసంఘాలు, హక్కుల సంఘాలు ప్రభుత్వం మీద చేస్తున్న ఆరోపణలు మాత్రమే కాదు, రాష్ట్రంలోనే కాదు, దేశమంతా ప్రజలు నమ్ముతున్న నిజాలు. పోలీసు అధికారుల సంఘమేమో కానీ పేద పోలీసు కుటుంబాలకు కూడ తెలిసినవి చాలు. పోలీసు అధికార్లు కోవర్టులు ప్రైవేటుగా గర్వంగా ప్రకటించుకున్న హత్యా వాస్తవాలు కూడ.

గంటి ప్రసాదం హత్యాప్రయత్నం విషయంలో మరింత బలమైన అనుమానంతో, మేం దర్యాప్తుకు ముందే 'గంటి' హత్యకు ప్రభుత్వ ప్రేరేపిత పోలీసుల్నో, వ్యక్తుల్నో ఎందుకు బాధ్యుల్ని చేస్తున్నామంటే-

1, రాష్ట్రప్రభుత్వం వ్యూహరచన చేసిన ఈ కుట్ర పథకం తెలియని జిల్లా పోలీసు అధికారులు నిందితులు నెల్లూరు నగర సరిహద్దును దాటకముందే 24 గంటల్లో అరెస్టు చేస్తామని ప్రకటించి, ఇప్పటికి మెడ నరికిన కత్తిని మాత్రమే పక్క కాలువలో కనుగొనగలిగిన అమాయకత్వం వల్ల.

2, గంటి ప్రసాదం పై హత్యాప్రయత్నం ఒక ప్రైవేట్ ఆసుపత్రి ముందే జరిగింది. ముగ్గురు ఆయనపై దాడి చేసారు. ఒకరు మెడపై, మరొకరు కడుపులో కత్తి గాట్లు వేసారు. మూడో వ్యక్తి దగ్గరగా వంగి పిస్టల్‌తో మూడు బుల్లెట్లు శరీరంలో దూర్చాడు. ఏ ముసుగులు లేవు. నింపాదిగా నడిచి వెళ్లారు. ప్రత్యక్ష సాక్షులు అమరుల బంధుమిత్రుల సంఘం అధ్యక్షురాలు అంజమ్మ, సభ్యుడు నర్సన్న ఆసుపత్రి సిబ్బంది సహాయంతో ఆసుపత్రికి స్ట్రెచర్‌పై తరలించారు. వెంటనే శస్త్రచికిత్స చేసిన డాక్టర్ విజయ్‌కుమార్, మాంసం ముద్ద ఊడిపడిన మెడ దగ్గర కుట్లువేసి ఒక బులెట్ తొలగించి, 'చాల రక్త స్రావం అయింది. కిడ్నీ దగ్గర, వెన్నుపూస దగ్గర బులెట్లు ఉన్నాయి గనుక బతుకడం కష్ట'మని, నారాయణ ఆసుపత్రికి తరలిస్తూ నిమ్స్‌కు వెంటనే హెలికాప్టర్‌లో తీసుకవెళ్తే బతుకవచ్చునని చెప్పాడు. 97 ఏప్రిల్ 6న గద్దర్‌పై ఆయన ఇంట్లోనే హత్యాప్రయత్నం జరిగినపుడు ఆయన సహచరి విమల, సహాయంగా వచ్చిన వాళ్లు వెంటనే ఆటోలో సికింద్రాబాద్ గాంధీ ఆసుపత్రికి తీసుకవెళ్తే, చావుబతుకుల్లో ఉన్న ఆయనను ప్రాథమిక చికిత్స చేసి వెంటనే నిమ్స్‌కు తరలించి శస్త్ర చికిత్స చేయిస్తే బతుకవచ్చునని చెప్పారు. వెంటనే ప్రభుత్వం ఆయనను నిమ్స్‌కు తరలించి డాక్టర్ పిఆర్ రాజగోపాలన్ (గాంధీ ఆసుపత్రి రిటైర్డ్ సూపరింటెండెంట్,ఎపిసిఎల్‌సి ఉపాధ్యక్షుడు), ఎస్ఆర్ శంకరన్‌ల ఆమోదం పర్యవేక్షణలో గద్దర్‌కు శస్త్ర చికిత్స చేయించింది. దయ్యానికి దానికి ఇవ్వాల్సిన న్యాయం దానికివ్వాలంటారు (గివ్ ది డెవిల్ ఇట్స్ డ్యూ). ఆ విధంగా అపుడు గద్దర్ బతికాడు. ఇప్పటికీ వెన్నుపూస దగ్గర ఒక బులెట్ మిగిలి ఉన్నప్పటికి. ఆయనపై హత్యాప్రయత్నం చేసింది ప్రభుత్వమే కనుక ఆయనను ఎంత ఉన్నత స్థాయి ఆసుపత్రి అయినప్పటికీ నిమ్స్ కూడ ప్రభుత్వ ఆసుపత్రే గనుక శస్త్రచికిత్స చేయించవద్దని, ఆయనను అక్కడ శస్త్రచికిత్స పేరుతో చంపేస్తారని దళిత సంఘాలు, మహిళాసంఘాలు, కెజి

సత్యమూర్తి నాయకత్వంలో నిమ్స్ ముందు ఆందోళన చేపట్టాయి. తాము ప్రైవేటు ఆసుపత్రికి తీసుకవెళ్లి శస్త్ర చికిత్స చేయించు కుంటామన్నాయి. కాని ఎస్ఆర్ శంకరన్ గారి జోక్యంతో ఆ ఆందోళన ఆగిపోయింది.

ఆ అనుభవంతో జూలై 4 సాయంత్రం 6 గంటలకు అన్ని ప్రజాసంఘాలకు చెందిన వాళ్లం వందమంది దాక ముఖ్యమంత్రి క్యాంపు ఆఫీసుకు వెళ్లాం. ఈ హత్యాప్రయత్నానికి ప్రభుత్వమే బాధ్యత వహించాలని ఆరోపణ అలా ఉంచి అపుడు తక్షణ డిమాండ్ గంటి ప్రసాదంను వెంటనే హెలికాప్టర్‌లో నిమ్స్‌కు తరలించి శస్త్ర చికిత్స చేయించాలని. మమ్మల్ని క్యాంపు ఆఫీసు దగ్గరే ఆపేసి, ముఖ్యమంత్రికి మేం వచ్చిన సమాచారం కూడ చేరవేశారో లేదో తెలియదు. 'అపాయింటుమెంట్ తీసుకోకుండా వస్తే ఎలా కలవనిస్తాం' అన్నారు. 'ఇది ప్రత్యేక పరిస్థితి కదా. మనిషి కొన ఊపిరితో ఉన్నాడు. చెప్పివచ్చిన ఆపద కాదుకదా.. మేం వచ్చిన పని ఏమిటో ముఖ్యమంత్రి చెవిలో వేయండి. ఆయనే రమ్మంటాడు' అన్నాం. సి.ఎం. పి.ఎ.తో, పిఆర్ఒతో మాటడాం. ఆయనకు తెలిసిందీ తెలియదు, తెలియనిదీ తెలియదు. కాని ముందు అపాయింట్‌మెంట్ తీసుకోకుండా ఎట్లా వస్తారని మమ్ములను, మూసివేసిన గేటు ముందర కూడ తాడు అడ్డుపెట్టి తొసేసారు. వందల సంఖ్యలో పోలీసు బలగాలు వచ్చి మా పై చాల దౌర్జన్యం చేసాయి. పోలీసులు దురుసుగా, బలవంతంగా తొసేస్తే చాలమందికి దెబ్బలు తగిలాయి. కనీసం నలుగురికి ఊపిరి ఆడలేదు. ఒకరిని ఆసుపత్రిలో చేర్చాల్సి వచ్చింది. బలవంతంగా వ్యాన్‌లోకి తోసి మూడు బ్యాచ్‌లుగా అరెస్టు చేసి సంజీవరెడ్డి నగర్, పంజగుట్ట, ఘోషామహల్ స్టేడియం (షహనాజ గంజ్) పోలీసు స్టేషన్‌కు తరలించారు. ప్రదర్శకుల్లో ఎక్కువ శాతం చైతన్య మహిళా సంఘానికి, అమరుల బంధుమిత్రుల సంఘానికి, ఇతర సంఘాలకు, బస్తీలకు చెందిన మహిళలు ఉన్నారు. విద్యార్థులు, న్యాయవాదులు ఉన్నారు. తెలంగాణ ప్రజాఫ్రంట్, తెలంగాణ విద్యార్థి వేదిక నాయకులు, కార్యకర్తలు ఉన్నారు. ఎపిసిఎల్‌సి. సిఆర్‌పిపి, విరసం, పికెఎం, పిడిఎం, కెఎన్‌పిఎస్ మొదలైన సంఘాల నాయకులు, సభ్యులు ఉన్నారు. వీరందరిలో ప్రతి ఒక్కరికి గంటి ప్రసాదం తో ప్రత్యక్ష, పరోక్ష ఆత్మీయ పరిచయం ఉన్నది. అందువల్లనే మూడున్నర గంటలకు దాడి వార్త తెలియగానే నాలుగున్నర గంటలకు బాగ్‌లింగంపల్లి పార్క్‌లో సమావేశమై దాడికి నిరసనగా నిరసనో, ధర్నా కన్నా సి.ఎం. క్యాంపుకు వెళ్లి, కొన ఊపిరితో వున్న ఆయనను నిమ్స్‌కు తరలించాలని డిమాండ్ చేయడమే తక్షణ కర్తవ్యం అనుకున్నారు. గతం (జులై 2011)లో దుడ్డు ప్రభాకర్ హైదరాబాద్ రావల్సిన సమయంలో రాకపోతే పోలీసులు కిడ్నాప్ చేసారని అనుమానంతో అప్పుడూ ఇట్లాగే సి.ఎం. క్యాంపుకు వెళితే అప్పుడు కూడ ముందుగా తీసుకున్న అపాయింట్‌మెంట్ లేకున్నా గేటులోకి పోనిచ్చారు. లోపలికి అనుమతిచ్చే చోట నినాదాలు ఇచ్చి సిట్టింగ్ చేస్తే బయట మేం వచ్చామని తెలిసి సి.ఎం లోపలకు రమ్మన్నాడు. మా ముందే హోంమంత్రితో, ఇంటెలిజెన్స్ అధికారితో మాట్లాడి దుడ్డు ప్రభాకర్‌ను తాము ఏమీ చేయలేదని చెప్పాడు. ఎంతో మర్యాదగా ప్రవర్తించాడు. నిజంగానే మా ఆందోళనయే తప్ప దుడ్డు ప్రభాకర్ ఒక రోజు ఆలస్యంగా హైదరాబాద్‌కు వచ్చిండు. అంటే ప్రభుత్వానికి తన యందు తప్పలేదు కనుక ముందుగా అనుమతి తీసుకోకున్నా ముఖ్యమంత్రిని కలవనిచ్చారు. మర్యాద చేసారు. తమ బాధ్యత లేదని మాకు విశ్వాసం కలిగేలా చెప్పారు. ఇపుడు ప్రభుత్వ ప్రమేయం ఉన్నది కాబట్టి రోడ్డు మీదనే క్యాంపు కార్యాలయం గేటు మూసివేసి, పోలీసు బ్యారికేడ్ కట్టి, మా పై దౌర్జన్యం చేసి ఎస్ఆర్ నగర్ పోలీసు స్టేషన్‌లో నిర్బంధించిన వారిపై కేసు కూడ పెట్టారు. కనుక ప్రభుత్వమే ప్రసాదంపై దాడి చేసిందనే మా ఆరోపణకు బలమిస్తున్న రెండవ అంశం-

దాడి జరిగిన మరుక్షణం నుంచి ప్రభుత్వం తమకు అనుకూలమైన చానల్‌లలో కొన్ని కథనాలను ప్రారంభించింది. ఒక చానల్ 'నెల్లూరులో పట్టపగలు మాజీ మావోయిస్టు గంటి ప్రసాదం పై మావోయిస్టుల దాడి. నెల్లూరులో మావోయిస్టుల కలకలం' అని తాటికాయంత అక్షరాలలో నిరంతరం ఒక బాక్స్ ఐటమ్ చూపింది. గంటి ప్రసాదం మాజీ మావోయిస్టు కనుక ఆయన మీద 37 కేసులున్నాయని, ఆయనకు చాలమంది ప్రత్యర్థులు ఉండే అవకాశం ఉందని వారెవరైన ఆయనపై దాడి చేసి ఉండొచ్చని ఒకటి రెండు చానల్‌లు చెప్పాయి. జూలై 4నుంచే భారతదేశాన్ని మొత్తంగా ఒకేసారి విముక్తం చేసే ప్రజాయుద్ధం కోసం మావోయిస్టు పార్టీ ప్రజా విముక్తి సైన్యాన్ని తయారు చేసుకుంటుందని, ఇక యుద్ధమేనని ఒక ప్రముఖ దిన పత్రిక ఒక కథనం ప్రారంభించి జులై5 నుంచే దాని పక్కన గంటి ప్రసాదం హత్య వార్త కథనాలు వేయడం ప్రారంభించింది. ఐదో తేది 'ప్రజా యుద్ధం గన్‌షాట్‌గా.. 'శీర్షిక ప్రసాదం ఫోటో ఉన్న గంటి ప్రసాదం హత్య వార్తకు అభిముఖంగా ఉంటుంది. అ పత్రికలోనే జూలై 8వ తేదీన గంటి ప్రసాదంను చంపింది తామేనని సిపిఐ ఎంఎల్ తమిళనాడు, చత్తీస్‌గఢ్, జార్ఖండ్ సంయుక్త రాష్ట్రాల కమిటీ తరఫున సబలేంద్ర శుక్లా కర్మ పేరుతో ఒక ప్రకటనను ప్రచురించింది. ఈ పేరు సబలేంద్రలో మావోయిస్టులు ఝార్ఖండ్‌లో చంపిన ఎస్‌పి పేరును, చత్తీస్‌గఢ్‌లో దర్భాఘట్ దాడిలో చనిపోయిన వి.సి. శుక్లా, మహేంద్రకర్మ పేర్లను కలిపి పెట్టుకున్న సంయుక్త నామమనేది స్పష్టమే. తమిళనాడుకు దగ్గరగా ఉండటం వల్ల తమిళనాడులో ఎల్‌టిటిఈ పట్ల అభిమానం ఎక్కువగా ఉండే అవకాశం ఉంది కనుక మావోయిస్టులకు వాళ్లకు సంబంధాలు చూపించడానికి ఈ కల్పిత వ్యతిరేక పార్టీలో తమిళనాడును కూడ చేర్చారు . లేదా తమిళనాడులో మావోయిస్టు పార్టీ పునర్‌నిర్మాణం (తమిళనాడు, కర్ణాటక, కేరళ సరిహద్దుల్లో - సముద్రతీర పడమటి కనుమల్లో మావోయిస్టుపార్టీ పడమటికనుమల స్పెషల్ గెరిల్లాజోన్ ఏర్పడిందని, కేరళలో తీవ్ర నిర్బంధం అమలవుతున్నది. థండర్ బోల్ట్ ఆపరేషన్ పేరుతో గాలింపు చర్యలు జరుగుతున్నవి. తమిళనాడు, కేరళలో యుఎపిఎ కింద ప్రజాసంఘాల నాయకులను, కార్యకర్తలను, ముస్లిం యువకులను అరెస్టు చేసి నెలల తరబడి బెయిలు కూడా ఇవ్వడం లేదు.) అవుతుందనే ముందు జాగ్రత్తతో కూడ ఇందులో తమిళనాడు పేరు చేర్చి ఉండవచ్చు. ఈ దృష్టితోనే చత్తీస్‌గఢ్, దర్భా సంఘటనల తర్వాత జరిగిన ముఖ్యమంత్రుల సమావేశానికి హోంమంత్రి తమిళనాడు ప్రభుత్వాన్ని కూడ పిలిచి ఉండవచ్చు. అక్కడ దేశానికి అంతర్గత పెనుప్రమాదంగా భావిస్తున్న మావోయిస్టు పార్టీని సంయుక్తంగా ఎదుర్కోవాలని కేంద్రం సూచించింది. అందుకు

ఆంధ్ర నమూనాను ఆదర్శంగా తీసుకొమ్మంది. ఈ ఆంధ్ర నమూన ఏమిటో చర్చించే ముందు మళ్లీ ఒకసారి గంటి ప్రసాదం హత్య గురించి పరిశీలిద్దాం. ప్రకాశం జిల్లా ఎస్‌పి లడ్డాపై 27 ఏప్రిల్ 2005లో హత్యాప్రయత్నం వ్యూహకర్త గంటి ప్రసాదం అని మీడియా పేర్కొన్నది. ఆ కేసులో కళ్యాణరావు, వరవరరావు కూడ ముద్దాయిలు . అందులో ఆరోపణలు ఏంటంటే, వివి ఇంటికి రామకృష్ణ, శాఖమూరి అప్పారావు వస్తే గంటి ప్రసాదం వెళ్లి హైదరాబాద్‌లో ఉంటున్న కళ్యాణరావు ను కూడ తీసుక వచ్చాడని. ఇంక మరే ఆరోపణ లేదు. ఇది ఒక లొంగిపోయిన జంటతో చెప్పించి ఈ ముగ్గుర్ని ముద్దాయిలుగా చేర్చారు. వివి ఇంటికి అజ్ఞాతంలో ఉన్న రామకృష్ణ, అప్పారావు రావడం ఎంత తెలివి తక్కువగా ఉన్నదో, ఇప్పుడు లడ్డా పై హత్యాప్రయత్నానికి ప్రసాదం వ్యూహకర్త అనేది కూడ అంత హాస్యాస్పదంగా ఉన్నది. మా ఇంత నిరాధారమైన ఆరోపణ కాబట్టే ఒంగోలు సెషన్స్ కోర్టు ఈ కేసు విచారించి కొట్టివేసింది. ఆ లొంగిపోయిన జంట తమ నోట పోలీసులు పెట్టాలనుకున్న మాటను చెప్పడానికి నిరాకరించారు. ఇంత కన్నా అసంబద్ధమైన ఆరోపణ. దర్భా సంఘటన వ్యూహకర్త కూడ గంటి ప్రసాదమేనని పేర్కొనడం. ఒక వైపు అదే పత్రిక 'ప్రజాయుద్ధం', పదిహేను వేల 'ప్రజావిముక్తి సైన్యం' దండకారణ్యం విముక్తి ప్రాంతం 'ఆయుధగారాల స్థాపన' వంటి ప్రజలు ఎంతో ఉత్తేజితులయ్యే వార్తలు రాస్తూ, వ్యూహానికి సెంట్రల్ మిలిటరీ కమిషన్, ఇంటలిజెన్స్‌కు వ్యూహకర్తలెవరో వాళ్ల ఫోటోలు కూడ ప్రచురిస్తూ, మరొక వైపు నెల్లూరులో హత్యకు గురైన గంటి ప్రసాదం దర్భా సంఘటనకు కీలక వ్యూహకర్త అనడం తన రాతలను తానే, ఎప్పటికెయ్యది ప్రస్తుతంగా వాడుకుంటున్నదని అర్థం. ఇది పరస్పర విరుద్ధ వార్తల కథనమే. అసంబద్ధమే. అబద్ధమే. చత్తీస్‌గడ్ వంటి బయటి రాష్ట్రాల్లోని ఘటనలకు కూడ గంటి ప్రసాదంను ఈ పత్రిక ఎందుకు బాధ్యుణ్ణి చేస్తున్నదంటే ఆయన హంతకులు చత్తీస్‌గడ్ నుంచి వచ్చారు అని చెప్పడానికి. పైగా వాళ్లు అటు ఆయనను బొబ్బిలి నుంచి నెల్లూరుకు వెంబడించారట. అంటే విశాఖ మీదుగానో విజయనగరం మీదుగానో చత్తీస్‌గడ్ నుంచి వచ్చారని ఈ పత్రిక సూచిస్తున్నదన్నమాట.

నిజానికి గంటి ప్రసాదం నెల్లూరుకు ఎక్కడి నుంచి వెళ్లాడు?

గుంటూరు నుంచి వెళ్లాడు. జూలై 2న హైదరాబాద్‌లో బయలుదేరి 3న గుంటూరు చేరి, అక్కడ విరసం సభలో అమరుడు ఆలూరి భుజంగరావు విప్లవ త్యాగనిరతి గురించి అద్భుతంగా మాట్లాడి అక్కడి నుంచి 4 ఉదయం నెల్లూరుకు చేరుకున్నాడు. నెల్లూరు టౌన్‌హాల్‌లో జరిగిన విరసం మహాసభలో కూడ అమరుడు ఆలూరి భుజంగరావు జీవితం, విప్లవాచరణ గురించి మాట్లాడాడు. ఆ మధ్యాహ్నం ఆయన అమరుల బంధుమిత్రుల సంఘం ఏర్పాటు చేసిన కూటాల మర్రి అమరుల సంస్మరణ సభలో మాట్లాడాల్సి ఉంది. మధ్యాహ్న భోజన అనంతరం ఈ కూటాల మర్రి అమరులలో ఒకరైన ఆనంద్ సోదరి కామాక్షమ్మ చావుబతుకుల్లో ఉన్నదంటే చూడటానికి అంజమ్మ, నర్సన్నలతో పాటు బయలుదేరి వెళ్లాడు. అక్కడ పొంచి ఉన్నారు ఈ పత్రిక చెబుతున్న సోకాల్డ్ చత్తీస్‌గడ్ నుంచి వచ్చిన హంతకులు. ఇన్ని కారణాల వల్ల ఈ నేరం ఈ హత్య, కేంద్రహోంమంత్రి నాయకత్వంలో జరిగిన ముఖ్యమంత్రుల సమావేశంలో తీసుకున్న నిర్ణయం ప్రకారం ఆంధ్ర నమూన ప్రకారమే అమలు అయిందనేది సుస్పష్టమే. అందుకే మేం ఇందుకు కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాలు బాధ్యత వహించాలని, గంటి ప్రసాదం హత్య, ప్రజలపై యుద్ధంలో భాగంగా గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో భాగమేనని ఆరోపిస్తున్నాం. గ్రీన్‌హంట్ ఆపరేషన్ ప్రజల శ్రమజీవన హరితాన్ని, ప్రకృతి వనరులను కార్పోరేట్ శక్తులు కొల్లగొట్టడానికే.

శ్రీకాకుళంలో ముఖ్యంగా కొవ్వాడలో కార్పొరేట్ కంపెనీల ట్రైటెమర్ విధ్వంసాన్ని ప్రతిఘటించే ప్రజా ఉద్యమానికి క్రియాశీలమైన మార్గదర్శకత్వం ఇస్తున్నది గంటి ప్రసాదం. కోస్టల్ కారిడార్ పేరుతో నెల్లూరు నుంచి శ్రీకాకుళం దాక 70 పవర్‌ప్లాంట్‌లు, పర్యాటక పరిశ్రమలు స్థాపించి మత్స్యకారుల, ప్రజల జీవన విధ్వంసానికి పూనుకున్న ఈ దళారీ ప్రభుత్వం నెల్లూరులో ఆయనను హత్య చేయడం ఆశ్చర్యమేమీ కాదు. (చిప్కో ఉద్యమకాలం నుంచి హిమాలయ ఉపపర్వత శ్రేణుల్లో తెరాయి ప్రాంతంలో చెట్లను నరకవద్దని, భారీ ప్రాజెక్టులు కట్టవద్దని పర్యావరణవేత్తలు , ప్రజాస్వామ్యవాదులు ఎన్ని ఉద్యమాలు చేసినా డెబ్బయ్ పవర్ ప్రాజెక్టుల నిర్మాణం, తెరాయి డ్యాం నిర్మాణం చేపట్టినా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల హిమాలయాలంతటి నేరం చార్ ధాం - హిమాలయాలంతటి విషాదానికి పదిహేనువేలమంది మరణానికి కారణమయిన చోట, ప్రసాదం హత్య విషయంలో ఏం న్యాయం ఆశించగలం?)

విశాఖపట్నంలో అరెస్టు చేసి ఆయనను సిమ్లిగూడ పోలీసు స్టేషన్‌లో ముద్దాయిగా కోరాపుట్ జైల్లో పెట్టినపుడు కోరాపుట్, మల్కన్‌గిరి జైళ్లలో ఆదివాసి ఖైదీలందరిని విడుదల చేయాలని కోరుతూ, వారి కోసం నిరాహార దీక్ష చేసాడు. ఆ ఆదివాసులందరు నారాయణపట్నంలో ఆ రెండు జిల్లాల్లో తాము స్వాధీనం చేసుకున్న భూముల్లో తమకు ఒరిస్సా 1956 రెగ్యులేషన్ చట్టం ప్రకారం పట్టాలు ఇవ్వాలని డిమాండ్ చేస్తూ పోరాడి అరెస్టు అయిన వాళ్లు. శ్రీకాకుళ పోరాటాన్ని తలపిస్తున్న నారాయణ పట్నం పోరాటానికి మావోయిస్టు పార్టీ ఎఒబి స్పెషల్ జోనల్ కమిటీ నాయకత్వం వహిస్తున్నది. ఎఒబి, ఎపి ఉద్యమ నాయకుడు రామకృష్ణకు 2005 దాక చేదోడు వాదోడుగా ఉన్న రాష్ట్ర కమిటీ సభ్యుడు గంటి ప్రసాదం. 2005 మే 2న ఔరంగాబాద్‌లో సిపిఐ మావోయిస్టు రాష్ట్ర కమిటీ అధికారప్రతినిధిగా అరెస్టు అయినపుడే ఆయన ఎన్‌కౌంటర్ అయ్యేవాడు. కాని అపుడు ఆయనతో చర్చించడానికి వెళ్లిన విప్లవ రచయితలు (అందులో ఒకరు పత్రికా రచయిత) ఉన్నందువల్ల ఆయనను చంపడం సాధ్యం కాలేదు. నిజామాబాద్‌లో అరెస్టు అయినట్లు చూపి జైల్లో పెట్టారు. మిగతా వారు బెయిల్‌పై విడుదల కాగా చంచల్‌గూడ జైలుకు తరలించారు. ఆ కేసు, అప్పటిదాక ఆయనపై పెట్టిన కేసులన్నీ ఆయన హత్య నాటికి కొట్టివేయబడినవి. న్యాయస్థానాలు నిర్దోషిగా ప్రకటించిన ఈ మావోయిస్టును చంపడానికి ప్రభుత్వం ఆయనను మాజీ మావోయిస్టుగా చిత్రించింది. ఆయనకు చాల మంది శత్రువులు ఉన్నారు అన్నది. అవును ఆయనకు శత్రువులు ఉన్నారు. అవి సామ్రాజ్యవాదం, భూస్వామ్యం, వాటి దళారీ నిరంకుశ ప్రభుత్వం. దాని ఫాసిస్టు, టెర్రరిస్టు విధానాలు. వాటిపై పోరాడుతున్న ప్రజల్లో ఆయన ఉన్నాడు. అందుకే ఆయనను ఆంధ్ర నమూనలో ప్రత్యర్థి

చంపేసాడు.

ఏమిటీ ఈ అంధ్ర నమూన?

ఎన్‌టిఆర్ హయాంలో అప్పటి డిఐజి కెఎస్ వ్యాస్ రుపొందించిన గ్రేహౌండ్స్ అనే చట్ట వ్యతిరేక పోలీసు బలగాలు మావోయిస్టు ఉద్యమాన్ని అణచివేయడంలో విజయం సాధించాయి అనేది ఇప్పుడు కేంద్రం రాష్ట్రాలకు చూపుతున్న ఒక నమూన. వివిధ రాష్ట్ర పోలీసుశాఖల నుంచి మెరికల వంటి మెరటు పోలీసులనెంచుకొని, ఒక హంతక బలగాన్ని తయారు చేసి దానికి బూడిద రంగు తొడేళ్లు అని పేరు పెట్టారు. వాటికి యూనిఫారాలు ఉండవు, నేమ్ ప్లేట్స్ ఉండవు, పోలీసు వాహనాలు ఉపయోగించరు. ప్రైవేట్ భవనాల్లోనే చిత్రహింసలకు గురిచేస్తారు. వీళ్లకు జురిస్‌డిక్షన్ ఉండదు. కోపర్‌డంగ్ కూడ వెళ్లి శ్రీకాకుళం కార్యదర్శి గంటి రమేష్ (గంటి ప్రసాదం తమ్ముడు) తో పాటు 17 మంది ప్లీనంలో వున్న మావోయిస్టులపై గ్రెనేడ్లు వేసి కాల్పులు జరిపి చంపగలరు. చత్తీస్‌గడ్ లోని పువ్వార్‌కు వెళ్లి సిఆర్‌పిఎఫ్, కోయ కమెండోలకు కూడ నాయకత్వం వహించి కెకెడబ్ల్యు నాయకత్వం తొమ్మిది మందిని తుద ముట్టించగలరు. వీళ్లు ఖర్చుకే కాదు, చర్యలకు కూడ ఎవరికీ జవాబుదారీ కాదు. ఎస్ఐబి మిలాఖత్ తో ఇది పడమట పంజాబ్ నుంచి తూర్పున జంగల్ మహల్ వరకు. ఉత్తరాన ఢిల్లీ నుంచి దక్షిణాన కొల్లాం (కేరళ) వరకు ఎక్కడికైనా వెళ్లి ఎవరినైనా పట్టుకోగలరు. కిషన్‌జీ మొదలు, రాజమౌళి వరకు, పటేల్ సుధాకర్, అప్పారావు మొదలు ఆజాద్ వరకు ఎన్‌కౌంటర్ చేయగలవు. అవి నాగపూర్, సిర్డీ, చెన్నై వంటి ఏ ప్రాంతాలైనా అక్కణ్నించి ఈ తొడేళ్లు జనాలను ఎత్తుకొచ్చి ఇక్కడ చంపి తమ రక్తదాహాన్ని తీర్చుకోగలవు . బలిమెల (ఒరిస్సా) సంఘటనలో 37 మంది గ్రేహౌండ్స్‌ను మావోయిస్టు దళం దాడి చేసి మట్టుపెట్టిన తర్వాత ఆత్మస్థైర్యం కొల్పోయినప్పటికీ, పువ్వార్ తరువాత వీళ్లకు పూనకం వచ్చినట్లు ఉన్నది.

అయితే ఇది ప్రచారం చేస్తున్న నమునాయే కానీ ఇంత కన్నా కేంద్రానికి నచ్చిన నమూనా మాజీ నక్సలైట్లతోనూ, మాఫియాతోను తయారు చేసుకునే కిరాయి హంతకులు, కోవర్టు హత్యలు. ఈ నమూనతో బెంగాల్‌లో హర్మద్‌వాహిని, ఝార్ఖండ్‌లో సేత్నా(ఇప్పుడు ఝార్ఖండ్ ఎపి లోని మాజీ నక్సలైట్లకన్నా ఒక ఆకు ఎక్కువ చదివిన మాజీ నక్సలైట్లతో 'తృతీయ ప్రస్తుతి' అని ఒక హంతక సంస్థను రూపొందించి సీఆర్ పీఎఫ్ కనుసన్నల్లో కోవర్టు ఆపరేషన్లు నిర్వహిస్తూ - భారీ ఎంకౌంటర్లు ప్రకటిస్తున్నారు. ఇవి సి ఆర్ పి ఎఫ్ - మావోయిస్టు- ఎంకౌంటర్లు కావు - తృతీయ ప్రస్తుతి - సి ఆర్ పి ఎఫ్ సంయుక్త దాడులని మీడియానే వాస్తవాలు రాస్తున్నది. జైరాం రమేశ్ భద్రతతో కూడిన 'సరండా ఆపరేషన్' అభివృద్ధి నమూనా ఇది), ఒరిస్సాలో శాంతిసేన, చత్తీస్‌గడ్‌లో సల్వాజుడుం ఏర్పాటు చేశారు. కాని ఇవేవీ వాళ్లు ఆశించిన ఫలితాలను ఇవ్వలేదు. పైగా ఎదురు దెబ్బలు అయినవి. గ్రేహౌండ్స్ వంటి బలగాలను ఆయా రాష్ట్రాలకు కూడా రూపొందించుకున్నారు. మహారాష్ట్ర, గడ్చిరోలీలో సి 60 కమెండో వలె.

ఐతే ఆంధ్రలో మాత్రమే అమలవుతున్న ఒక ప్రత్యేక నమూన మావోయిస్టు చర్యలకు ప్రతీకారంగా ప్రజాసంఘాల నాయకులను చంపే నమూన. మాజీ నక్సలైట్ల చేతుల్లో విప్లవకారులతో సహా ప్రజా సంఘాల నాయకులను చంపించే నమూన. ఇది డాక్టర్ రామనాథం కాలం నుంచి అమలు చేస్తున్న క్రమంలో గంటి ప్రసాదం మొదటివాడు కానట్లే ఆఖరివాడు కూడకాదు.

మావోయిస్టుల చర్యలకు ప్రతీకారంగా ప్రజాసంఘం నాయకులను నిర్బంధించడం, హత్య చేయడం వేరే రాష్ట్రాల్లో లేక పోలేదు. బెంగాల్‌లో లెఫ్ట్‌ఫ్రంట్ ప్రభుత్వం బెంగాలీ 'పీపుల్స్ మార్చ్' సంపాదకుడు సపన్ దాస్ గుప్తాను జైల్లో చనిపోయేలా చూసింది. తన కొడుకు స్కూల్ సర్టిఫికెట్ తీసుకపోవడానికి ఇంటికి వచ్చిన. ఆదివాసి సంఘ నాయకుడు లాల్‌మోహన్ టుడును ఇంటి నుంచి పట్టుకపోయి ఎన్‌కౌంటర్ పేరుతో చంపివేసింది. ఝార్ఖండ్‌లో జీతన్‌మరాండి, ఆయన సహచరులైన సాంస్కృతిక కార్యకర్తలకు ఉరిశిక్ష వేసింది. విడుదల అయితే ఆయనే కాదు ఆయన సహచరి అపర్ణమరాండిని కూడ క్రైం కంట్రోల్ యాక్టు కింద జైల్లో పెట్టింది.

ఇంకా మధ్య తరగతే రుపొందని చత్తీస్‌గడ్‌లో డాక్టర్ బినాయక్‌సేన్‌కి యావజ్జీవ శిక్ష వేసి, అసిత్‌సేన్‌గుప్తాకు 8 ఏండ్ల శిక్ష వేసి, భయం గొలిపే యుఎపిఎ చట్టం కింద అరెస్టు చేసిన సోనిసోరి , ఆమె మేనల్లుడుకు హైకోర్టులో బెయిల్ నిరాకరించి బుద్ధి జీవులను తల ఎత్తుకుండా చేస్తున్నది. ఇక మిగిలినది ఆంధ్రప్రదేశ్, జంగల్ మహల్, ఝార్ఖండ్ మొదలు దండకారణ్యం ఒరిస్సా వరకు బహుళ జాతి కంపెనీల, కార్పొరేట్ శక్తుల దోపిడి, విధ్వంసాలకు గురికాకుండా ప్రకృతి వనరులను కాపాడుకోవడానికి పోరాడుతున్న ఆదివాసులకు దండకారణ్యం, ఝార్ఖండ్‌లో వాళ్లకు నాయకత్వం వహిస్తున్న మావోయిస్టు పార్టీ ప్రత్యామ్నాయ ప్రజా అభివృద్ధి నమూనాకు మద్దతుగా ఆంధ్రప్రదేశ్ లో ప్రజాభిప్రాయాన్ని కూడ గడుతున్న ప్రజాసంఘాలకు నాయకత్వం వహిస్తున్నాడు గంటి ప్రసాదం. 2009 నుంచి గ్రీన్‌హంట్ ఆపరేషన్‌కు వ్యతిరేకంగా, అదే కాలంలో మిలిటెంట్ రుపాలు తీసుకున్న ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి మద్దతుగా ఆయన ప్రజాస్వామిక మద్దతును కూడగడుతున్నాడు. ప్రజాబలాన్ని కూడగడుతున్నాడు. అది ఈ ప్రభుత్వానికి కక్ష. దర్భా సంఘటనకు వ్యూహకర్త అయినందుకు కాదు, గ్రీన్‌హంట్ ఆపరేషన్‌కు వ్యతిరేకంగా జనతన సర్కార్ నాయకత్వంలో ప్రజలు పాలుపంచుకుంటున్న స్వావలంబన, ప్రజల అభివృద్ధి నమూనకు అనుకూలంగా ప్రజా ఉద్యమాన్ని నిర్మాణం చేస్తున్నందుకు ఆయనపై ఈ దాడి. దర్భా ఘటనకు, ఝార్ఖండ్ ఎస్పీ హత్యకు ప్రతీకారమంటున్నారు. కాంగ్రెస్ నాయకుల ప్రాణలకు, ఎస్పీ కన్న ఉన్నతమైన అధికారుల ప్రాణాలకు మాత్రమే విలువ ఉన్నది. ప్రాణాలను పణంగా పెట్టి శాంతి భద్రతలను కాపాడుతున్నా మనుకుంటున్న పోలీసుల నుంచి ప్రభుత్వాలు ఆశిస్తున్నది రాజకీయ నాయకుల కార్పొరేట్ కంపెనీల ప్రయోజనాలు కాపాడడం మాత్రమే. (దేశంలో కనీవినీ ఎరుగని విధంగా చింతల్నార్ లో మావోయిస్టుల మందుపాతరకు, కాల్పులకు, గాలింపు చర్యలకు వచ్చిన సి ఆర్ పి ఎఫ్ జవాన్లు చనిపోతే అప్పటి హోమ్ మంత్రి చిదంబరం రాజీనామా నాటకమాడి వెనక్కి తీసుకున్నాడు తప్ప, కేంద్రం నుంచి ఒక్క మంత్రి రాలేదు. ఒక్క రాజకీయపార్టీ నాయకుడు కూడా రాలేదు. అదే మహేంద్రకర్మ, విసి శుక్లాల కోసం సోనియా రాహుల్‌లతో సహా

# గంటి ప్రసాదం హత్య అత్యంత కుట్రపూరితమైంది

- మాడభూషి శ్రీధర్

అనువాదం : సి.ఎస్.ఆర్. ప్రసాద్

హంతకులెప్పుడూ తమ గుర్తింపును దాచుకుంటారు. రహస్యంగా పని చేయడంలో చాలా సౌకర్యాలున్నాయి. ముసుగుల్ని తొలగించి హత్యలకు కారకులైన వ్యక్తులను గుర్తించడం పరిశోధకుల పని. గంటి ప్రసాదం హత్య దీనికి మినహాయింపు కాదు. శిక్షించడం కోసం కాకపోయినా తెలుసుకోవడం కోసమైనా అతని హంతకున్ని గుర్తించాలి. ప్రజల ప్రాణాల్ని రక్షించడం, భావ ప్రకటనా స్వేచ్ఛను కాపాడడం రాజ్యానికి ప్రాథమిక బాధ్యత. రెండూ సహజ హక్కులే. రాజ్యవ్యతిరేక రాజకీయ భావాల్ని వ్యక్తీకరించడం మరణానికి దారి తీస్తుందంటే, మనం ఒక నాగరిక సమాజంలో జీవిస్తున్నామని అనుకోకూడదు. నాగరిక సమాజంలో అమలు కావలసింది చట్టమే గాని, గుర్తు తెలియని హంతకుల రాజ్యం కాదు.

విజయనగరం జిల్లాలోని చారిత్రక బొబ్బిలి పట్టణంలో వేలాది మంది ప్రజలు తమ దుకాణాలు బందుజేసి, కార్యకలాపాల్ని పక్కకు బెట్టి గంటి ప్రసాదానికి స్మృత్యంజలి ఘటించారన్న వాస్తవం అతని ప్రజా అనుకూలతను ప్రతిబింబిస్తుంది. అమరుల బంధుమిత్రుల సంఘం ద్వారా అమరుల బంధువులకు, స్నేహితులకు సహాయం చేయడంలో అతను క్రియాశీలకంగా పాల్గొనడాన్ని బట్టి తన జీవిత చరమాంకంలో అతడు శాంతియుత పంథాలో సాగాడన్నది మనకర్థ మోతుంది. అతననుకున్నట్లుగా, అతను జీవించడానికి వీలు లేకుండా చేయడం హంతకులు జేసిన నేరం. అతడు ఇతరుల కోసం జీవించాడు. అందుకే అతడ్ని గుర్తు తెలియని వ్యక్తులు హత్య చేశారు.

అవి నీతిమయమైన పాలనను వ్యతిరేకిస్తే, గుర్తు తెలియని హంతకులు మారణాయుధాలతో హత్యలు చేస్తారన్నమాట. పట్టపగలు మారణాయుధాలు పట్టుకొని ఎవరు తిరగగలుగుతారు? అదృష్టవశాత్తు, అమెరికాలోలాగ, ఆంధ్రప్రదేశ్ పట్టణాలలో తుపాకులు ఊపుకుంటూ తిరిగే నేరస్తులు లేరు. రహస్య ఎజెండా ఉన్న నేరస్తుల వద్ద మాత్రమే తుపాకులు ఉంటాయి. రాజ్యానికి ఈ కింది బాధ్యతలున్నాయి.

ఎ. గాడ్సేనైనా, కసబ్‌నైనా చట్టం ప్రకారమే ఉరి తీయాలి.

బి. నేరస్తులుగాని, పోలీసులుగాని చంపడానికి, గాయపరచడానికి అవకాశం లేకుండా ప్రజల ప్రాణాల్ని కాపాడాలి.

సి. కరువులు, వరదలు, జవాబుదారీతనం లేనిపాలన, ఆందోళనకారులపై కాల్పులు జరపడం వంటి పద్ధతుల ద్వారా ప్రజల్ని చంపించడానికి, వాళ్ళను నిర్లక్ష్యం చేయడానికి పట్టించుకోకుండా ఉండడానికి అవకాశం కలిగించకూడదు. చివరిగా

డి. బూటకపు ఎన్‌కౌంటర్లలోగాని, గుర్తు తెలియని హంతకుల రూపంలోగాని హైకమాండ్ ఆదేశాలకనుగుణంగా గాని ప్రజల్ని హత్య చేయకూడదు.

---

ప్రధాని కూడా హుటాహుటిన వచ్చి గుండెలు బాదుకున్నారు. బిజెపి నాయకులు సరేసరి. సాల్వజుడుం ఒక దశాబ్దకాలపు సర్వ విధ్వంసక, హంతక, దహన చర్యలన్నీ ఈ రెండు పార్టీల సంయుక్త వ్యూహమనడానికి ఇంతకన్నా సాక్ష్యం ఏం కావాలి?) చత్తీస్‌గడ్‌లో ఎన్ఎండిసికి కాపలాగా వున్న పారిశ్రామిక భద్రతా బలగానికి చెందిన ఐదుగురిని మావోయిస్టులు చంపినపుడు సుప్రసిద్ధ మానవశాస్త్రవేత్త రాయబర్మన్ అదే మాట అన్నాడు. ఎన్ఎండిసి అనే జాతీయ ఖనిజ సంస్థ ప్రభుత్వ సంస్థగా 'ఎస్సార్ కంపెనీ ప్రయోజనాలను కాపాడనికి వున్నది.దానికి కాపలాగా పోలీసులు ఉన్నారు ఇవేనా? ప్రజా ప్రయోజనాల'ని అడిగాడు.

గంటి ప్రసాదం హత్య వెనుక ఇన్ని స్వార్థపర శక్తుల ప్రయోజనాలు, వాటిని కాపాడాటానికి ఏర్పడిన ప్రభుత్వాల మనుగడ, ప్రయోజనాలు ఉన్నప్పుడు హంతకులను ప్రభుత్వం అరెస్టు చేస్తుందని కాని, చేసి శిక్షిస్తుందని కాని ఎవరికీ భ్రమలు లేవు. అసలు హంతకులు ఎవరని? జారి పడిన కొబ్బరి కాయలు నరికే కత్తివలె, రాలిపడిన బులెట్ల వలె, పోలీసులు నిమిత్త మాత్రులే. గంటి ప్రసాదంను హత్య చేసింది ఈ హంతక వ్యవస్థ. ఈ హంతక వ్యవస్థను అంతం చేయకుండా గంటి ప్రసాదం వంటి నూతన మానవుడిని రూపొందించిన నక్సల్‌బరీ నూతన మానవ ఆవిష్కరణను సాధించలేము. అది నూతన ప్రజాస్వామిక విప్లవంలోనే సాధ్యమయ్యే పని.

దేశభక్తులు, ప్రజాస్వామికవాదులు, జాతి విముక్తి పోరాటాలు చేస్తున్న వాళ్లు, విప్లవ శక్తులు ఐక్యమై విశాల, దృఢతర, ఐక్య సంఘటనతో విస్తృత ప్రజాస్వామిక ఉద్యమాల నిర్మాణం చేయకుండా ఈ సామ్రాజ్యవాద, భూస్వామ్య, దళారీ నియంతృత్వాన్ని, ఫాసిస్టు, టెర్రరిస్టు ప్రభుతాల్వను అంతం చేయలేం.

గంటి ప్రసాదం హత్య బహిరంగంగా, చట్టబద్ధంగా పని చేస్తున్న ప్రజాస్వామ్యవాదులకు ఫాసిస్టు ప్రభుత్వం చేస్తున్న ఒక హెచ్చరిక . అది గంటి ప్రసాదం అనే మావోయిస్టు దగ్గర ఆగేది కాదు. సాగరహారంలో వేదిక వెనక నిలబడ్డ రాజిరెడ్డి ని టియర్‌గ్యాస్ సెల్ వదిలి ఊపిరి ఆడకుండాచేసి చంపడం దాక, ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో ప్రభుత్వం ఇదివరకే తన మనోగతం బయట పెట్టుకున్నది. కాకతీయ యునివర్సిటీ రీసెర్చ్ స్కాలర్ యాకుబ్‌రెడ్డిని 'అర్ధసత్య' సినిమాలో చూసిన దాని కన్న దారుణంగా చిత్రహింసలు పెట్టి ప్రాణావశిష్టున్ని చేయడంలో గానీ, లొంగిపోయి, తెరాసలో చేరి పొలిట్‌బ్యూరో సభ్యుడై కూడ సాంబశివుడుగా కొనసాగుతున్నందుకే కోనపురి ఐలయ్యను హత్య చేయడంలో గానీ, ప్రభుత్వం ఇప్పటికే తెలంగాణ నాయకులకు సంకేతాలు పంపనే పంపింది. ఈ హెచ్చరికను, సంకేతాలను అందుకుని ప్రజాస్వామ్యాన్ని ప్రాణపదంగా కాపాడుకునే బాధ్యత మనందరిది.



ఇలాంటి అత్యున్నతమైన బాధ్యతలు నిర్వర్తించే వాళ్ళపైన ప్రతి దశలోనూ కొన్ని ఆంక్షలు (బాధ్యతలు) ఉన్నాయి. చట్టబద్ధమైన పద్ధతిలోగాకుండా ఎవరినైనా ఉరి తీసినా, రాజ్యం ప్రాణాల్ని రక్షించలేకపోయినా, అది పట్టించుకోకపోవడం మూలంగా ఒక హత్య జరిగినా, రాజ్యమే హత్య చేసినా అంతిమంగా పాలకులయిన ప్రజలకు జవాబు చెప్పాలి.

మన రాజ్యాంగ నిర్మాతలు సహజ హక్కు అయిన ప్రాణ రక్షణ హక్కును గుర్తించారని, పేర్కొన్నారని, గ్యారంటీ చేశారని మనం గర్వంగా చెప్పుకుంటాం. ఎవరినైనా, ఎవరి ప్రాణాలనయినా చట్టబద్ధమైన పద్ధతిలోనే తీస్తామని రాజ్యం 21వ నిబంధన ద్వారా రాజ్యాంగబద్ధమైన వాగ్దానం చేసింది. చట్టబద్ధంగా రూపొందించబడిన రాజ్యాంగబద్ధమైన వాగ్దానం చేసింది. చట్టబద్ధంగా రూపొందించబడిన రాజ్యాంగానికి చిత్తశుద్ధితో లోబడి ఉంటామని, తమ రాజ్యాంగపరమైన బాధ్యతల్ని, చైతన్యవంతమైన స్పృహతో నిర్వర్తిస్తామని పాలకులు వాగ్దానం చేస్తారు. పవిత్రమైన ఈ వాగ్దానాన్ని వాళ్ళే ఉల్లంఘిస్తే దానికి ప్రత్యేకించిన ప్రతిక్రియ లేదు. తమ రాజకీయ అధికారుల్లాగానే, సాయుధులైన లేక చంపమని సాయుధులైన వ్యక్తుల్ని ఆదేశించే ఐపిఎస్ అధికారులు కూడా పోలీసు ఉద్యోగాలలో చేరేటప్పుడు ఇలాంటి ప్రమాణం చేయాలి. ఈ వాగ్దానానికి భంగకరంగా ప్రవర్తించినప్పుడు వాళ్ళను శిక్షించాలి.

ఒక వ్యక్తి న్యాయబద్ధంగా చంపబడ్డాడా లేదా అని పరిశీలించడం కోసం నాగరికమైన న్యాయ యంత్రాంగం రూపొందించబడింది. రాజ్యం పేరు మీద జరిగే ప్రతి హత్యా న్యాయ వ్యవస్థ పరిశీలనకు లోబడి ఉండాలి. రాజ్యానికి తప్ప మరెవ్వరికీ ప్రాణాల్ని హరించే అధికారం ఉండకూడదు. నిష్పక్షపాత పరిశోధన, తిరుగులేని సాక్ష్యాధారాల కారణంగా మాత్రమే రాజ్యానికైనా ప్రాణాలు తీసే అధికారముంటుంది. ఈ విధంగా న్యాయబద్ధంగా ప్రాణాలు హరించే అవకాశాన్ని కల్పించడంతోపాటు రాజ్యానికి మరొక బాధ్యత కూడా ఉంది. అదేమిటంటే ఒక శాంతియుతమైన సమాజాన్ని కల్పించే బాధ్యత. అందులో భాగంగా అది హత్యల్ని నిరోధించాలి. నేరాల్ని ప్రాసిక్యూట్ చేసే అధికారం రాజ్యానికి ఉందంటేనే, శాంతిని స్థాపించడం దాని ప్రాథమిక లక్ష్యం అని అర్థం. ప్రాణాల్ని, స్వేచ్ఛను కాపాడడం ద్వారా సుఖంగా జీవించడానికి అవసరమైన సౌకర్యాలను కల్పించడం కోసమే రాజ్యం ఉందని సామాజిక తత్వవేత్తలు, న్యాయకోవిదులు అంటున్నారు. అందుచేత ఒక హత్యను నిరోధించడంలో విఫలమైనందుకు నైతిక, చట్టపరమైన బాధ్యత రాజ్యం వహించాలి.

రాజ్యంగాని, రాజ్య తరఫున ఒక వ్యక్తిగాని-భోపాల్ గ్యాస్ లీక్, కేదార్‌నాథ్ వరదలు, జైళ్ళలో ఉన్న వ్యక్తులను హత్య చేయడంవంటి చర్యలకు పాల్పడితే అది నిర్లక్ష్యం కారణంగా ప్రాణాల్ని హరించడం అనే నేరంతో సమానం. వీటికి వ్యక్తులు కారణమయినా రాజ్యం బాధ్యత వహించాలి. ఇలాంటి హత్యలకు రాజ్యానిదే బాధ్యత అని నిర్ణయించే తీర్పులనేకం ఉన్నాయి. పౌరుడి హత్యను రాజ్యానిదే బాధ్యత అని ప్రపంచవ్యాప్తంగా న్యాయ ప్రక్రియ గుర్తించింది. 'రాజు తప్పు చేయడు' అనే సూక్తి ప్రకారం ఇప్పుడెవ్వరికీ చట్టం నుండి మినహాయింపు లేదు. చట్టబద్ధమైన న్యాయ ప్రక్రియ రాజ్యానికుండే మినహాయింపుల్ని రద్దు చేసింది. తన, తన అధీకృత వ్యక్తుల పనులకు రాజ్యం బాధ్యత వహించాల్సిందే. ఇది ప్రాథమిక న్యాయం, రాజ్యాంగబద్ధమైన న్యాయం.

న్యాయ ప్రక్రియతో సంబంధం లేకుండా రాజ్య ఏజెంట్లు హత్యలు చేయడం అత్యంత హీనమైన పని. పనికిమాలిన సినిమాలలోలాగ నడిరోడ్డు మీద బుల్లెట్లతో కాల్చడం జరగకూడదు. రక్షకుడే హంతకుడిగా మారకూడదు. రాజ్యం తరఫున ఉండే ఏజెంట్లు మారణాయుధాల్ని కలిగి ఉండడం, వాటితో చంపగలిగే అధికారాన్ని కలిగి ఉండడం చట్టబద్ధ పాలనకు పూర్తిగా వ్యతిరేకం.

ప్రజల్ని హత్య చేసే గుర్తు తెలియని హంతకుల్ని గుర్తించడానికి అవసరమయిన యంత్రాంగం లేకపోవడం ఆశ్చర్యం. ఫిర్యాదులు తీసుకోరు, తీసుకున్నా సీరియస్‌గా పట్టించుకోరు. అలాంటి ఫిర్యాదులపై విచారణ చేయడానికి ఏం చేయాలో ఎక్కడా నిర్ణయించబడలేదు. అది సాధ్యం కాదు కూడ. ఫిర్యాదుల్ని హత్య చేయడానికి కనపడని, గుర్తించలేని బలమైన యంత్రాంగం ఉందిగాని, రాజ్య హత్యలను నిరోధించడానికి మాత్రం ప్రత్యక్ష పరోక్ష యంత్రాంగమేదీ లేదు. దేశంలో మానవ హక్కుల సంఘం ఇంకా పూర్తిగా అభివృద్ధి చెందలేదు, కింది స్థాయి వరకు వ్యాపించలేదు. ఫిర్యాదును నెల్లూరు నుండి న్యూఢిల్లీకి తీసుకవెళ్ళాలి. అది అసాధ్యం. నెల్లూరులో జరిగిన హత్యను పరిశోధించడంగాని, విచారించడంగాని, న్యాయాన్యాయాలు నిర్ధారించడంగాని న్యూఢిల్లీ చేయలేదు.

రాజ్యానికి, పోలీసులకు, న్యాయ స్థానాలకు వ్యతిరేకంగా ఫిర్యాదులు తీసుకోవడానికి యంత్రాంగం ఏదీలేదు. వీటికి వ్యతిరేకంగా ఫిర్యాదులు స్వీకరించడానికి అవసరమయిన వ్యవస్థను రూపొందించని వాళ్ళ బాధ్యతాయుతమైన నడవడిక పైన మనకున్న అపారమైన విశ్వాసమే దీనికి కారణం కావచ్చు. ఇది నమ్మక ద్రోహం. రాజ్యాంగబద్ధ పాలన ధ్వంసమైంది. ఆ విధ్వంసంలో గంటి ప్రసాదం ఒక భాగమయ్యాడు.



# కామ్రేడ్ గంటి - కొన్ని జ్ఞాపకాలు

- బల్లా రవీంద్రనాథ్

ప్రసాదంగారి మీద దాడి జరిగినప్పుడు నేను ఢిల్లీలో ఉన్నాను. విషయం తెలిసిన వెంటనే హైదరాబాద్‌కు ఫ్లయిట్‌లో వచ్చేశాను. నాకు చిన్నప్పట్నించీ మా నాయనంటే భయం, గౌరవం. దూరం దూరంగానే ఉండేవాడిని. కానీ విపరీతమైన ప్రేమ. నేను లాయరుగా ప్రాక్టీసుకి వచ్చిన కొత్తలో నాయన హార్ట్ ఎటాక్‌తో మాకు దూరమై పోయినప్పుడు విపరీతమైన డిప్రెషన్‌కు లోనయ్యాను. 3 నెలలు బి.పి. ఫ్లక్చువేషన్స్‌తో సఫరయ్యి బెడ్‌రిడన్ స్టేజ్‌నుంచి కోలుకున్నా. మా నాయనలేని లోటు ఎవరూ తీర్చలేరు. కొన్ని కొన్ని సందర్భాల్లో గంటిలో మా నాయన కనిపించేవాడు. కామ్రేడ్ గంటి ప్రసాదం.. సార్.. ప్రసాదంగారు నుండి గంటిగా దగ్గరైన క్రమం అంతా కండ్లలో తనకలాడ్తాంది. మొదటగా గంటిని చూసిందెపుడు? ఆయన రిలీజ్ అయిన కొత్తలో........ ఆరోజు మావోయిస్టు నేత కామ్రేడ్ గంటి ప్రసాదం అమరుల బంధు మిత్రుల సంఘం సభల్లో వక్తగా మాట్లాడుతున్నారని తెలిసి ఎప్పుడెప్పుడు ఆయన్ని చూడాలి, ఆయన మాటలు వినాలి అని తపన పడ్డాను. నాంపల్లి కోర్టులో ముఖ్యమైన కేసు ఉంటే అది ముగించుకుని సుందరయ్య మినీహాలుకి చేరుకునే సరికి ప్రసాదంగారి ఉపన్యాసం అయిపోయింది. మనిషిని దూరాన్నుంచి చూసాను. మాట్లాడాలని ఉంది, చేయికలపాలని తపన. అయ్యో కొంచెం లేటయ్యాను. మళ్ళీ ఈయన మాటలు వినగలనో లేదో అని బాధపడ్డాను. ఎందుకంటే ఆయన మావోయిస్టు నేత కదా, తిరిగి అజ్ఞాతంలోకి వెళ్ళిపోతే జీవితంలో మరెప్పుడూ అటువంటి అవకాశం రాదు కదా అని బాధపడ్డాను.

అనుకోకుండా ఓరోజు కామ్రేడ్ పరిచయం.... ఎంత లవ్లీగా జరిగింది. ప్రెస్‌క్లబ్‌లో ఓ మీటింగ్‌కు నేను, సావి, ఇద్దరు పిల్లలం వెళ్లాము. మీటింగ్ మధ్యలో గేటు ముందర సడన్‌గా సావి, గంటి ఒకరికొకరు తారసపడ్డారు. నేను కూడా బయటే కొంచెం దూరంలో మెట్ల దగ్గరున్నాను. వాళ్ళ ఆశ్చర్యాలు, ఆనందాలు, ఆత్మీయ కరచాలనాలు తర్వాత అమ్మా సావీ, ఏడీ నీ సహచరుడెక్కడ? నాకు పరిచయం చెయ్యి. వేగిరమే అతగాడ్ని చూడాలి.. గలగలా మాట్లాడుతున్నాడు. అడుగో అంటూ నన్ను చూపించింది. ఒక్క ఉదుటున నా చేయి పట్టుకుని ఊపేస్తూ ఆహా.....ఊ....అంటూ సంతోషంతో నా పొట్టలో ఒక్క గుద్దు గుద్దాడు. అంతా బావుంది. కొంచెం పొట్ట తగ్గించు అని హాస్యమాడుతూ పిల్లలెంతమంది అంటూ ఎంతో ఆప్యాయంగా మాటలు మొదలుపెట్టాడు. మీ అడ్రస్ ఇవ్వండి. మిమ్మల్ని కలియాలి. బోల్డన్ని ఊసులు కలబోసుకోవాలి అని అన్నాడు. అడ్రస్ తీసుకుని మర్నాడు సాయంత్రం రాంనగర్ చౌరస్తాలోని మా ఇంటికి చాలా సందులు, గొందులు ఉంటాయి....అన్ని తిరిగి డైరెక్టుగా మా ఇంటిబెల్ కొట్టాడు. అక్కడ్నించి, అప్పట్నించి (మూడు ఇళ్ళు మారాము) దాదాపు ఆరేళ్లు ఆ కామ్రేడ్‌తో మా అనుబంధం. చివరికి గంటి మా కుటుంబ సభ్యుడైపోయాడు. మా స్నేహితులకు, బంధువులకు, మా రెండు కుటుంబాలవారికి, మా ఇంట్లో పనిచేసే ఆమెకు, వాచ్‌మెన్‌కు, కొందరు మా క్లయింట్లకు కూడా గంటి అప్తుడైపోయాడు. మా పిల్లలకైతే తాత. వాళ్లకు రెండువైపులా తాతలు లేరు. తాతలేని లోటు గంటి చాలావరకు తీర్చేవాడు. తాతా, తాతా అంటూ మీద ఎక్కి అల్లరిచేసేవాళ్లు. టి.వి. రిమోట్‌కోసం కొట్లాటలు, పిల్లల్లో పిల్లాడిలా చేరిపోయి కీచులాటలు, కంప్లయింటులు. పిల్లలు గుర్తొచ్చారు. వాళ్ళకి తెలుసా... నేనే తట్టుకోలేకపోతున్నా. పసివాళ్ళు వాళ్ళెలా ఉన్నారో అనుకుంటూ మళ్ళా ఫోన్ చేసా. ఈసారి సావి నన్ను వాయించేసింది. నువ్వు నిమిషానికోసారి ఫోను చేస్తుంటే నా పక్కనే పిల్లలున్నారు. వాళ్లు ఆల్‌రెడీ టి.వి. ముందు ఏడుపు ముఖాల్తో కూర్చున్నారు. నువ్వు ఎక్కువ ఫీల్‌కాకు. ఫోన్ స్విచ్ఛాఫ్ చేసెయ్యి అంది. ఫ్లైట్ ఎక్కేముందు మళ్ళా ఫోన్ చేసి శంషాబాద్ రాగానే చేస్తాను అని చెప్పాను. నేను ఇంటికి చేరేసరికి రాత్రి 11.30 అయింది. జూలై 2వ తారీఖున ఆదిలాబాద్ కోర్టులో ఆజాద్ ఎన్‌కౌంటర్ కేసుకు అటెండ్ అయిన బబిత, పద్మక్కలు ఆ కేసు విషయం మాట్లాడటానికి వచ్చి మా ఇంట్లోనే ఉన్నారు. ఇంట్లో వంట చేయలేదు. బయట నుండి తెస్తే ఎవ్వరూ సరిగ్గా తినలేదు. పిల్లలు పడుకున్నారు. జి.కె.కి ఫోను చేసాను. ఇప్పుడే ఆపరేషన్ కంప్లీట్ అయింది. అబ్జర్వేషన్‌లో ఉండాలి. మార్నింగ్ హైదరాబాద్‌కి షిఫ్టు చేయాలో లేదో ఆలోచించొచ్చు అన్నాడు. ఇంక అందరూ పడుకోండి తెల్లారి ఆలోచిద్దాం అని చెప్పి లైట్లు బంద్ చేసాను. నాకు నాలుగురోజులుగా ప్రయాణం, చాలా అలసటగా ఉంది, కానీ నిద్ర పట్టడంలేదు. అలా పడుకున్నామో లేదో జి.కె. నుండి ఫోన్ 'అంతా అయిపోయిందని'. ఎవ్వరం ఏడవటంలేదు. ఒకరికోసం ఒకరు కంట్రోల్ చేసుకుంటున్నాం. సరే! ఓ రెండు గంటలు పడుకోండి ఏం చేయాలో తెల్లారి ఆలోచిద్దాం అన్నాను. ఉదయం 5.00 గంటలకే ఇతర ప్రజాసంఘాల వారు వచ్చారు. పోస్టుమార్టం 10 గంటలకు మొదలౌతాది. నెల్లూరు నుండి మధ్యాహ్నం ఒంటిగంటకు వాళ్ళు బాడీతో బొబ్బిలి బయలు దేరితే మనం ఇక్కడ నుండే డైరెక్టు బొబ్బిలి వెళ్దాం అని అనుకున్నాం. అప్పటిదాకా గంటి, గంటి అని మాట్లాడుకుంటూ, ఇప్పుడు 'బాడీ' అంటుంటే గుండె బరువెక్కి పోయింది. 5వ తేదీ ఉదయం కోర్టుకు వెళ్ళేముందు వి.వి.దగ్గరకు వెళ్లాను. ఆయన్ను చూడగానే ఒక్కసారిగా అణచిపెట్టుకున్న దుఃఖం పొంగుకొచ్చింది. పట్టుకుని భోరున ఏడ్చాను. ఆయనా అంతే గడ్డకట్టిన కన్నీళ్లన్నీ కరిగిపోతున్నాయి. హేమక్క మందలిస్తోంది. మగవాళ్లు మీరే ఇలాచేస్తే ఎలా? పనులెవరు చూస్తారు. చేయాల్సింది ఆలోచించండి. రవీ! ఊరుకో. చూడు నేను, సావి ధైర్యంగా లేమా....ఆమె కంఠంకూడా రుద్ధమయింది.

సాయంత్రం 3.30కి బస్సు బయలుదేరుతుంది. మొత్తం 50 మందిమి. అందరు చేరుకున్నారు నేను, సావి తప్పించి. ఒకటే ఫోన్లు ఏంటి లేటు అంటూ. పిల్లలు స్కూలు నుండి రాలేదు. మా అమ్మను జనగాం నుండి పిలిపించి ఆమెకు వాళ్ళను అప్పగించి బయలుదేరాం. బస్సు టోల్‌గేటు దగ్గర ఆగింది. జై తెలంగాణ అంటూ నినాదాలు చేస్తూ టోల్‌ఫీజు కట్టలేదు. దారిపొడుగునా అంతే. బస్సులో పి.కె.ఎమ్.కోటి గంటిమీద పాట పాడుతున్నాడు.

జూలై 2న నేను ఎ.పి. ఎక్స్‌ప్రెస్‌లో ఉండగా గంటి నుండి ఫోన్ 'రవీ ఎక్కడున్నావు. ఇంటికొస్తున్నా. నీతో అర్జంటుగా మాట్లాడాలి'. 'సార్ నేను అవుటాఫ్ స్టేషన్ 3, 4 రోజుల్లో వస్తాను. ఇంటి కెళ్లండి. సావి ఉన్నాది' అన్నాను. 'సరే సరే నేను రేపు నెల్లూరు వెళ్తున్నాను వచ్చాక కలుద్దాం'. 'నెల్లూరు వెళ్తున్నారా? అయితే ఒక్కపని చేయండి సార్. ఎల్.ఎస్.ఎన్.మూర్తికేసు విషయం బ్రహ్మంతో మాట్లాడండి' అన్నాను. 'మాబాగా గుర్తుచేసావ్ ఈసారి తేల్చేస్తాను. ఆ కేసు విషయం నాకొదిలేసేయ్ నేను చూసుకుంటాను కదా' అన్నాడు. ఆయన నెల్లూరు నుండి, నేను ఢిల్లీ నుండి వచ్చేసాక ఇద్దరం కలిసి ఒంగోలు సాగర్ దగ్గరకు వెళ్ళాలనుకున్నాం. ఆయనతో మాట్లాడిన చివరి సంభాషణ అదే.

గత 5 సంవత్సరాలుగా సి.ఆర్.పి.పి. ఏర్పడినప్పటి నుంచీ గంటితో మా అనుబంధం రాజకీయంగా అభివృద్ధి చెందింది. మొదట్లో సి.ఆర్.పి.పి. ఎందుకు, డిఫెన్సు కమిటీ చాలు అనే వాదన నుండి రాజకీయ ఖైదీల విడుదలకు సి.ఆర్.పి.పి. ఖచ్చితమైన చారిత్రక అవసరం అనే అంగీకారానికి మనస్ఫూర్తిగా వచ్చి చివరి వరకు అదే కొనసాగించాడు. బహుశా బ్రహ్మంతో ఎల్.ఎస్.ఎన్.మూర్తి కేసు గురించి మాట్లాడే ఉండొచ్చు. ప్రోగ్రామ్స్ చేసినపుడు కొన్నిసార్లు కరపత్రాలు రాసేవాడు. సార్ మీ భాష ఘోరంగా ఉంది. ఆ గ్రాంథికం ఎవరు చదువుతారు అంటే భావం చెడిపోకుండా మార్చుకోవోయ్ అనేవాడు. కొన్నిచోట్ల ఎంతమొత్తుకున్నా కాంప్రమైజ్ కాడు. ఇది ఇలానే ఉండాలి అని పట్టు పట్టుపట్టేవాడు. ముసలాయనకి చాదస్తం అని విసుక్కుంటే చాదస్తం అను ఒప్పుకుంటా, ముసలాడు ఎవరు? అంటూ ఫైర్. అందరం నవ్వుకునేవాళ్లం.

ఎక్కడికైనా ప్రోగ్రాంకో, ఎవరినైనా కలవటానికో వెళ్తుంటే టకటకా రెడీ అయ్యేవాడు. హెన్నా పెట్టిన ఎర్రటి జుట్టుతో, గళ్ళ షర్టు, జీన్స్ ప్యాంట్ టక్ చేసుకుని రెండు జేబుల్లో చేతులు పెట్టుకుని ఓ వంక ఓరగా చూస్తూ కొంచెం వంగి స్టైలిష్‌గా నిలబడి 'ఊ..ఇప్పుడు చెప్పు ఎలా ఉంది' అని పిల్లాడిలా అడిగేవాడు. అబ్బో 'ముసలాయనకి షోకులెక్కువైతున్నాయి' అనేవాడ్ని ఉడికించటానికి. అమ్మో సావీ, చాలా డేమేజింగ్‌గా మాట్లాడుతున్నాడంటూ కంప్లైంట్. 'తాతా నువ్వు సూపరున్నావు' అనేవాడు మా అబ్బాయి. అరేయ్ దుండగుడా థాంక్స్‌రా అని మురిసిపోయేవాడు. అనుకున్న టైం కంటే అరగంట ముందే రెడీ అయి కూర్చొని మనల్ని తొందరపెడ్తూ నిప్పుల మీద కూర్చున్నట్లు ముఖం పెట్టేవాడు.

జూన్ 30న కలిసినప్పుడు 'మనం చత్తీస్‌గడ్ పద్మ దగ్గరకు వెళ్దాం' అన్నాడు. 'అసలేం అనుకుంటున్నావు. చత్తీస్‌గడ్ అంటే మాలాంటి వాళ్ళమే వెళ్ళాలంటే ఆలోచిస్తాం. మీరెలా వస్తారు. అక్కడికి వెళ్తే కొట్టిచంపుతారు' అంటూ కొంచెం కోప్పడ్డాను. హహహ... అంటూ నవ్వేస్తూ కొట్టి చంపేవాడికి చత్తీస్‌గడ్ అయితే ఏంటీ? చాదర్‌ఘాట్ అయితే ఏంటీ? నేను రెడీ. మనం వెళ్దాం అంటూ నవ్వుకుంటూ మాట్లాడుతూనే ఉన్నాడు. మనం లీగల్ వర్క్ చేస్తున్నాం. నువ్వు అడ్వకేట్‌వి. నాది ఒక ప్రయోగం చూద్దాం అన్నాడు సింపుల్‌గా.

తెలంగాణ, వైరుధ్యాలు, కుల సమస్య, ఆపరేషన్ గ్రీన్‌హంట్, ప్రజా సంఘాల పరిస్థితులు, కేసులు, కోర్టులు ఇలా ఎన్నో సమస్యల మీద రోజుల తరబడి ఎన్నో చర్చలు. కుల సమస్య మీద మాట్లాడుతూ అసలందరూ ఇలా ఎందుకు కూరుకుపోతున్నారో అని ఆవేదన చెందేవాడు. ఏదేమైనా మీమీద 'బాపన పక్షపాతి' అని విమర్శ ఉంది కదా అంటే. అనేవాళ్ళకేం తెలుసు వాళ్ళతో నేను చేసే పోరాటం అనేవాడు. మాలాంటి కుటుంబాలు, ఆత్మీయులు ఎందరో ఉండొచ్చు. కానీ నా తండ్రి వయసాయన ఎంతో స్నేహంగా కొట్టుకుంటూ, ఛలోక్తులు వేస్తూ సరదాగా ఉండటమే కాకుండా తను మదనపడే ఎన్నో విషయాలు, మనసులోని మాటలు పంచుకునేవాడు. ఒక్కోసారి నాకనిపించేది ఇంత పెద్దాయన ఇన్ని విషయాలు నాతో పంచుకుకోవడం ఏంటా అని.

ఇంత మొండి మనిషికి ఓ రెండు బలహీనతలున్నాయి. 1. నశ్యం. 2. సిగరెట్. మొదటిసారి మా ఇంటికి వచ్చినప్పుడు ఓ చిన్న నశ్యం డబ్బాలో పొడిని పట్టిస్తుంటే చూసి ఏంటిసార్ అది అని అన్నాను. ఇదా నశ్యం. అస్సలు బాలేదు. మంచిది దొరకలేదు అయినా అయిపోతోందిలే అంటూ చెప్పుకుపోతున్నాడు. సాయంత్రం కూరగాయలకు వెళ్ళి వచ్చేటప్పుడు పెద్ద డబ్బా తెచ్చాను. అది వాసన చూసి ముక్కునిండా దట్టించాక అబ్బా రవీ! అద్భుతం. ఇది చాలా బాగుంది. అది మొదలు మొన్న నెల్లూరు వెళ్లేంతవరకు గత ఐదారేళ్ళుగా గంటికి నశ్యం నేనే తెచ్చేవాడ్ని. జూన్ 30న కల్సినప్పుడు రవీ! ఆ షాపు నాకు చూపించు అన్నాడు. ఏం ఎందుకు, సరిపోవడం లేదా అన్నాను. అబ్బబ్బే నీకు పనులుంటాయి, అవుటాఫ్ స్టేషనుంటావు, అడ్రస్ కనుక్కుంటే మంచిది కదా అన్నాడు. ముసలాయన డోసుపెంచి డబ్బా త్వరగా ఊదేస్తున్నట్టున్నాడు అనుకుంటూనే షాపు అడ్రస్ చెప్పాను. ఆ షాపులో ఇంక నశ్యం కొనాల్సిన అవసరం లేదు.

రెండో బలహీనత సిగరెట్. సిగరెట్ అంటే రోజంతా అనుకునేరు. ఉదయాన్నే సిగరెట్ తాగకపోతే ఆయనకు లెట్రిన్‌రాదు. జైల్లోంచే సిస్టమ్ అలా అలవాటు చేసుకున్నాడు. ఎంత రాత్రయినా ఇంటికి వచ్చేటప్పుడు కూడా తెచ్చుకుంటాడు. లేదంటే నాకు ఫోన్ చేసి రిక్వెస్టింగ్‌గా అడిగేవాడు. ఈయన పోయొచ్చిన తర్వాత ఉదయాన్నే పనమ్మాయి గోల. తలుపు ఎందుకు పెడతారు సార్ కంపు బయటకు పోదు అని. టి.విలో దాడి, హత్య దృశ్యాలు చూసి ఆమె కూడా ఎంతోగానో ఏడ్చింది. అంత మెత్తని మనిషి, పసిపిల్లాడిలాంటోడు సార్, ఆయన్నెట్లా చంపేశారు అన్యాయంగా అని బాధపడింది.

ఇంట్లో నాకు, సావీకి మధ్య ఇంటిపనికి సంబంధించిన పోట్లాటలు వస్తే ఎప్పుడూ ఆమె పక్షమే. నాపై ఒంటికాలిమీద లేసేవాడు. ఎంతపని చేస్తాది అంటూ. సార్ 'దయచేసి పోపుగింజలు వేయకండి' అనేవాడిని. ఏ ఇంట్లోనైనా ఆయన స్త్రీ పక్షపాతే. ఇంటిపని పంచుకునేవాడు. మేం ముగ్గురం కలిసి తిరిగి ఇంటికి వచ్చాక టీ

పెట్టు అనేవాడ్ని. వెంటనే గయ్‌మని నామీద లేసేవాడు. నువ్వు చెయ్యి, లేకపోతే నేను చేస్తాను. టీ కూడా తనే పెట్టియ్యాలా అంటూ స్టవ్ వెలిగించేవాడు. అటువంటప్పుడు నేనే ముసలాడిని అనిపించేది.

ఆజాద్ సహచరి పద్మ తదితరుల అరెస్టు సందర్భంలో వరంగల్ పోలీసులు ఇతర ప్రజాసంఘాల నాయకులతోపాటు గంటి మీదకూడా కేసు పెట్టారు. వాళ్లంతా హైకోర్టులో క్వాష్ పిటిషన్ వేసి తనను పిటిషనర్‌గా చేర్చకుండా వేరు చేయడాన్ని తట్టుకోలేకపోయాడు. ఏంది రవీ! ఎందుకు మరి నన్నీవిధంగా ప్రత్యేకంగా చూస్తారు అంటూ బాధపడ్డాడు. ఆ కేసులో ఖచ్చితంగా ఆర్డర్‌రాదు సార్, మీకెందుకు క్వాష్ పిటిషన్? మనం బయట ఉద్యమాలు చేసి ఆపాలికదా అంటే 'అవును మరి కనీసం ప్రొటెస్ట్ చేయకుండా, విషయాన్ని ఎక్స్‌పోజ్ చేయకుండా కోర్టుల చుట్టూ తిరగడం ఎందుకు? అది తర్వాత స్టెప్. నాకేం భయంలేదు. నేనెప్పుడైనా అరెస్టుకు భయపడతానా! మన ప్రజాసంఘాల వాళ్ళ మైండ్ సెట్ మారాలి' అని అంటుండేవారు.

వరంగల్ గ్రీన్‌హంట్ సమావేశానికి వెళ్ళడానికి ముందురోజు ఇంటికి వస్తే 'రేపు ఎలా వెళుతున్నారు' అన్నాను. 'ఏం నీవు రావేటి' అన్నాడు. నేనెందుకు వెళ్ళను అన్నాను. 'మరి నేను రేపు వరంగల్‌కు రావటం నీతోటే, భయపడుతున్నావా' అంటూ ఎదురు ప్రశ్న. భయమెందుకు సార్ పోదాం పదండి అని ఇద్దరం కలసి వరంగల్ మీటింగ్‌కు వెళ్ళాం. చివరిదాకా కూడా అదే తెంపు, చొరవ, మనో నిబ్బరం.

తను ఏది వాసినా డాక్యుమెంట్‌గానీ, రిప్లై గానీ, కరపత్రంగానీ, వ్యాసంగానీ ఎదురుగా కూర్చోబెట్టుకుని చదివి వినిపించేవాడు. ఆయన కళ్ళతో, ముక్కుతో, కనుబొమ్మలతో, విరుపులతో, వివిధ భంగిమలతో భావ ప్రకటన చేసే తీరు భలే ముచ్చటగా ఉంటుంది. ఆయన బాగా ముచ్చటపడి చదివిందానికి కొర్రిలు పెడితే చిటపటలేంటి సెంట్రలైజ్డ్ డెమొక్రసీనే. వరంగల్‌లో సి.ఆర్.పి.పి.మీటింగ్ పెట్టాలని అనుకున్నాం. గంటి చాలా ఆనందపడిపోయాడు. పోరాటవారం మొదటిరోజు వరంగల్‌లో, తర్వాత వైజాగ్, ఒంగోలు, హైదరాబాద్, భద్రాచలం అనుకున్నాం. 'మీరు ఏ ఊర్లో వక్తగా పాల్గొంటారు' అని సావి అడిగితే 'నా పేరేం అక్కర్లేదు. స్పీకర్లు చాలామంది ఉన్నారు కదా' అన్నాడు. వైజాగ్, ఒంగోలులో మీరు మాట్లాడితే బాగుంటుంది అంటే సరే అన్నాడు. పాంప్లెట్స్ ప్రింట్ అయ్యాక వరంగల్‌లో నా పేరెందుకు వేయలేదు అంటూ సావీ మీద ఫైటింగ్. 'మీరే వద్దన్నారు కదా'. 'నేనెందుకన్నాను. వరంగల్‌లో మాట్లాడాలి అది నా స్వప్నం' అంటూ గొణుగుతున్నాడు. పెద్దాయన మర్చిపోయుంటాడు అనుకుంటూ మీ ఇష్టమొచ్చినంతసేపు మాట్లాడండి, మిమ్మల్ని కాదనేది ఎవరు? పేరు లేకుంటే ఏం సార్ అన్నాను. వరంగల్ సి.ఆర్.పి.పి. సభ విజయవంతం అవడం చూసి ఎంత ఆనందపడ్డాడో. ఆ రోజు సభలో 'బందీకాని గొంతుక' రెండో సంచిక చూసి, కవర్‌పేజి చూసి సావీని ఎంతలా అభినందించాడో కళ్ళముందు కనబడుతోంది. సి.ఆర్.పి.పి. సభ విజయోత్సాహమే ఈ రోజు ఈ పరిస్థితికి కారణమా? బుర్ర నిండా ప్రశ్నల సుడులు.

పువ్వర్తి ఎన్‌కౌంటర్‌లో 7 గురు వరంగల్ వాసులు మృతి చెందారు. 'రవీ! మీ సి.ఆర్.పి.పి. సభలాగానే పువ్వర్తి అమరవీరుల సంస్మరణసభ వరంగల్‌లో పెడదామనుంది' అన్నాడు. ఎ.బి.ఎం.ఎస్ మొత్తం కేడర్ కష్టపడ్డారు. కరపత్రం రాసాడు. షరామామూలే. తెల్లారే ఆరు గంటలకు బెల్ కొట్టాడు. నిద్రమత్తుతోనే తలుపు తీసాను. మీరిద్దరూ కూర్చోండి కరపత్రం చదువుతాను అన్నాడు. 'సార్! ఇప్పుడు మమ్మల్ని వాయగొట్టకండి, పిల్లల్ని స్కూలుకి పంపాలి'. 'సరే, కాఫీ తాగి కూర్చుందాం' అంటూ సిగరెట్ పట్టుకుని బాత్రూమ్‌లో దూరాడు. పిల్లల్ని దించేసి వచ్చి కాఫీ కలిపాను. గంటికి నేను కలిపే కాఫీ అంటే చాలా ఇష్టం. సావీ కలిపితే ఫరవాలేదంటాడు. వాళ్ళమ్మ కలిపితే అయ్యబాబోయ్ పంచదార ఎక్కువేసేస్తాది అంటాడు. కాఫీ చప్పరిస్తూనే చదవటం మొదలెట్టాడు. బ్రహ్మాండంగా ఉంది, అద్భుతంగా ఉంది అంటూ సావి పొగిడేస్తోంది. జనరల్‌గా ఎక్కువ కొర్రిలు పెట్టేది తనే. కానీ ఈసారి కరపత్రం నిజంగా చాలా బాగా అనిపించింది మాకు. రవీ! మీకు ఏమైనా అభ్యంతరాలున్నాయా అన్నాడు. ఏం లేదు సార్ 'టి.ఆర్.ఎస్. లాంటి పార్టీని మెడలో తెలంగాణ మూర్ఛబిళ్ళ తగిలించుకున్న పార్టీలు' అనడం నిజంగా అద్భుతమైన పోలిక, కరెక్టుగా, సూటిగా వుంది అన్నాను. నిజంగానా, వి.వి.సారు ఈ పదం కొంచెం ఆలోచించండి అన్నారు. ఉన్న మాటను సూటిగా, స్పష్టంగా చెప్తున్నారు. మనం కూడా అనకపోతే ఎట్లసార్, ఉంచేయండి అన్నాను. రైట్, ప్రింటింగ్‌కు ఇచ్చేద్దాం వెళ్దాం పద అన్నాడు. సభ ఊహించినదానికన్నా బాగా జరిగిందట. మేమిద్దరం వెళ్ళలేకపోయాం. మీరు వచ్చిఉంటే ఎంత సంతోషపడేవాళ్ళో అని ఫోన్ చేశాడు. జిల్లా స్థాయిలో గ్రామాల్లో క్యాంపెయిన్‌లు చేసి సభలు నిర్వహించడం ఈ ప్రజాస్వామ్య దేశ పాలకులకు కంటగింపయింది. సరిగ్గా ఇదే వాళ్ళకు నచ్చలేదు. ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగంగా జరుగుతున్న హత్యాకాండ, దోపిడి, దుర్మార్గం చూపిస్తే ఆ మట్టికాళ్ళ మహారాక్షసి జూలు విదిలించింది. పంజా విసిరింది. తల్వార్‌లు, తుపాకులతో మిట్ట మధ్యాహ్నం నడిరోడ్డుమీద విజృంభించారు. ప్రజాసంఘాలకు ఓ హెచ్చరిక చేయాలనుకున్నారు. మీరు పనులు మొదలుపెట్టి గ్రామాల్లోకి వస్తే ఇలానే జరుగుద్ది అని చెప్పాలనుకున్నారు. తుమ్మితే ఊడిపోయే ముక్కులాంటి వాళ్ళను, పట్టుకుంటే పుటుక్కుమనే సన్నని దారపు తీగలన్నింటిని కలసి పగ్గం పేనుతున్నాడు గంటి. అది రాజ్యానికి ఎరుకే.

బొబ్బిలి దగ్గరౌతోంది. బస్సు కేబిన్‌లో కూర్చున్నా. మధ్యాహ్నం 11.30 అయింది. బొబ్బిలి అంతా బంద్. ఎర్రటి ఎండ, విపరీతమైన జనప్రవాహం. ఫ్రీజర్‌బాక్స్‌లో గంటి. కాదు కాదు గంటి బాడి. మా ఇంట్లో గుర్రుపెట్టి పడుకున్నప్పటిలానే ఉన్నాడు. భోజనాలకు పులిహోర ఏర్పాటు చేశారు. దేశం మొత్తం పులిహోరకు ఒకటే ఫార్ములా అనేవాడు గంటి. గంటి ఊర్లో ఆయన ప్రేమించిన, ఆయన్ను ప్రేమించిన మనుషులు చేసిన పులిహోర ఎంతో ప్రేమతో, ఆబగా తిన్నాను. గంటి మాటల్లో చెప్పుకుంటే 'బేషుగ్గా ఉంది'. తర్వాత 3 గంటలపాటు అంతిమయాత్ర. ఉద్యమ ప్రాంతాలయిన నార్త్ తెలంగాణలో పల్లెలకు పల్లెలు కదలడం వేరు, ఉత్తరాంధ్రలో ఇలా వేలాదిగా, వివిధ రాష్ట్రాలనుండి కదలి రావటం చూస్తే నాకనిపించింది, ఇన్నాళ్ళూ గంటిని ఆడిపోసుకున్న వాళ్లకు, ఆయన మీద దాడి జరిగిందంటే తేలిగ్గా మాట్లాడిన వాళ్ళకు ఆ అశేష ప్రజావాహినే జవాబని.



# గంటి ప్రసాదంకు జోహార్లు

- బి.ఎస్

నిజమైన కమ్యూనిస్టుకు నిర్వచనం చెప్పాలంటే గంటి ప్రసాదంను ఆదర్శంగా చూపాలి.

నిస్వార్థపరుడు, నిజాయితీపరుడు, తనుఎంచుకొనే మార్గాన్ని గొప్ప ధైర్యంగా సమాజంలోని, ఉద్యమంలోని వారుకు మార్గదర్శిగా నిలిచినారు.

నేను మొదటిసారిగా 1972లో దేవులపల్లి వెంకటేశ్వర రావు, తరిమెల నాగిరెడ్డి కోర్టు స్టేట్‌మెంట్ బుక్‌ను శ్రీకాకుళం నుండి గంటి రమణకు అందజేయడానికి బొబ్బిలి వెళ్ళాను. అప్పుడు రమణ ఇంట్లో ప్రసాదంను కలిశాను. అప్పుడు ఆయన ప్రత్యేకాంధ్ర ఉద్యమంలో ముఖ్యనాయకుడుగా ఉండేవారు. అప్పటికే మేము కూడా ప్రత్యేకాంధ్ర ఉద్యమంలో ఉన్నాం. శ్రీకాకుళంలో తెన్నేటి విశ్వనాథం, గౌతు లచ్చన్న నాయకత్వంలో జై ఆంధ్ర ఉద్యమంలో పసుపు జండా ఎగురవేసినారు. మేము తీవ్రంగా దీన్ని వ్యతిరేకిస్తూ చనిపోయిన విద్యార్థుల శరీరం నుండి ఎర్రని రక్తం ప్రవహించింది గాని పసుపురంగు గాదని నిరశిస్తూ "ఎర్రజెండా" కావాలని డిమాండ్ చేశాము.

అనేక వేల మంది విద్యార్థులపై జై ఆంధ్ర ఉద్యమంలో కేసులు పెట్టారు. ఆ కేసులన్ని ఎత్తివేయాలని గంటి ప్రసాదం నాయకత్వంలో గవర్నరు సలహాదారు 'హరీన్'ను గంటి ప్రసాదం అనేక మంది విద్యార్థులను తీసుకెళ్ళి మాపైనున్న కేసులన్నీ ఎత్తివేయాలని డిమాండ్ చేశారు. దానికి ఆయన స్పందించి ఉద్యమంలో ఉన్న వారందరి పైన ఉన్న కేసులన్ని బేషరతుగా ఎత్తివేశారు. దానికి ముఖ్య నాయకుడు, కారకుడు మన ప్రసాదం.

1972లో ప్రసాదం మా స్వగ్రామమైన కణుగుల వలస వచ్చారు. ఆయనతో కలిసి ఎ.ఎస్ గారిని కలిసినాను. అప్పుడు ఎ.ఎస్ గారు గంటి వంటి మహా మేధావిని కలిసినందుకు ఎంతో సంతోషించారు. శ్రీకాకుళం, విజయనగరం ఉమ్మడి జిల్లాల్లో గల మన అనేక ప్రజాసంఘాలు, యువజన సంఘాలు, విద్యా సంఘాలు, రైతు సంఘాలను నేను, ప్రసాదం ప్రతి గ్రామంలోను కలిసి చాలా ఆనందాన్ని, ఉత్తేజాన్ని పొందాం. మేమిద్దరం కలసి గ్రామాలు పర్యటించినపుడు దారిలో మిత్రులు, శ్రేయోభిలాషులు. దజ్జన కొద్ది అరటిపండ్లు, ఇడ్లీలు ఇచ్చేవారు. ఇన్ని మనకెందుకని గంటి అనేవారు. నువ్వెన్ని తింటావో తినమని నేను అనేవాడిని. అతను రెండు చొప్పున తింటే మిగిలినవి నేనే తినేసేవాడిని.

నేను, అతను కలిసి మొదట విప్లవ ఉద్యమం వైపు అడుగులు వేసినాము. గాని నా కుటుంబ పరిస్థితుల వలన, అనివార్య కారణాల వలన నేను ఉద్యమబాట వదలి ఉద్యోగ బాట పట్టాను. గాని నా మిత్రుడు నా సహచరుడు అయిన గంటి ప్రసాదం చివర వరకు విప్లవబాటలోనే నడుస్తూ, మిగిలిన వారికి మార్గదర్శిగా నిలుస్తూ ఆ విప్లవం కొరకు తన ప్రాణాన్ని సైతం అర్పించి అమరుడైనాడు.

నాకు, నా కుటుంబ సభ్యులకు, మా గ్రామ ప్రజలకు ప్రసాదం అంటే చాలా అభిమానం. ఎప్పుడు మా గ్రామం వచ్చిన మా అమ్మ భోజనం వడ్డించేది. మా నాన్నగారు పంతులుగారు వచ్చారు బాగా చూసుకోమని చెప్పేవారు. నా భార్యకు సొంత అన్నయ్య కంటే ఎక్కువ. నా పిల్లలు మామయ్య అంటూ అభిమానించేవారు.

మేము ప్రొగ్రెసివ్ స్టూడెంట్స్ యూనియన్ (పిఎస్‌యు) స్థాపించాము. మాకు విశాఖ నుండి సి.వి. సుబ్బారావు, గంటి రమణ, ఇతరులతో కలసి శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నంలకు విస్తరించాము. ఆయన స్వంతంగా ప్రగతిశీల కార్మిక సంఘాన్ని గూడా స్థాపించి బొబ్బిలి కళాసి సంఘం, జూట్, షుగర్ కార్మికులను ప్రగతిశీల కార్మిక సంఘంలోకి తీసుకువచ్చినారు.

ఎ.ఎస్ గారికి సిపిఐ (ఎం.ఎల్) పార్టీలో ఉంటూ సిఒసిలో బెంగాల్, బీహార్, జార్ఖండ్, చత్తీస్‌గడ్, ఒరిస్సా, మహారాష్ట్ర, పంజాబ్ లోని అనేక మందితో మంచి స్నేహితునిగా ఉంటూ, సి.ఒ.సి సెంట్రల్ కమిటీ మెంబర్‌గా ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘునకు, శ్రీకాకుళం నుండి పసుమర్తి రామారావు ప్రెసిడెంటుగా, అప్పయ్య దొర, జె.ఎన్. పట్నాయక్, గంటి ప్రసాదం, డి.కె లు కలిసి శ్రీకాకుళం కమిటీ ఉండేది. దానికి ముఖ్య నాయకుడు మన ప్రసాదం. విరసంలో కూడా ఆయన చురుకైన పాత్ర పోషించేవారు. ఆ తరువాత ఒకసారి ఐ.వి. సాంబశివరావు శ్రీకాకుళం వచ్చినపుడు ఎ.ఎస్‌ను కలిసేటప్పుడు అక్కడ గంటి మేమందరం మీటింగ్ పెట్టినాము. దానికి నాయకుడు మన గంటి.

1975లో కోమర్తిలో జన నాట్యమండలి ప్రోగ్రామ్ ఇచ్చింది. అప్పుడు పోలీస్‌లు అక్కడికి వచ్చారు. గ్రామ ప్రజలు పోలీసులపై తిరుగుబాటు చేశారు. నేను ప్రసాదం మరొక ఇద్దరం కమిటీ మెంబర్స్‌గా ఉండేవారం. అప్పుడు ఎ.ఎస్ గారు మమ్మల్ని కలవమని కబురు పంపినారు. గానీ మేము వెళ్ళేసరికి అక్కడ ఆయన లేరు. మన ప్రజలను పోలీసులు నరసన్నపేట పోలీస్ స్టేషన్‌కు తీసుకువెళ్ళినారు. అందువల్ల మనం వెళ్దామని గంటి అంటే నేను రానని స్పష్టంగా చెప్పినాను. అప్పుడు అక్కడ అసలు నాయకుడు వచ్చినాడని పోలీసులు గంటిని అరెస్టు చేసి తీవ్రంగా కొట్టారు.

శ్రీకాకుళం సాయుధ రైతాంగం పోరాటంను నడిపించిన వారిలో ఎ.ఎస్.గారు ప్రముఖులు. ఆయనతో ఉంటూ, ఆయన నాయకత్వంలో పనిచేస్తూ గంటి ప్రసాదం వంటి గొప్ప వ్యక్తి రాష్ట్రానికి కాకుండా జిల్లాకే కొన్నాళ్ళు పరిమితమై తదుపరి పీపుల్స్‌వార్‌లో కలసిన తరువాత గంటి ప్రసాదంకు మంచి గుర్తింపు లభించింది. ఆయన విప్లవోద్యమంనకు నాయకత్వం వహిస్తూ, పేదవర్గానికి న్యాయం చేయాలని తను నమ్ముకున్న సిద్ధాంతానికి కట్టుబడిన మహానుభావుడు.

1972లో మొట్టమొదటిసారిగా బొబ్బిలిలో కలసినాను. అతి బాధాకరమైన విషయం ఏమిటంటే 2013 జూలై 6న అదే బొబ్బిలిలో ఆయన అంతిమయాత్రలో పాల్గొన్నాను.



# గంటి ప్రసాదం హత్య ప్రభుత్వం చేసిన హత్యే!

- పి. జయ

జులై 4, 2013 మధ్యాహ్నం రెండు గంటల సమయంలో నెల్లూరు పట్టణ నడిబొడ్డున గంటి ప్రసాదంపై దాడి జరిగింది. ముగ్గురు వ్యక్తులు వచ్చి పక్కనే ఉన్న కొబ్బరి బోండాలు కొట్టే కత్తితో ఒకడు ప్రసాదం మెడపై నరికితే, మరొకడు తమతో తెచ్చుకున్న తుపాకీతో మూడు రౌండ్ల కాల్పులు జరిపి యథేచ్ఛగా వెళ్ళిపోయారు. ప్రసాదం వెంట అమరుల బంధుమిత్రుల సంఘం (ఎ.బి.ఎం.ఎస్) రాష్ట్ర అధ్యక్షురాలు అంజమ్మ, సభ్యుడు నర్సన్న ఉండడంతో పక్కనే ఉన్న నెల్లూరు ఆసుపత్రిలో చేర్పించారు. ఆసుపత్రి సిబ్బంది కూడా వెంటనే స్పందించి మెడపై కుట్లు వేసి, శరీరం నుండి ఒక బుల్లెట్‌ను తీసి రక్తం కూడా ఎక్కించారు. అయినప్పటికీ ప్రసాదం పరిస్థితి సీరియస్‌గా ఉండడంతో అంతకన్నా మెరుగైన 'నారాయణ ఆసుపత్రి'కి తరలించారు. నెల్లూరు ఆసుపత్రిలో ప్రథమ చికిత్స చేస్తున్నంతసేపు ప్రసాదం స్పృహలో ఉన్నాడని, తనను బతికించాలని, బతుకుతాననే నమ్మకం ఉందని తన ఆశయాన్ని కూడా చాలా దృఢ విశ్వాసంతో చెప్పినట్టు డా. విజయ్‌కుమార్‌గారు వివరించారు. నిజానికి ప్రసాదంపై జరిగిన దాడి వెంటనే చనిపోయేంత పెద్దదాడి. అయినప్పటికీ 64 సంవత్సరాల వయస్సులో కూడా 12, 13 గంటలు మృత్యువుతో పోరాడాడంటే ప్రసాదం శారీరకంగానే కాక మానసికంగా కూడా ధైర్యంగా, దృఢంగా ఉన్నాడని అర్థమవుతుంది.

ప్రసాదం అమరుల బంధుమిత్రుల సంఘం గౌరవాధ్యక్షులుగా, రెవెల్యూషనరీ డెమోక్రటిక్ ఫ్రంట్ (ఆర్‌డిఎఫ్) జాతీయ ఉపాధ్యక్షులుగా కొనసాగుతున్నాడు. జులై 4, 2013 ఉదయం విరసం ఆవిర్భావ సభలో మాట్లాడి, నెల్లూరు ఆసుపత్రిలో ఉన్న ఎబిఎంఎస్ సంబంధీకురాలిని పరామర్శించి, ఎబిఎంఎస్ నిర్వహించే సభలో మాట్లాడడానికి వెళ్తుండగా ఆసుపత్రి ఆవరణ దాటకముందే ప్రసాదంపై దాడి జరిగింది. ప్రసాదం పనిచేసే ఎబిఎంఎస్ కానీ, ఆర్‌డిఎఫ్‌కానీ పాలక వర్గాలలాగ ప్రజలను దోచుకొని వ్యక్తిగత ఆస్తులు కూడబెట్టుకునేవి కావు. ఆ సంస్థలు మానవీయమైనవి, ప్రజలకు బాధ్యత పడేవని ప్రభుత్వాలకే బాగా తెలుసు. నక్సలైట్లు బూటకపు ఎన్‌కౌంటర్లలో మరణించినప్పుడు వారి శవాలను కూడా కుటుంబాలకు ఇవ్వకుండా ప్రభుత్వం, పోలీసులు వేధించేవారు. అంతేకాక కుళ్ళిపోయేలా ఉంచి వారి శవాలపై కూడా కక్ష తీర్చుకునేవారు. ప్రజాస్వామికవాదులు, హక్కుల సంఘాలు ఎంతో రిస్కు తీసుకొని కోర్టుల ద్వారా నక్సలైట్ల శవాలను వారి కుటుంబాలకు ఇప్పించేవారు. ఈ పని చెయ్యడానికేకాక, అమరుల కుటుంబాలకు అండగా, ఓదార్పుగా, ఆ కుటుంబాలన్నిటిని సమన్వయం చేయడానికి ఒక సంఘం ఉంటే బాగుంటుందని భావించి 2000 సంవత్సరంలో అమరుల బంధుమిత్రుల సంఘం (ఎబిఎంఎస్) ఏర్పడింది. ప్రసాదం గత 5, 6 సంవత్సరాలుగా ఎబిఎంఎస్‌కు గౌరవాధ్యక్షుడుగా పని చేస్తున్నాడు.

ఇక ఆర్‌డిఎఫ్‌ను తీసుకుంటే.... ఈ దేశంలో భూస్వాములు, పెట్టుబడిదారులు పాలకుల అవతారమెత్తి ప్రజలను అడ్డగోలుగా దోచుకోవడమేకాక, వారి యజమానులైన సామ్రాజ్యవాదులకు కూడా సర్వస్వం దోచిపెడుతున్నారు. దాంతో ప్రజల జీవితాలు రోజురోజుకు సంక్షోభంలో పడిపోతున్నాయి. ప్రజలకు బాసటగా ఉండడం కోసం దేశవ్యాప్తంగా ప్రజాస్వామికవాదులను, మేధావులను కూడగట్టి ప్రభుత్వాలను నిలదియ్యడం కోసం ఆర్‌డిఎఫ్ ఏర్పడింది. ఈ సంస్థ (ఆర్‌డిఎఫ్) ఏర్పడడం కూడా ప్రభుత్వాలకు మింగుడు పడలేదు. అందుకే సంవత్సరం తిరక్కముందే ఆర్‌డిఎఫ్‌పై నిషేధాజ్ఞలు విధించింది. ప్రసాదం ఎబిఎంఎస్‌లో, ఆర్‌డిఎఫ్‌లలో పనిచెయ్యడం ప్రభుత్వాల దృష్టిలో నేరమయిపోయింది. అందుకే ప్రసాదాన్ని ప్రభుత్వాలు తప్ప మరెవరూ చంపరు.

ప్రసాదంలాంటి ప్రజాస్వామిక, ప్రగతిశీలవాదులను చంపడం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి వెన్నతో పెట్టిన విద్య. గతంలో పౌరహక్కుల సంఘంలో పనిచేసే జాపా లక్ష్మారెడ్డి, గోపి రాజన్న, డా. రామనాథం, డా. ఆమెడ నారాయణ, నర్రా ప్రభాకర్‌రెడ్డి, పురుషోత్తం, ఆజాం అలీలను ఇదే విధంగా చంపేసింది. ప్రత్యేక ప్రజాస్వామ్య తెలంగాణ రాష్ట్రం కోసం పోరాడే బెల్లిలలిత, ఐలన్న, కనకాచారిలను, కుల నిర్మూలన పోరాట సమితిలో పనిచేసే మన్నెం ప్రసాద్, మునెప్పలను ఇలాగే చంపేసింది. బెల్లి లలితనైతే పదిహేడు ముక్కలు చేయించాడు చంద్రబాబు. బహుశా ప్రపంచంలో ఏ నియంత కూడా ఇంత క్రూరంగా చంపి ఉండడు. అందులో స్త్రీలను. 1980, 90లలో పోలీసులు ముసుగుల్లో వచ్చి హక్కుల సంఘం వారిని చంపేస్తే, 2000 సంవత్సరం నుండి ప్రైవేటు హంతకముఠాలు ముసుగులలో వచ్చి చంపుతున్నాయి. ఈ ప్రైవేటు ముఠాలు రకరకాల టైగర్లమని, కోబ్రాలమని ప్రకటించుకున్నాయి. గంటి ప్రసాదంను చంపిన వారు కూడా 'చత్తీస్‌గడ్ చిరుతలం' అని ప్రకటించుకున్నారు. 80, '90'లలో ప్రభుత్వం చేసిన ఈ హత్యలపై రక్షించాల్సిన పోలీసులే ప్రజలను భక్షిస్తున్నారని పోలీసులను, ప్రభుత్వాన్ని ప్రజలు, ప్రజాస్వామికవాదులు, ప్రజా సంఘాలు నిలదీశాయి. అంతేకాక 1990 తర్వాత (నూతన ఆర్థిక విధానాలలో భాగంగా) ప్రభుత్వ రంగాలన్నీ ప్రైవేట్ పరం చేసినట్టే ఈ హత్యలు చెయ్యడానికి కూడా ప్రభుత్వం ప్రైవేట్ ముఠాలను పెంచి పోషిస్తోంది. కనీసం న్యాయవిచారణ కూడా జరపని ప్రభుత్వం చంపినవారు మాజీ నక్సలైట్లని, చంపబడ్డవారు నక్సలైట్లని తమ చేతిలో కీలుబొమ్మ అయిన మీడియా ద్వారా దుష్ప్రచారం చేయిస్తోంది.

ప్రభుత్వ పాలక వర్గాలు ప్రజలను, ప్రజాస్వామ్యవాదులను అణచివెయ్యడం, హత్యలు చెయ్యడం ఇవ్వాళ కొత్తగా జరుగుతున్నది కాదు. కాకపోతే 1990 తర్వాత నూతన ఆర్థిక విధానాల ముసుగులో ప్రభుత్వాలు ప్రజలను దోపిడి చెయ్యడం పెరిగిపోయింది. దీన్ని ప్రశ్నిస్తున్న, ప్రతిఘటిస్తున్న ప్రజలను, ప్రజాస్వామికవాదులను బహిరంగంగా, అత్యంత భీభత్సంగా చంపేస్తున్నాయి ప్రభుత్వాలు. భారతీయ అగ్రకుల పాలక వర్గాలు వేల సంవత్సరాల నుండి పీడిత వర్గాలను, పీడిత కులాలను, మహిళలను, ఆదివాసీలను ఇదేవిధంగా చంపుతున్నాయి. వీరిపై ఈ హింసను చట్టబద్ధం చెయ్యడానికి 'మనుధర్మాన్నీ' సృష్టించుకున్నాయి. 67 సంవత్సరాలుగా ప్రజాస్వామ్యదేశమని పాలకులు ఎన్ని కబుర్లు చెప్పినా వారి మస్తిష్కాలల్ని బ్రాహ్మణీయ, భూస్వామ్య లక్షణాలను వీడిపోలేదు. దేశంలో రైతులు, కార్మికులు, దళితులు, ఆదివాసీలు, మహిళలు, మైనారిటీలు రోజురోజుకు సమస్యల సుడిగుండంలో చిక్కుకుని ఆత్మహత్యలు చేసుకుంటుంటే పాలకులు మాత్రం అభివృద్ధి జపం చేస్తున్నారు. భూస్వాముల, పెట్టుబడిదారుల అభివృద్ధినే ప్రభుత్వాలు ప్రజలందరి అభివృద్ధిగా ప్రచారం చేస్తున్నాయి. మరోపక్క పాలకులు సామ్రాజ్యవాదులను సాదరంగా ఆహ్వానిస్తూ దేశ సంపదనంతా దోచిపెడుతున్నారు. ఈ ద్విముఖ దోపిడిని ప్రశ్నించే, ప్రతిఘటించే ప్రజలను, ప్రజా సంఘాలను, ప్రజాస్వామికవాదులను నక్సలైట్లుగా, తీవ్రవాదులుగా ముద్రలేస్తూ దుర్మార్గంగా చంపేస్తున్నాయి ప్రభుత్వాలు. ఇందులో భాగమే గంటి ప్రసాదం హత్య కూడా.

మనం కూడా మన పని పద్ధతులు మార్చుకోవాలి. ఆదివాసీల పోరాట స్ఫూర్తిని తీసుకుని పోరాడుదాం. మన చుట్టున్న, మెజారిటీ పీడిత ప్రజల జీవన్మరణ సమస్యలైన ఆకలి, అంటరానితనం, అత్యాచారాలు, హత్యలు, ప్రైవేటీకరణ, సరళీకరణ, అధిక ధరలు, మద్యం మొదలయిన సమస్యలపట్ల దృష్టి కేంద్రీకరించి ప్రజలను పోరాటాలకు సంసిద్ధులను చేద్దాం. అప్పుడే నిజమైన ప్రజాస్వామ్య వ్యవస్థకు మార్గం ఏర్పడుతుంది. గంటి ప్రసాదం వంటి వారి ఆశ, ఆశయం నెరవేరుతాయి.



నివేదిక:

## నెల్లూరులో జూలై 4 విరసం సదస్సు

**- వి. చెంచయ్య**

విప్లవ రచయితల సంఘం 44వ పుట్టిన రోజు సందర్భంగా జులై 4న నెల్లూరులో జరిగిన విరసం సదస్సులో 'అంకురం' సినిమా దర్శకులు సి. ఉమా మహేశ్వరరావు, విరసం సభ్యులు సి.ఎస్.ఆర్. ప్రసాద్, అమరుల బంధుమిత్రుల కమిటీ రాష్ట్ర గౌరవాధ్యక్షుడు గంటి ప్రసాదం వక్తలుగా పాల్గొన్నారు. విరసం సభ్యుడు వి. చెంచయ్య అధ్యక్షత వహించారు.

ఇటీవలే అమరుడైన విప్లవ రచయిత కామ్రేడ్ ఆలూరి భుజంగారావు గురించి మొదట గంటి ప్రసాదం మాట్లాడారు. సాహిత్యం ద్వారనేగాక, తన జీవితం ద్వారా కూడా సమాజంలో మార్పుకు భుజంగరావు ప్రేరణ ఇచ్చాడన్నారు. రచయితలు కేవలం రచనలకే పరిమితం కాకూడదనీ, తమ ఆచరణ ద్వారా కూడా సమసమాజ నిర్మాణానికి చేయూతనివ్వాలనీ, అలాంటి రచయితల్లో భుజంగరావు ఒకరనీ అన్నారు. అనువాద రచయితగా గుర్తింపు పొందిన భుజంగరావు చాలా స్వతంత్ర రచనలు కూడా చేశాడనీ, అనువాదానికి ఆయన ఎంచుకున్న రచనలు తన అనువాద ప్రతిభకు మాత్రమే ఉపయోగపడేవేగాక, సామాజిక చైతన్యానికి దోహదం చేసేవి కూడననీ అన్నారు.

తర్వాత ఉమామహేశ్వరరావు మాట్లాడుతూ తెలుగు చలనచిత్ర రంగంలోకి మార్క్స్ భావాలు చొచ్చుకువచ్చినపుడే సామాజికంగా సినిమా ప్రజలకు చేరువవుతుందన్నారు. మాదాల రంగారావు, నారాయణమూర్తిలాంటి వారు విప్లవ భావజాలం అని చెప్పుకుంటున్నా, సినిమాకు వచ్చేటప్పటికి వ్యాపారపరంగానే చూడడం జరిగిందన్నారు. సినిమాల్లో వాస్తవికత లేక పోవడం వలన అది రంగుల మాయాప్రపంచంగా తయారయిందన్నారు. గురజాడ 'కన్యాశుల్కం మొదలు, రావిశాస్త్రి 'నిజం' నాటిక, రంగనాయకమ్మ 'బలిపీఠం' వరకు అనేక సాహిత్య ప్రక్రియలు సినిమాల్లోకి వచ్చినా, దర్శకులు వస్తువును పెడతోవగా మలిచారన్నారు. ప్రజా సమస్యలతో సినిమా తీసి, వాస్తవికంగా చూపెడితే అది ప్రజలకు చేరువై చైతన్య స్ఫూర్తిని కలగిస్తుందన్నారు. సినిమా వ్యాపారం కాదని, సినిమా ప్రజా సాధనం అని గుర్తించాలన్నారు.

చివరగా సి.ఎస్.ఆర్. ప్రసాద్ మాట్లాడుతూ మన ప్రభుత్వాలు ప్రజల సార్వభౌమాధికారాన్ని సామ్రాజ్యవాదులకు తాకట్టుపెడుతున్నాయన్నారు. ప్రపంచీకరణ అంటే ఈ దేశంలోకి సామ్రాజ్యవాదులు బహిరంగంగానే వచ్చి, ప్రజా వ్యతిరేక కార్యకలాపాలు స్వేచ్ఛగా నిర్వహించుకుని, ప్రజల్ని దోపిడీ చెయ్యడమేనన్నారు. సామాజిక చైతన్యం, సమిష్టితత్వం ఉన్నవాళ్ళల్లో కూడా వ్యక్తివాదాన్ని ప్రవేశపెట్టడం సామ్రాజ్యవాద లక్షణం అన్నారు. ఈ సామ్రాజ్యవాద అవలక్షణాల్ని ఎదుర్కొని, అధిగమించే ప్రయత్నం చెయ్యడం సాహిత్య సాంస్కృతిక రంగంలో రచయితల, కళాకారుల, మేధావుల బాధ్యత అన్నారు.

ఉపన్యాసాలు శ్రోతల అవగాహనను పెంచగా, డప్పు రమేష్ కళాబృందం వారు పాడిన పాటలు వారిని ఉత్తేజితుల్ని చేశాయి. ఈ సదస్సుకు సుమారు 350 మంది ప్రతినిధులు హాజరయ్యారు. గత పది సంవత్సరాలుగా విరసం నెల్లూరు జిల్లా యూనిట్ జులై 4న ఇలాంటి సాహిత్య సదస్సుల్ని నిరాటంకంగా జరుపుతోంది.

# హక్కుల నిర్దేశకుడు గంటి ప్రసాదం

- లక్ష్మణ్ గడ్డం

గంటి ప్రసాదం అమరుల బంధుమిత్రుల సంఘం కార్యకర్తగా మాకు గత అయిదారేళ్ళుగా పరిచయం. అంతకుముందు మావోయిస్టుగా, అంతకంటే ముందుపార్టీ యూనిటీ నేతగా ప్రత్యక్షంగా ఎరుగం. విప్లవ రాజకీయాల నుంచి బయటికి వచ్చి బహిరంగ ప్రజాసంఘం కార్యకర్తగా అన్ని ప్రజా సంఘాలకు కొద్ది సమయంలోనే ఒక ఆదర్శ నాయకునిగా స్ఫూర్తినిచ్చే గుర్తింపు పొందాడు. ఈ నెల 4న నెల్లూరులో నిర్వహించిన విప్లవ రచయితల సంఘం బహిరంగ సభలో ప్రసంగించి భోజన విరామంలో నెల్లూరు హాస్పిటల్‌లో చికిత్స పొందుతున్న కామేశ్వరమ్మను పలకరించి తిరిగి వస్తున్న క్రమంలో హాస్పిటల్ గేటు వద్దే పొంచి ఉన్న పోలీసుహంతకముఠా గంటి ప్రసాదంను కత్తితో మెడిపై నరికి ఆపై తుపాకితో కాల్చి చంపింది. ఆయన వెంట ఉన్న ముగ్గురు సహచరులు, ప్రజలు ప్రత్యక్ష సాక్షులు.

గత 28 ఏళ్ళుగా ఈ ప్రభుత్వం ప్రజా సంఘాల నాయకులపై హత్యాకాండ కొనసాగిస్తున్నది. ప్రజా సంఘాల నాయకులు బలౌతూనే ఉన్నారు. మొదటి దశలో పోలీసులు నేరుగా ప్రజా సంఘాల నాయకులను తుపాకులతో కాల్చి చంపారు. అప్రతిష్ట పాలు అయ్యాక ప్రైవేటు హంతక ముఠాలతో వేట కొడవళ్ళతో చంపించింది. ఇప్పుడు ఇద్దరూ కలిసి వేటకొడవళ్ళతో నరికి, తుపాకులతో కాల్చిచంపి పెను సవాలు విసిరారు. చేతలు, చేతులు అన్ని మేమే అని చాటుకున్నారు.

1985లో గోపి రాజన్నను, డాక్టర్ రామనాథంను, 1986లో జాపా లక్ష్మారెడ్డిని, 1991లో నర్రా ప్రభాకరరెడ్డిని, 1996లో డాక్టర్ ఆమెడ నారాయణను పోలీసులు స్వయంగా తుపాకులతో కాల్చి చంపారు. ఆ తర్వాత హంతకముఠాకు ఆ పని అప్పజెప్పారు. బెల్లి లలిత, పురుషోత్తం, ఆజం అలీ కనకాచారిలను హంతక ముఠాలచే నరికి చంపించారు. గద్దర్‌పై కాల్పులు జరిపారు. మళ్ళీ ఇప్పుడు ఇద్దరూ కలిసి రెండూ ప్రయోగించి గంటి ప్రసాదంను పొట్టన పెట్టుకున్నారు.

గంటి ప్రసాదం కత్తుల దాడి, తుపాకుల కాల్పులకు గురై నెల్లూరు ఆసుపత్రిలో చికిత్స పొందుతూ దాదాపుగా పన్నెండు గంటలు మృత్యువుతో పోరాడి చనిపోయాడు. ప్రభుత్వం సకాలంలో స్పందించి హైదరాబాదుకు తరలించి చికిత్స చేయించి ఉంటే గంటి ప్రసాదం బతికేవాడు. పట్టించుకోని ప్రభుత్వం బాధ్యత వహించాలి. దాడి జరిగిన వెంటనే అన్ని ప్రజా సంఘాల కార్యకర్తలు కలిసి 'గంటి ప్రసాదంను హైదరాబాద్‌కు హెలికాప్టర్‌లో తరలించి నిజాం హాస్పిటల్‌లో చికిత్స చేయించండి' అని మొరపెట్టుకోవడానికి ముఖ్యమంత్రి క్యాంపు ఆఫీసుకెళితే పోలీసులు అడ్డుకున్నారు. వరవరరావుతోపాటు 60 మందిని పోలీసులు ఈడ్చి, లాగి, కొట్టి, తన్ని వ్యానులో పడేసి అరెస్టు చేశారు. అందులో 20 మంది మహిళలను మగ పోలీసులు అరెస్టు చేస్తూ అసభ్యకరంగా ప్రవర్తించారు. చివరి దశలో మాత్రమే ముగ్గురు ఆడ పోలీసులు వచ్చారు. 'మేం ధర్నాకుగాని, ఆందోళనకు గాని ఇక్కడికి రాలేదు, ప్రసాదంను కాల్చితే కాల్చారు, తను ఇప్పటికీ బతికే ఉన్నాడు, మానవతా దృక్పథంతో ఆయన్ని హైదరాబాదుకు హెలికాప్టర్‌లో తరలించండి. నిజాం హాస్పిటల్‌లో మెరుగైన చికిత్స చేయించండి' అని వరవరరావు ముఖ్యమంత్రి ఆఫీసుకు ఫోన్ చేసి చెప్పాడు. గద్దర్‌ను బతికించిన క్రెడిట్ మీకే దక్కింది, ఇప్పుడు ప్రసాదంను కాపాడిన క్రెడిట్ కూడా మీకు దక్కుతుందని చెప్పాడు. ముఖ్యమంత్రిని కలిసే అవకాశం ఇవ్వండని డిమాండ్ చేశారు. ముందుగా అపాయింట్‌మెంటు లేదని నిరాకరించారు. గంటి ప్రసాదంను అపాయింట్‌మెంటుతో కాల్చారా? అని, అపాయింట్‌మెంటు తీసుకుని చావు సంభవిస్తుందా? అని నచ్చ చెప్పాం. పెడచెవిన పెట్టిన ముఖ్యమంత్రి ఆఫీసు ప్రసాదం మృతికి కారణమయ్యింది. పైగా విన్నపం ఇవ్వడానికి వచ్చిన 20 మంది మహిళలతో బాటు 60 మంది కార్యకర్తలను పోలీసులు కిందపడేసి బూటు కాళ్ళతో తొక్కి లాగడం వలన ప్రజా కళామండలి కోటి చేయికి గాయమయ్యింది. అమరుల బంధుమిత్రుల సంఘం సత్య మోకాలు విరిగింది. క్రాంతి ఆసుపత్రి పాలయ్యాడు. అరెస్టు చేసిన వారిని షాయినాథ్‌గంజ్ పోలీస్ స్టేషన్, సంజీవరెడ్డినగర్ పోలీస్ స్టేషన్, పంజాగుట్ట పోలీస్‌స్టేషన్‌లలో నిర్బంధించి అక్రమ కేసులు నమోదు చేశారు. ఒకవైపు ఆడ పిల్లలు బంగారు తల్లులంటూనే మరోవైపు కాళ్ళు విరగ్గొడుతున్నారు. ఒక్కరినో, ఇద్దరినో అనుమతిస్తే వినతిపత్రం ఇచ్చి వచ్చేవాళ్ళం. పోలీసులు అతిగా ప్రవర్తించి ఇంత నిర్బంధం ప్రయోగించారు. ఆనాటి ఎలక్ట్రానిక్ మీడియా దృశ్యాలు సాక్ష్యం.

ప్రజల చేత ఎన్నుకోబడిన ముఖ్యమంత్రికి ప్రజలు గోడు వినే ఓపిక, ప్రాణాలు కాపాడే బాధ్యత లేకపోతే రేపు ఓట్లు అడిగే నైతికత లేదు. మరోవైపు ఎన్‌కౌంటర్లలో గాయపడిన, గాయపడని పోలీసులను వీరోచితంగా హెలికాప్టర్‌లలో తరలించడాన్ని ప్రజలు గమనిస్తలేరా? పోలీసుల మీద ఒకప్రేమ ప్రజల మీద మరో ప్రేమ ప్రదర్శిస్తోంది. గంటి ప్రసాదంను చంపి ఏం సాధించారో, ఓ గొప్ప మానవతా వాది, ప్రజల మనిషిని ఎందుకు చంపిందో ప్రజా సంఘాలు డిమాండ్ చేసినట్టుగా ఆయన్ని హైదరాబాద్‌కు ఎందుకు తరలించలేదో, ఇన్ని రోజులైనా హంతకులను ఎందుకు అరెస్టు చేయలేదో ప్రజలకు చెప్పాల్సిన బాధ్యత ప్రభుత్వంపై ఉంది.

జూలై 6న బొబ్బిలి టౌనులో జరిగిన గంటి ప్రసాదం అంత్యక్రియల్లో వేలాది మంది జూట్‌మిల్లు కార్మికులు, ప్రజలు, మహిళలు పాల్గొని కన్నీటి నివాళులర్పించారు. ఆయన తన అరవైనాలుగేళ్ళ జీవితం ప్రజల కోసం అంకితం చేశాడు. ఇరవై ఏళ్ళు విప్లవోద్యమంలో ఉండి గత అయిదారేళ్ళుగా అమరుల 'బంధుమిత్రుల సంఘంలో పనిచేస్తూ అన్ని ప్రజా సంఘాలకు ఒక

దశా దిశా నిర్దేశకుడయ్యాడు. జన జీవన స్రవంతిలోకి రండంటూనే వచ్చిన వారిని మట్టుపెడుతుందీ ప్రభుత్వం. ప్రజల మధ్య ఉంటూనే ప్రజా సంఘాల పని విధానాలను పరిశీలించి సూచనలిచ్చాడు. సంఘాలలోకి నూతన సభ్యులను చేర్చుకుని, అభివృద్ధిపరిచి సంస్థల పరిధిని విస్తృతం చేయాల్సిన అవసరాన్ని గమనంలోకి తెచ్చాడు. ప్రపంచీకరణ మాయాజాలంలో పడి ప్రజల సమస్యలను బలంగా పట్టించుకోకపోవడం, తగినంత సమయం కేటాయించకపోవడం, కెరియరిజం వైపు కొట్టుకపోవడంలాంటి ధోరణులను అధిగమించాలన్నాడు. కార్యకర్తలను, నాయత్వానికి నిరంతరం అధ్యయన అవసరాన్ని గుర్తింపజేశాడు. కార్యవర్గ, కార్యకర్తల సమావేశాలు క్రమంగా జరిపి నిర్మాణాలు పటిష్ట చొరవ చూపాలన్నాడు. నిర్బంధ నియమాల్లో ఎలా దృఢంగా నిలబడాలో నేర్పాడు. అవగాహన తరగతులు ఎప్పటికప్పుడూ నిర్వహిస్తూ కార్యకర్తల సైద్ధాంతిక అవగాహన పెంచాలన్నాడు. ప్రజల జీవన సరళికి దగ్గరగా తమ జీవన విధానం ఉండాలని, ఉన్నత విలువలను పాటించాలని, ఇంట్లో, వ్యక్తిగత జీవితంలో భూస్వామ్య అన్య వర్గ ధోరణులను దరి చేరకుండా చూడాలని చెప్పిన గొప్ప మేధావి.

ప్రభుత్వం ఆయనను భౌతికంగా ప్రజాసంఘాల మధ్య లేకుండా నిర్మూలించింది. కాని ఆయన నేర్పిన పని పద్ధతులు ఆదర్శంగా మిగిలి ఉన్నాయి. వాటిని ఆలోచనలో నుండి ఎవరూ తీసివేయలేరు. కనుక ఈ వ్యవస్థ, ప్రభుత్వం చట్టబద్ధపాలనకు కట్టుబడి ఉండాలని అడుగుతూనే ఉంటాం. చాలా మందికి బతకడానికి జీవనాధారం లేదు. పనికి తగిన వేతనం లేదు. సామాజిక ఆర్థిక, రాజకీయ న్యాయం జరగడం లేదు. ఈ వైఫల్యాలపై ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తాం. ఆదేశిక సూత్రాల అమలు నుండి వైదొలగారని నిలదీస్తాం. ఎన్‌కౌంటర్ల పేరుతో ప్రత్యామ్నాయ రాజకీయ కార్యకర్తలను, ఉద్యమకారులను, సానుభూతిపరులను కాల్చివేయడాన్ని ఎండగడతాం. ఎన్‌కౌంటర్లలో చనిపోయిన వారి శవాలను కనీసం వారి తల్లిదండ్రులకు అప్పజెప్పాలని పోరాటం చేస్తాం. ఇది భారత రాజ్యాంగం ఆర్టికల్ 21లో హామీ ఇచ్చిన చట్టపరమైన జీవించే హక్కుకు విరుద్ధం అని ప్రచారం చేస్తాం.

ప్రజాస్వామ్యంలో అధికారం చేపట్టడానికి కనీస అర్హత లేనివాళ్ళు ఇవ్వాళ మనల్ని ఏలుతున్నారు. దేశ సంపదను తమలో తాము పంచుకుంటున్నారు. ఈ దోపిడికి పోలీసు వ్యవస్థను అండగా నిలబెట్టుకున్నారు. సామ్రాజ్యవాదం పెద్దన్నగా నిలబడ్డింది. ఈ పరిణామం వలన ప్రజాస్వామ్యం నష్టపోతుంది. కాపాడుకోవాల్సిన బాధ్యత ప్రజలపైన, ప్రజా సంఘాలపైన ఉంది. గంటి ప్రసాదం చూపిన మార్గం ఉంది. నిర్బంధానికి ప్రతిరూపం చంద్రబాబుకు ప్రజలు నేర్పిన గుణపాఠం కిరణ్ సర్కారుకు కూడా నేర్పుతారు.



## ప్రొద్దుటూరు డిఎస్‌పిగారికి

ప్రొద్దుటూరు
21.07.2013

విషయం: విప్లవ రచయితల సంఘం రాష్ట్ర కార్యదర్శి వరలక్ష్మిని, మరో పన్నెండు మంది రచయితలు, ప్రజా సంఘాల కార్యకర్తలను చంపుతామని వచ్చిన బెదిరింపు ఉత్తరంపై విచారణ జరిపి, చర్య తీసుకోవాలని.

ఈ నెల పదహారవ తేదీన విప్లవ రచయితల సంఘం కార్యదర్శి వరలక్ష్మి గారికి ఒక బెదిరింపు ఉత్తరం అందింది. 4 జూలై 2013న నెల్లూరు పట్టణంలో హత్యకు గురైన అమరుల బంధుమిత్రుల సంఘం గౌరవాధ్యక్షులు గంటి ప్రసాదం సంస్మరణలో పుస్తకాన్ని ప్రచురిస్తే తూటాల వర్షం కురుస్తుందని అందులో ఆమెను హెచ్చరించారు. అంతే కాదు వరవరరావు, హరగోపాల్, చిలకా చంద్రశేఖర్, పినాక పాణి, కళ్యాణరావు, శేషయ్య, రఘునాథ్, సురేష్, జెల్లి లింగయ్య, దుడ్డు ప్రభాకర్, వై.కె. చలసాని ప్రసాద్‌ల సంస్మరణలో పుస్తకాలు తేవడానికి నువ్వు ఉండాలి కదా అంటూ ఒక రకంగా వీళ్ళందరినీ చంపివేస్తామని కూడా బెదిరించారు. వీళ్ళందరూ రచయితలు, ప్రజా సంఘాల నాయకులు.

ఒక మనిషి మరణానంతరం ఆయన జ్ఞాపకాలను నమోదు చేయడం, ఆయనను అభిమానించే సహచరులు, స్నేహితులు ఆయనతో తమ స్మృతుల్ని కలబోసుకోవడం అత్యంత మానవీయమైన విషయం. అటువంటి ఒక పుస్తకాన్ని ప్రచురిస్తున్నామని 'గంటి ప్రసాదంగారిపై రచనలు పంపండి' అంటూ విప్లవ రచయితల సంఘం కార్యదర్శిగా వరలక్ష్మి పత్రికలకు ఒక ప్రకటన ఇస్తే పుస్తకాన్ని ప్రచురిస్తే చంపుతామంటూ లేఖ రాయడం పట్ల మేము ఆందోళన వ్యక్తం చేస్తున్నాము. అమరులైనవారి కుటుంబాల కోసం ఏర్పడిన సంఘానికి గౌరవాధ్యక్షులుగా ఉంటూ పలు ప్రజా సమస్యలపై గొంతెత్తుతున్న గంటి ప్రసాదంను పట్టపగలు రోడ్డుపై చంపడమే అత్యంత దుర్మార్గమైన విషయమైతే, ఆయన స్మృతిలో పుస్తకం ప్రచురిస్తే రచయితలను కూడా చంపుతామని బెదిరించడం ప్రజాస్వామ్యానికి ప్రాణప్రదమైన భావప్రకటనా స్వేచ్ఛను పాశవికంగా నలిపేయడమే. రచనపై, భావ ప్రకటనపై, స్మృతులు, జ్ఞాపకాలపై కూడా కత్తులు, తూటాల బెదిరింపులు రావడం ప్రజాస్వామ్య వ్యవస్థకు తీవ్రమైన విషయం. వ్యక్తులు చనిపోతే వారిని స్మరించుకోవడం, వారి జ్ఞాపకాలను పంచుకోవడం, వారు ఆ కాలంలో పోషించిన పాత్ర గురించి చరిత్రలో నమోదు చేయడం సర్వసాధారణం. అదే సమయంలో భిన్నాభిప్రాయాలు ఎన్ని ఉన్నా వాటిని ప్రకటించుకునే హక్కు పట్ల గౌరవం ఉండడం నాగరిక సమాజపు లక్షణం. సమాజం భావసంఘర్షణ ద్వారానే ఉన్నతిని సాధిస్తుంది. దానిని సహించలేని వాతావరణం ఏ మాత్రం నెలకొన్నా అది వ్యవస్థ సంక్షోభాన్ని తెలియజేస్తుంది. ప్రజా సంఘాల నాయకులను దారుణంగా చంపడం, రోజురోజుకూ ప్రజాస్వామిక వాతావరణం దిగజారడం, చివరికి పుస్తకం ప్రచురిస్తే, అదీ ఒక సంస్మరణ పుస్తకం వేస్తే చంపుతామని బెదిరింపులు రావడం పట్ల మేం తీవ్ర నిరసన వ్యక్తం చేస్తున్నాం. వరలక్ష్మి గారికి వచ్చిన బెదిరింపు ఉత్తరంపై విచారణ జరిపి నేరస్తులపై చర్య తీసుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

**ఇట్లు**
ప్రజా సంఘాలు, ప్రొద్దుటూరు.

# నిరాడంబరత, నిర్భీతి - మారుపేరు గంటి ప్రసాదం

- ఆర్. గణపతిరావునాయుడు

గంటి ప్రసాదం గూర్చి వివిధ పత్రికలలో నివాళి వ్యాసాలు, కవితలు వచ్చాయి. వీటిలో వరవరరావుగారి వ్యాసం కాస్త సమగ్రంగానే ఉంది కానీ అందులో ఆయన నిరాడంబరత్వాన్ని గూర్చి పెద్దగా లేదు. ఆ లోటు భర్తీ చేయడానికి ఈ చిన్న నివాళి వ్యాసం. 1986-87 ప్రాంతంలో శ్రీకాకుళం జిల్లా రాజాంలో గ్రంధి మల్లిఖార్జున రావు వాసవీ జూట్‌మిల్లును నెలకొల్పాడు. ఈయన జీఎంఆర్ పేరుతో మనదేశమే కాదు, ఇతర దేశాలవారికే తెలిసినవాడే. అంతకుముందు వీరి కుటుంబం కుటుంబం వేరుశనగ, గోగునార మొదలైన వ్యవసాయ ఉత్పత్తుల వ్యాపారం చేసేది. గ్రంధి మల్లిఖార్జునరావు ప్రారంభంలో ప్రభుత్వ ఉద్యోగానికి ప్రయత్నించి, ఆ తరువాత విశాఖపట్నంలో ఎ.పి. స్కూటర్స్ డీలర్‌గా ఉండి విరమించి, కర్నాటకలో ఖాయిలా (సిక్) పడిన ఒక జూట్ మిల్లు నుండి యంత్ర సామాగ్రిని కొనుగోలుచేసి రాజాంలో వాసవీ జూట్‌మిల్లును స్థాపించారు. బహుశా రాజాంలో నాటికి పెద్దమిల్లు అదే.

ఆ పరిశ్రమ (వాసవీ జూట్ మిల్లు)లో కొత్తగా రిక్రూట్ కాబడిన కార్మికులకుగానీ, ఆ మిల్లుకు తమ వ్యవసాయోత్పరకమైన గోగునారను సరఫరా చేసే రైతులకు గానీ పారిశ్రామిక వివరాల చట్టం, ట్రేడ్ యూనియన్ హక్కులు, సంఘం పెట్టుకోవడం, పోరాడడం, సమిష్టిగా బేరమాడడం, వ్యవసాయ ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు ఇవేవీ తెలియదు. ఇవన్నీ రాజాం ప్రాంత ప్రజలకు తెలిపిన తొలి గురువు గంటి ప్రసాదం. రాజాం పట్టణానికి (అప్పట్లో అది పెద్ద గ్రామం) 2 కి.మీ. దూరంలో వాసవీ జూట్ మిల్లు ఉంటే, సదరు జూట్ మిల్లుకు 1 కి.మీ దూరంలో ఉన్న కంచరాం గ్రామంలో గంటి ప్రసాదం ఒక కార్మికుని ఇంటి గదిలో నివాసం ఏర్పరచుకున్నారు. కార్మికులకు వారి హక్కుల గూర్చి, సంఘ నిర్మాణ ఆవశ్యకత గూర్చి చాలా ఓర్పుగా, పట్టు వదలకుండా బోధించారు. అతని శ్రమఫలితంగా వాసవీ జూట్ మిల్లు వర్కర్స్ యూనియన్ ప్రారంభమయింది. సమ్మె నోటీసు ఇవ్వబడింది. సమ్మె ప్రారంభమయింది.

యాజమాన్యం (జీఎంఆర్) చర్చలకు ఆహ్వానించింది. చర్చల సందర్భంగా జీఎంఆర్ టీ తెప్పించాడు. నాకు 'టీ' వద్దండీ మంచినీళ్ళు చాలు అన్నాడు. గంటిప్రసాదం గార్కి సిగరేట్ అలవాటు ఉండేది. ఏ కార్మికుడి దగ్గరో ఒక నాన్‌ఫిల్టర్ సిగరెట్ తీసుకొని రెండు ముక్కలు చేసి ఒక ముక్క కాల్చి, మరో ముక్క ఆ తరువాతకి దాచుకునేవాడు.

అది ఇంతకుముందే గమనించిన జీఎంఆర్, ఖరీదైన సిగరెట్ పేకెట్ తెప్పించి, తాను సిగరెట్ ముట్టిస్తూ, మరో సిగరెట్ ప్రసాదంగారికిచ్చి, 'తీసుకోండి ప్రసాదంగారూ' అంటే మీరిచ్చే సిగరెట్టు 'నా ఒంటికి పడదండీ, మా కార్మికులు కాల్చేదే, వాళ్ళ దగ్గరే ఏదో ఒకటి తీసుకొంటాను' అనేవాడు. బాగా పొద్దు పోయేవరకు చర్చలుసాగి, ఆ తరువాత ఇంటికి చేరిన ప్రసాదంగారిని, ఆ ఇంటి ఇల్లాలు (కార్మిక సోదరుని భార్య), 'అన్నా మరి నీ భోజనమో?' అంటే, 'బన్ను (అర్ధ రూపాయి రొట్టె) తెచ్చుకున్నానమ్మా', ఆమె 'పాలు మరగబెట్టి ఇవ్వనా' అంటే 'వద్దమ్మా! నీకెందుకు ఈ టైంలో శ్రమ? మంచి నీళ్ళు ఇవ్వు చాలు' అని ఆ మంచినీళ్ళలో రొట్టెను ముంచుకొని, నీళ్ళుతాగి పడుకొనేవాడు.

ఎట్టకేలకు చర్చలు ఒక కొలిక్కి వచ్చాయి. ఎందుకంటే కార్మిక వర్గం ఇంకా పూర్తిగా చైతన్యవంతం కాని సమయంలో నాయకత్వానికి పట్టు విడుపులు అనివార్యం. యాజమాన్యం, కార్మిక నాయకులు, ప్రభుత్వ కార్మిక సంక్షేమ అధికారులతో విశాఖపట్నంలో త్రైపాక్షిక ఒప్పందం కుదిరింది. సమ్మె విరమించబడింది. ఈ సందర్భంగా యాజమాన్యం విశాఖపట్నంలో ఒక ఐదు నక్షత్రాల హోటల్‌లో విందు ఏర్పాటు చేసింది. యాజమాన్యం తరఫునా, కార్మిక సంక్షేమ శాఖ తరఫునా హాజరైనవారికి అందరికీ ఎవరికి ఏం కావాలో ఏర్పాటుచేసిన జీఎంఆర్, 'ప్రసాదంగారు! మీరేం తీసుకుంటారు? 'అంటే' నాకు, అంబలి తెప్పించండి అని జవాబు. 'ఫైవ్ స్టార్ హోటల్‌లో ఉండి అంబలి ఏమిటండీ' అంటే 'మీ సంపన్నుల తిళ్లు మాకు అరగవు' జవాబు. 'ఈ హోటల్‌లో అంబలి ఉండదే'.. 'అయితే మంచినీళ్ళు చాలులెండి' చివరికి మల్లిబాబు (జీఎంఆర్) తనకారు పంపించి, పేదవారి ఇంటి నుండి రూ. 5/-ల అంబలి కొని తెప్పిస్తే అదే అయిన భోజనం. ఇదీ ఆయన నిరాడంబరత. ప్రజా ఉద్యమాలలో పని చేస్తున్న ప్రతీ కార్యకర్తకు ఆదర్శప్రాయం.

6 జూలై 2013 బొబ్బిలిలో గంటి ప్రసాదం భౌతికకాయానికి శాల్యూట్ చేసి తిరిగి రాజాం వచ్చిన తరువాత రాజాంలో బ్రాందీషాపులు, బార్లులో పనిచేస్తున్న కార్మికులు ఎదురై, 'ఏం, మాష్టారూ ఇంతలేటుగా ఎక్కడి నుండి వస్తున్నారు' అని ప్రశ్నిస్తే 'గంటి ప్రసాదంగారని' అని చెప్పబోతుండగా, 'ఆc! గంటి ప్రసాద్‌కు ఏమయింది' అని ఆందోళనగా అడిగి, నేచెప్పిందంతా దిగ్భ్రాంతిగా విని, 'అలాంటి మనిషి మరి పుట్టడు' అతని గూర్చి చెప్పుకుంటూ వెళ్ళిపోయారు. వారేమీ పారిశ్రామిక కార్మికులూ కారు. రైతాంగ పేదలూ కారు. ఆదివాసీలు కారు. సాధారణ ప్రజలు జనం తమకోసం పనిచేసినవార్ని గుండెల్లో పెట్టుకొంటారనడానికి అంత్యక్రియలకు హాజరైన అశేష జన వాహిని మాత్రమే కాదు, ఇలాంటి వారి మాటలూ నిదర్శనమే.



# అవిశ్రాంత పోరాట యోధుడు

**- కె. పద్మ**

వేగంగా, ఆవేశంగా
కొండకోనలపై నుంచి
దూకే జలపాతం గంటి ప్రసాదం
గలగలపారే సెలయేరులా
అలుపెరుగని సంద్రపు అలల్లా
అవిశ్రాంత పోరాటయోధుడు
ఆప్త బంధుమిత్రుడే కాదు
స్నేహితుడూ, మార్గనిర్దేశకుడూ, సిద్ధాంతకర్త

నేను వరంగల్ జైలు నుంచి బయటికి వచ్చాక అమరుల బంధుమిత్రుల సంఘంలో పని చేయాలని నిర్ణయించుకొని ఆ సంఘ బాధ్యులు కామ్రేడ్ గంటి ప్రసాదంగారిని మొదటిసారిగా కలిసినప్పుడు ఆ మాటలలోని వేగాన్ని, పనుల్ని సకాలంలో పూర్తి చేసెయ్యాలనే తపనతో సమయంతో పోటీపడుతూ పరుగుపెట్టే ప్రసాదంగారిని చూసి ఎంతో ఉత్సాహం కలిగింది. ఆయనలోని ఆ సంవేదనే శత్రువుని వణికించింది. భౌతికంగా అంతం చేసి కాస్త భయాల్ని తగ్గించుకోగలిగాడేమోకాని, 'పోరాటమే నా ఊపిరి, పోరు లేకపోతే నా ఊపిరి ఆగిపోతుంది. చివరి వరకు పోరాడుతాను' అని ఆయన ఓ వార్తాపత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పినట్లు ఆ పోరాటమే ఊపిరిగా చేసుకుని ఆయన ఆశయాల్ని కొనసాగిస్తామంటూ నినాదాలు చేస్తూ, సమర్థుడైన ప్రసంగాల నాయకుణ్ణి పోగొట్టుకొన్న వేదనతో ఒకవైపు కన్నీళ్ళు తుడుచుకుంటూనే మరోవైపు పోరాడేవారిదే ఎర్రజెండా అంటూ బొబ్బిలి పట్టణ వీథుల్లో ఆయన అంతిమయాత్రలో కదంతొక్కిన కార్మికవర్గమే ఆశావహ భవిష్యత్తుకు నిదర్శనం.

'విప్లవం కుట్ర కాదు, విప్లవోద్యమం పక్షాన నిలబడతాను' అని నిజామాబాదు కోర్టులో నిర్భయంగా నిజాయితీగా ప్రకటించిన గంటి ప్రసాదంగారు ('గారు' అనడం కాస్త దూరాన్ని సూచిస్తుందేమో కాని కామ్రేడ్ ప్రసాదం విషయంలో అది పేరులో భాగమైపోయింది) ప్రతీ విషయాన్ని సైద్ధాంతికంగా చాలా స్పష్టంగా, సరళంగా వివరించేవారు. జులై 2010లో ఆ కోర్టులో చెప్పినట్లుగానే, అంతిమ శ్వాస వరకు నమ్మినదాన్నే చెప్పడం, చెప్పినదాన్నే ఆచరించడం అనేది కమ్యూనిస్టు సిద్ధాంత ఆచరణకు సంబంధించిన మౌలికసూత్రానికి నిజాయితీగా కట్టుబడి పనిచేస్తూ రైతాంగ, రచయితలు, కార్మిక, కళా, పౌరహక్కుల రంగాలలోనేకాక ప్రధానంగా అమరుల బంధుమిత్రుల సంఘానికి రూపకర్తగానూ, సిద్ధాంతకర్తగానూ సంఘ నిర్మాణపర బలహీనతలను గురించి అనుక్షణం ఆలోచిస్తూండేవాడు. తప్పుడు కేసులకి, అక్రమ నిర్బంధాలకు తలవంచబోనని, ధిక్కరిస్తాననీ ప్రకటించి, దాడికి గురయ్యి ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నప్పుడు 'ఉద్యమం కోసం నన్ను బ్రతికించండి నేను బతికేటట్లున్నా' అని వైద్యులను అడిగాడు.

బొబ్బిలిలో ఆయన సహచరి కామేశ్వరిని పలకరించడానికి వెళ్ళినప్పుడు ఆవిడ మనోస్థైర్యానికి ఆశ్చర్యమేసింది. పలకరిస్తున్న వారిని, వారి కుటుంబ సభ్యుల క్షేమ సమాచారాలను పేరుపేరునా అడిగి తెలుసుకుంటున్నారు. నేను దగ్గరికి వెళ్ళి చెయ్యి పట్టుకొని కూచోగానే హైదరాబాదు నుంచి బస్సులో ప్రయాణం చేసి వచ్చారు, ఆరోగ్యం బాగుందా' అని అడిగారు. 'ఎప్పుడో ఒకప్పుడు ఇలా జరుగుతుందని తెలిసిన విషయమే కదా! నాకు వ్యక్తిగతమైన నష్టం కంటే మీ సంఘ నాయకత్వాన్ని కోల్పోవడం వల్ల మీరు మరింతగా ఇబ్బంది పడతారు' అని ఆవిడ అన్నమాటలు అవగాహన, ఆలోచనా పరిణితులను చాటడమేకాక, ప్రసాదంగారుకామేశ్వరిని జీవిత సహచరిగా కలిగి ఉండడం ఎంత అదృష్టం అన్పించింది. 'చంపేసానని సంబరాలు చేసుకుంటున్నాడేమో కాని పట్టపగలు నడిరోడ్డున చంపడం ఏ మాత్రం విజయం పొందినట్లు కాదు. అంతిమంగా వాడి పతనం ఎలాగూ తప్పదు' అన్నారు.

రాష్ట్రమంతా హడావిడిగా తిరుగుతూ మాకు అవసరమైనంత సమయాన్ని కేటాయించడం లేదనీ, కొన్నిరోజులపాటు మాతో ఉండిపోవాలని అడిగితే ఆయా జిల్లాలో 'హాహాకారాలు' చేస్తున్నారు, వెళ్ళిపోవాల్సిందే అనేవారు. అది ఎంతవాస్తవమో ఇప్పుడు అర్థమవుతోంది. ఆయారంగాల్లో ఆయన చేసిన అపారమైన కృషీ, ఆయన లేని లోటు ప్రత్యేకించి అమరుల బంధుమిత్రుల సంఘంలో ఆయన మార్గదర్శకత్వంలో అంతేచురుకుగా, క్రియాశీలతతో సైద్ధాంతిక జ్ఞానాన్ని పెంచుకుంటూ ముందుకు సాగాలని అనుకున్న నాకు ఆయన అమరత్వం మరెన్నటికీ పూడ్చుకోలేనిలోటు.

ఎంత మానవత్వంలో, ఆత్మీయతతో సహచరుల అవసరాలు, మానసిక స్థితిగతుల గురించి ఆలోచించేవారో అంతే ఖచ్చితంగా లోటుపాట్లను విమర్శించేవారు. మంచి కమ్యూనిస్టులకు ఉండాల్సిన ఆ లక్షణాన్ని సహజ స్థిర స్వభావంగా అలవరుచుకొని అమలుపరిస్తే, గంటి ప్రసాదంగారి చురుకుదనాన్నీ విప్లవస్ఫూర్తినీ, ఆఖరి క్షణందాకా సమసమాజ స్థాపన కోసం అమరులైన ఆశయాల సఫలం కోసం అమరుడైన ఆయన ఆశయాలనీ కొనసాగించడమే ఆయనకు అర్పించగల నిజమైన నివాళి.

# ప్రజా ఉద్యమాలకు నాయకత్వం లేకుండా చేసే కుట్రే కా. గంటి ప్రసాదం హత్య

**- క్రాంతి స్వరాజ్**

ప్రభుత్వం పెరుగుతున్న ప్రజా ఉద్యమాలను అణచడానికి ప్రజా సంఘాల నాయకులను మారుపేర్లతో అంతమొందించాలని చూస్తున్నది. ఈ పద్ధతి ఫాసిస్టు రాజశేఖర్ రెడ్డి కాలంలోనే అమల్లోకి వచ్చింది. సామ్రాజ్యవాదానికి, దళారీ దోపిడీ వర్గాలకు, ప్రభుత్వాలకు వ్యతిరేకంగా రాష్ట్ర వ్యాప్తంగా ప్రజా సంఘాలు అనేక పోరాటాలు చేపడుతున్నాయి. ఈ క్రమంలోనే జూన్ 8న పువ్వర్తి అమరుల సంస్మరణ సభ వరంగల్‌లో విజయవంతంగా జరిగింది. విప్లవ

శిబిరంపై ఈ సభ మంచి ప్రభావం వేసింది. దీనితో అమరుల బంధుమిత్రుల సంఘానికి మార్గదర్శిగా ఉన్న గంటి ప్రసాదంపై ప్రభుత్వం కన్నెర్ర జేసింది. అందుకే ఆయనని దారుణంగా హత్య చేసింది. ప్రభుత్వం విప్లవకారులను పాశవికంగా హత్యచేసి వారి శవాలను సమితం సంబంధికులకు ఇవ్వకుండా కుళ్ళిపోయేలా చేయడం, మాయం చేయడంలాంటి హీనమైన చర్యలకు పాల్పడుతున్నది. రాజకీయ విశ్వాసాల కోసం పోరాడి అమరులైన వారి శవాలను వారి బంధుమిత్రులకు అప్పగించాలనేది ప్రజల చట్టబద్ధమైన హక్కు. ఈ కనీస న్యాయమైన డిమాండ్ కోసమే ఎబిఎంఎస్ పోరాడుతున్నది. దీనిని సహితం ప్రభుత్వాలు సహించలేని స్థితికి చేరుకున్నాయి. కాబట్టి గంటి ప్రసాదం హత్యపై అందరూ గొంతు విప్పకపోతే ఈ ప్రమాదం మరింత పెరిగే అవకాశం ఉంది. పోరాడే ప్రజలకు నాయకత్వం లేకుండా చేయాలనే ప్రభుత్వ కుట్రలో భాగమే ఇది.

నేను 2009లో సుభాష్‌నగర్‌లో అమరవీరుల సంస్మరణ సభకు హాజరైనాను. అప్పుడు నాకు కా. గంటి ప్రసాదం పరిచయమయ్యాడు. పరిచయం చేసుకున్న వెంటనే నన్ను ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు. ఆ రోజు సాయంత్రం సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగిన సభలో ఆయన ప్రపంచ ఆర్థిక సంక్షోభంపై మాట్లాడారు. ఆ మాటలు నాకు నేటికీ గుర్తున్నాయి. అప్పటి నుండి ఆయనను వివిధ సభల సందర్భంగా కలిసినప్పుడు పలకరిస్తున్నాను. ఆదివాసులు, తెలంగాణ ఉద్యమాలపై నిర్బంధాన్ని వ్యతిరేకిస్తూ జరిగిన వరంగల్ సభలో గంటి ప్రసాదం తెలంగాణ ఆకాంక్షను ఎత్తిపట్టారు. తెలంగాణ పట్ల ప్రభుత్వాల వైఖరిని దుయ్యబట్టారు. సభ జరిగిన మరుసటి రోజుమేము ఇద్దరం ట్రైన్‌లో కలిసి వచ్చాము. ఇద్దరికీ సీట్ దొరకలేదు. ఆయనకు కొంచం ప్లేస్ ఇవ్వమని నేను చాలా మందిని రిక్వెస్ట్ చేశాను. ఏం పర్లేదు నిలబడే వెళ్ళొచ్చు అన్నాడు. స్టాండింగ్‌లోనే హైదరాబాద్ చేరుకున్నాము. అదే చివరి జ్ఞాపకం అయ్యింది. దళారీ పాలకులతో కలిసి దేశ సకల సంపదలను దోచుకోవడానికి సామ్రాజ్యవాదులు ఉవ్విళ్ళూరుతున్నారు. దేశ సార్వభౌమత్వాన్ని, సర్వాన్ని సామ్రాజ్యవాదులకు తాకట్టు పెడుతున్న ప్రభుత్వాలు దీనిని వ్యతిరేకించే ప్రజలపైనా, ప్రజా సంఘాలపైనా ఎంతటి హింసకైనా తెగబడుతున్నాయి. ఈ దోపిడీ రాజ్యం కొద్దిమందిని చంపి క్రూర ఆనందం పొందినా అది తాత్కాలికమే. కార్మిక చైతన్యంతో ప్రజలు ప్రభుత్వాలకు తప్పక బుద్ధి చెపుతారు. అమరుల ఆశయాలను నెరవేరుస్తారు.

# మనందరి గంటి ప్రసాదం

**- కృష్ణాబాయి**

మా ఉత్తరాంధ్ర ముద్దుబిడ్డ గంటి ప్రసాదం ప్రభుత్వ కరుకు కత్తులకి బలి అయ్యాడు (జూలై 4). ప్రజల కోసం ప్రభుత్వాన్ని ఎదిరించే సత్తా ఉన్న నాయకుడికి మరణం లెక్కకాదు. అయితే అతని మరణం మనలో దుఃఖాన్నీ ఆవేదననీ కాదు ఆగ్రహాన్ని రగిలించాలి.

అతనితో ఒక్కసారి మాట్లాడితే చాలు, అతన్ని మర్చిపోలేం. ఆ చిరునవ్వూ, మాటతీరు మనని చుట్టేస్తాయి. ఎదటివారి పట్ల కన్సర్న్ చాలా ఎక్కువ. తను నమ్మిన రాజకీయాలతో సంబంధమున్న వారితోనే గాదు, విబేధించే వారితోనైనా అంత మృదువుగానే మాట్లాడతాడు. అలా అని తను నమ్మిన విశ్వాసాలకి అంగుళం కూడా అవతలకి జరగడు.

చాలాకాలం క్రితం విశాఖ రచయితల సంఘం బహిరంగ సమావేశంలో అన్నదమ్ములిద్దరూ పాటలు పాడడంతో పరిచయమయ్యారు. తర్వాత అడపాదడపా మాత్రం కనిపించేవారు.

ప్రసాదం బొబ్బిలి కళాసీల సంఘాన్ని నడుపుతున్నాడనీ, కామ్రేడ్ అప్పల సూరి నాయకత్వంలో పని చేస్తున్నాడని వినేవాళ్ళం. తన తమ్ముడు రమణ మా అందరికీ సన్నిహితుడయ్యాడు.

ప్రసాదం విరసం ఎదుర్కొంటున్న సమస్యలు కొన్నిటిని జాగ్రత్తగా పరిష్కరించే ప్రయత్నం చేశాడు.

అయిదారేళ్ళుగా ప్రసాదం తరుచుగా విశాఖ వస్తూండడంతో బాగా దగ్గరయ్యాం. ప్రజాసంఘాల పని తీరులో మార్పులు తీసుకురావలసిన సంగతుల్ని చర్చించేవాళ్ళం. అతని గొంతులో నెగెటివ్ టోన్ తక్కువ. దానినే 'మానవీయ పరిమళం' అన్నారు హరగోపాల్.

అమ్మ కన్నబిడ్డల్లో కడసారి వాడు బుచ్చి. అదవన్నల్లో అన్నగా మెలిగి, వాళ్ళ కోసం పని చేసినందుకు ఎన్‌కౌంటరయ్యాడు. ఇప్పుడు ప్రసాదం వంతు వచ్చింది.

అతని సహచరి కామేశ్వరి, కొడుకు సుధీర్ కూడా కడుపులో కన్నీళ్ళు దాచుకుని, జనంతో కలిసి నడుస్తున్నారు. ప్రసాదం వాళ్ళకిచ్చిన సంస్కారం ఇదే.

ప్రసాదానికి హృదయపూర్వక జోహార్లు!

# గొప్ప ఆదర్శప్రాయుడు

**- మహదేవన్**

నాకు గంటి ప్రసాదంతో వ్యక్తిగత పరిచయం ఉంది. అతను నాకు మంచి మిత్రుడే కాకుండా మంచి గురువు. ఇంకా ఒక గొప్ప ఆదర్శప్రాయుడు. గత ఏడేళ్ల నుంచి అతను ఎప్పుడు న్యాయ సలహా కావాల్సినా నన్ను సంప్రదించేవాడు. అతను రహస్య ఉద్యమం నుంచి బైటికి వచ్చిన తరువాత అమరుల బంధుమిత్రుల సంఘంలో ఉంటూ ప్రజల కోసం చాలా కృషి చేసారు. ఆయన చేసిన కృషి చట్టానికి విరుద్ధమేం కాదు. ఎన్‌కౌంటర్‌లలో మృతి చెందినవారి బంధుమిత్రులను కలవడం కానీ ఓదార్చడం కానీ చట్టవిరుద్ధమేం కాదు. అయితే ఇప్పుడు ఉన్న రాజ్యాంగ వ్యవస్థ, రాజ్యాంగ అధికారులు ఆయన మీద ఎందుకు ఇంత దారుణంగా ప్రవర్తించారు. గతంలో ఉన్న కేసుల్లో హాజరు అవుతూ ప్రజల్లోనే ఉంటూ ప్రజలకు సేవ చేయడం కూడా తప్పా. ఎవరో, ఎక్కడో చంపితే ఇంకెవరినో ఇలా గంటి ప్రసాదంలా చంపి సాధించడం న్యాయమేనా. ప్రస్తుతం ఈ రాజ్యంగ వ్యవస్థ ఒక గూండా రాజ్యంగా మారింది.

ప్రజాస్వామ్యంలో ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా ఈ గూండా రాజ్య వ్యవస్థ మారే అవకాశాలు లేవు. కాబట్టి ఈ ప్రభుత్వాన్ని ప్రజలే మార్చాలి. ఈ మార్పు కోసమే గంటి ప్రసాదంలాంటి ఎంతో మంది మేధావులు కృషి చేసి ప్రభుత్వ అకృత్యాలకు బలి అవుతున్నారు. చరిత్రలో ప్రతి యుద్ధంలో ఇరువైపులా కొన్ని నీతులు పాటించేవారు. కానీ ఇప్పుడున్న రాజ్యాంగంలో నీతి లేదు, నిజాయితీ లేదు. న్యాయం లేదు, ధర్మం కూడా లేదు. మన రాజ్యాంగంలో ఉన్న రూల్ ఆఫ్ లా ఈ బూర్జువా ప్రభుత్వాలే పాటించకపోతే మన వ్యవస్థ ఒక అనార్కిస్ట్ స్టేట్‌గా మారుతుంది. నేను ఇంత మంచిగా ఈ రోజు తెలుగులో రాయగలుగుతున్నానంటే దానికి గంటి ప్రసాదమే కారణం. ఎందుకంటే నన్ను తెలుగులో సాహిత్యం నేర్చుకోమని ప్రోత్సహించిన గొప్ప విప్లవకారుడు గంటి ప్రసాదం.

# మా తాత

**- కౌముది**

మా స్కూలు 'డెసినీయల్ సెలబ్రేషన్స్' జరుగుతున్నాయి. జూలై 4న థర్డ్ క్లాస్ స్టూడెంట్సుకు 'మోరల్ వాల్యూస్' మీద గెస్ట్ లెక్చర్ ఇవ్వడానికి మా మమ్మీ మా స్కూలుకు వచ్చింది. స్కూలు అయిపోయినాక, మా స్కూలు బస్‌లో మాతోనే వస్తోంది. మా తమ్ముడు (1వ తరగతి), నేను బస్‌లో ఫ్రెండ్స్‌తో మాట్లాడుకుంటున్నాము. అప్పుడు మమ్మీకి డాడి నుండి ఫోనొచ్చింది. ఫోన్లో గంటితాత మీద దాడి జరిగిందని చెప్పాడు. ఆ విషయం మాకు చెప్పకుండా మీరు వెళ్ళండి, ట్యూషన్ అయిపోయాక వస్తానంటూ సడన్‌గా బస్ దిగేసింది. రాత్రయినాంక ఇంటికి వచ్చాక చెప్పింది. టి.వి. పెట్టి న్యూస్ ఛానెళ్ళను మార్చి మార్చి చూస్తున్నాం. మాకు చాలా బాధగావుంది. మమ్మి ఫోన్లు మాట్లాడుతూ టెన్షన్‌గా ఉండిరది. టి.వి.లో తాత కళ్ళజోడు, చెప్పులు, సెల్‌ఫోను చూపిస్తున్నారు. తాత వచ్చినప్పుడల్లా తమ్ముడు సెల్ గుంజుకుని స్నేక్‌గేమ్ ఆడేవాడు. వాడు టి.వి. చూస్తూ ఏడుస్తుంటే నాకూ ఏడుపొచ్చింది.

తెల్లారి అమ్మ నిద్రలేపి స్కూలుకు రెడీ చేస్తుంటే భయంగానే అడిగాను 'మమ్మీ తాతకి ఎలా ఉంది?' 'తాత ఇక లేడమ్మా, చనిపోయాడు' అని నా జుట్టు దువ్వుతోంది. నాకు ఏడుపు రాలేదు, బాగా కోపమొచ్చింది. ఎందుకు ఆ వెధవలు తాతను నరికారు. ప్రజలకోసం పోరాడే వాళ్లను నరికి చంపేస్తారా? ఎన్‌కౌంటర్లు జరిగినప్పుడల్లా బాధపడుతూ డాడీతో చాలా గొడవగా మాట్లాడేవాడు తాత. 'మేము స్కూలుకు వెళ్ళము, ఇంత దారుణం చేస్తే మనమేం చేయొద్దా? మనం బంద్ చేద్దాం, గొడవ చేద్దాం లేకపోతే ధర్నా చేద్దాం' అన్నాను. అవి మేము చూసుకుంటాము మీరు స్కూలుకెళ్ళండి అని డాడీ బస్కెకించాడు. టిఫిన్ బాక్సు, లంచ్ బాక్సు ఏదీ పెట్టలేదు. మమ్మీ డబ్బులిచ్చి కేంటిన్‌లో తినమంది. స్కూలు నుండి రాగానే మమ్మల్ని నానమ్మ దగ్గర వదిలి మమ్మి, డాడీలు తాత వాళ్ళ ఊరికి బయలుదేరారు. మాకూ తాతను చూడాలనుంది మేమూ వస్తామంటే బస్‌లో సీట్లు లేవురా, చాలా దూరం, మళ్ళా వద్దురులే. అన్నాడు డాడి. 'మళ్ళా వెళ్తే తాత ఉంటాడా' అని తమ్ముడు స్లోగా అంటున్నాడు.

గంటి తాతను తలచుకుంటే ఏడుపొస్తోంది. నేను చిన్న చిన్న రైటింగ్స్ చేస్తుంటే తాత కరక్షన్స్ చేసేవాడు. పొయిట్రీ బాగుందనేవాడు. నేను మా స్కూలు మాగ్‌జైన్ కోసం లాస్ట్ ఇయర్ స్ట్రీట్ చిల్డ్రన్ గురించి రాస్తే ఇంగ్లిషు సెంటెన్స్ ఫార్మేషన్ అంతా గంటి తాతనే చెప్పాడు. ఈ సారి మా స్కూలు మాగ్జైన్‌లో నా రచన ఒకటి తెలుగులో వచ్చింది. దానికి నేను మూడు టైటిల్స్ సెలక్ట్ చేసి అందులోంచి ఒకటి ఫైనల్ చెయ్యి తాతా అంటే 'శాస్త్రీయంగా ఆలోచిద్దాం' అనే టైటిల్ ఓకే చేశాడు. ఇప్పుడు తాతకు మాగ్‌జైన్‌లో నా రచన చూపిద్దామంటే తాత లేడు.

మేమంత ఫ్రెండ్లీగా ఉండేవాళ్ళమో తెల్సా. మా తమ్ముడైతే తాత నాకు 100% ఫ్రెండ్ అంటాడు. ఇంటికి రాగానే టి.వి. రిమోట్ తీసేసుకునేవాడు. మేం మీదపడి గుంజుకునేది. ఏం చేయలేక మాతో కలిసి కార్టూన్లు చూసేవాడు. నెమ్మదిగా మమ్మల్ని ఐస్ చేసి రిమోట్ కొట్టేసి ఇంగ్లిష్ సినిమాలు అన్నీ వార్ మూవీస్ లేకపోతే జేమ్స్‌బాండ్ సినిమాలు పెట్టేవాడు. ఆ సుత్తెందుకు తాతా ఏమైనా జోకులు పెట్టు అని ముగ్గురం ఎంజాయ్ చేసేది. తాత ఎప్పుడొచ్చినా ఫ్రూట్స్ తెస్తాడు. చీటా అరటిపండ్లు అంటే ఇష్టం. మాకూ అలవాటు చేసాడు.

మేము ఒకసారి సంక్రాంతి శెలవులకు వైజాగ్ తాత వాళ్ళింటికి వెళ్ళాం. ఇంటినిండా పుస్తకాలే. మాకోసం నీళ్ళు పట్టి పెట్టాడు. ఓపెన్‌గా స్నానంచేసి ఫుల్ ఎంజాయ్ చేసాం. గంటి తాత వంట చేసాడు. కూర, పప్పు, పచ్చడి, చారు చేసాడు. పచ్చడికి, చారుకి నో డిఫరెన్స్ తాతా అంటే, అపీయరెన్స్‌కాదు తిన్నాక బాగుందో లేదో చెప్పు అన్నాడు. రియల్లీ వెరీ టేస్టీ.

తమ్ముడు నర్సరీలో ఉన్నప్పుడు వాడికి ఫాన్సీ డ్రెస్ కాంపిటీషన్ ఉంది. టాపిక్ కమ్యూనిటీ హెల్పర్స్. 'ఏరా దుండగుడా, ఏ గెటప్ వేస్తున్నావు? డాక్టరా, లాయరా' అని తాత వాడినడిగాడు. నేను మావోయిస్టు గెటప్ వేస్తాను, 'దె ఆర్ ద రియల్ కమ్యూనిటీ హెల్పర్స్ నొ' అన్నాడు సీరియస్‌గా. ఓర్రి దుండగుడా అంటూ తాత వాడిని ముద్దులాడాడు. మమ్మి రైతు గెటప్ వేసింది. సెకండ్ ప్రైజ్ వచ్చింది.

ఇప్పుడు గంటి తాతను మావోయిస్టు అంటున్నారు. మావోయిస్టుల కేసులు మా మమ్మిడాడీలు చాలానే చేస్తారు. మా ఇంటికి చాలామంది వస్తుంటారు. మేము కూడా మీటింగ్‌లకు వెళ్తుంటాము. తెలంగాణ మూవ్‌మెంట్‌లో జై తెలంగాణ అంటూ నేనూ, తమ్ముడూ కూడా చాలా యాక్టివ్‌గా ఉంటాం. సాగరహారం అప్పుడు మొత్తం నడిచాము. భగత్‌సింగ్ మేనల్లుడు జగన్మోహన్ మా యింటికి వచ్చినప్పుడు ఆయనతో కలిసి గంటితాత మేము హేపీగా స్పెండ్ చేసాం. ఆ నైట్ మాకు భగత్‌సింగ్ గురించి ఎన్ని విషయాలు చెప్పాడు.

ప్రజల కోసం పోరాడేవాళ్ళు, ఎన్‌కౌంటర్లు వద్దనే వాళ్ళు, తెలంగాణ కావాలనే వాళ్ళు, పిల్లలంతా బడికి వెళ్ళి చదువుకోవాలనే వాళ్ళు, అందరితో ప్రేమగా ఉండే ఈ కమ్యూనిటీ హెల్పర్స్ అంతా మావోయిస్టులేనా, అయితే మా తాత మవోయిస్టేనా............!



# మా కాలపు అరుదైన వ్యక్తి - గంటి ప్రసాదం

**- అట్టాడ అప్పలనాయుడు**

గంటి ప్రసాదం నాకంటే నాలుగైదేళ్లు పెద్ద. అయినా మా కాలపు వ్యక్తే. నేను 1971లో ఇంటర్మీడియట్ పూర్తి జేసి, ఉన్నత చదువు 'కొనలేక' గ్రామంలో ఖాళీగా ఉన్నపుడు, (నిజానికి ఖాళీగా లేను, గ్రామాల్లో ఒక నానుడేమంటే, చదువుకున్న వ్యక్తి ఉద్యోగం చేయాల, గవర్నమెంటు ఉప్పు తినాల, లేనపుడు సాంప్రదాయంగా వచ్చే వృత్తి జేస్తున్నా ఖాళీగా ఉన్నట్టే లెఖేస్తారు.) ఇంటర్మీడియటనేది పెద్దచదువు కాకపోయినా, మా ఊరికి అదే పెద్ద చదువు. అప్పటికి, కసింత ఎక్కువ చదివింది మా బంధువొకాయన. ఈ బంధువూ, అతని మిత్ర బృందమూ, నేనూ, నా మిత్ర బృందమూ అప్పటికే, మా ఊరికి చుట్టుపక్కల గ్రామాల్లోనా, దగ్గరలోగల ఆదివాసీ ప్రాంతంలోనా సాగిన, సాగుతోన్న నక్సలైట్ ఉద్యమాల పట్ల ఆకర్షితులవడం, నక్సలైట్ సాహిత్యం చదవడం, భూషణం, సి.వి, దిగంబర కవులూ, సృజన పత్రిక వగైరాలను చదివినివే చదవడం, చర్చలూ ఉడుకు నెత్తుటి ఆవేశం, ఆదర్శం పొంగే రోజుల్లో, మా బంధువు మిత్ర బృందంలోని ఒక మిత్రుడు-మా ఊరి దగ్గరలోగల ఒక ఆదివాసీ గ్రామ భూస్వామీ, వ్యాపారీ, ప్రజాశత్రువైన ఒకతన్ని సంహరిస్తే బాగుణ్ననీ, అందుకు నక్సలైట్‌ల సాయం తీసుకొంటే బాగుణ్ణనీ మా ముందు ప్రపోజల్ పెట్టేడు. అదిగో ఆ సందర్భాన, నక్సలైట్ సాయం కోసం, గంటి ప్రసాదాన్ని బొబ్బిలి వెళ్లి కలిసేము.

బొబ్బిలి కోవెల సెంటర్, మేరంగి సెంటర్, బొడ్డపాడు ఆలయం వగైరాలు నక్సలైట్ ప్రచార కేంద్రాలు, నక్సలైట్ సహాయక ప్రదేశాలు. శత్రువుకి ఆనుపానులు తెలీకుండా ఇలాటి చోట్లల్లో, ఎన్నెన్నో ప్రణాళికలూ, ఎన్నెన్నో కార్యక్రమాలూ, రూపొంది, అమలయ్యేవి. కోవెలసెంటర్‌కి దగ్గరలో ప్రసాదం ఆఫీసుగది వుండేది, అందులో కలిసేం. మా ప్రపోజల్ చెప్పాం, ఆయన శ్రద్ధగా విని, కాసేపు తలదించి, ఆలోచించి, తర్వాత తలయెత్తి, మమ్మల్ని చూసి యేవో ప్రశ్నలు వేసాడు, అవేవో నాకు గుర్తులేదు, గానీ ఆ తల దించి ఆలోచించడం, తర్వాత తలయెత్తి సూటిగా చూడడం, చూసాక, ఒంటికాలు మడతవేసి, కాలిపాదాన్ని స్పృశిస్తూ మాటాడడం-ఇప్పటికీ గుర్తుండిపోయింది. ఇప్పటికీ మనతో మాటాడేటపుడతని పొజిషనది.

ఆ తర్వాత ఆ ప్రజా శత్రువుని సంహరించ, రెక్కీని నిర్వహించడం, ఆ సందర్భంలో ప్రసాదం, ఆ ప్రాంతాన్నీ, మా మిత్రుని వైఖరినీ అబ్జర్వు జేయడం-మిత్రుడికీ, ప్రజాశత్రువుకీ మధ్యగల శత్రుత్వాన్నీ గ్రహించడం, మొత్తం వ్యవహారంలోంచి మమ్మల్ని వెనక్కిలాగి నెమ్మది, నెమ్మదిగా మాకు మార్క్సిస్ట్ రాజకీయాలను పరిచయం చేయడం ఇలా నిత్య సంబంధాల్లోకి వచ్చేడు. అలాంటి నిత్య సంబంధాల్లోనే, తొలిసారిగా నేను, ప్రసాదం వలన మామిడి అప్పల సూరిగారిని ఒక రాత్రివేళ రహస్య సమావేశంలో కలిసాను. ఇక అప్పటినుంచీ దాదాపు అప్పల సూరిగారు మరణించిన తర్వాతి యేడాదిదాకా, ప్రసాదానికి నాతో రోజువారీ సంబంధం ఉండేదనొచ్చేమో. నేనేం చేస్తున్నానో, ఏం తింటున్నానో, ఏం రాస్తున్నానో, నా ఆలోచనలేమిటో అన్నీటి మీదా నిఘాలాంటి ప్రసాదం పహారా ఉండేది. బహుశా, ఇందుకు కారణం ప్రసాదం రాజకీయ జీవితంలో, అధిక భాగం అప్పల సూరిగారితో గడవడం. అప్పల సూరిగారికి ఒకరకంగా బయటి ప్రపంచంతో అనుసంధానం చేసే వాహిక ప్రసాదం గావడం అప్పలసూరికి వారసుడిగా నిలబడడం, ఇత్యాది కారణాలతో, ప్రసాదం అప్పలసూరి కుటుంబ సభ్యుడిలా ఉండేవాడు. అరుణ తనకు చెల్లెలాంటిది. నా అత్తా, మామలకు తలకొరివి పెట్టి అంత్యక్రియల బాధ్యతలు నెరవేర్చాడు. ఇలా నాకు ప్రసాదం రాజకీయ, కౌటుంబిక బంధువు. డబ్బయిలలో కలసిన ఈ బాంధవ్యం దాదాపు రెండువేలు సంవత్సరం నాటిదాకా మూడు దశాబ్దాలు కొనసాగింది. తర్వాత, కొన్ని విపరిణామాల వలన మామధ్య దూరం ఏర్పడింది. ఈ దూరానికీ, ఈ వైరానికీ నేనూ, అరుణా ఎంత విలవిలలాడేమో ప్రసాదమూ అంతే విలవిలలాడి ఉంటాడు.

ఈ మధ్యకాలంలో, ప్రసాదం అజ్ఞాతంలోనున్నపుడు, అతని ఆరోగ్యం గురించి వాకబు చేస్తూనే ఉండేవాళ్లం. ప్రసాదం గూడా అరుణ కేన్సర్‌తో పోరాడుతోందని తెలియగా, ఆందోళనగా ఫోన్ చేసి, తర్వాత ఇంటికొచ్చి కలిసాడు. దూరమూ, వైరమూ చెరిగిపోయి, మళ్లీ మా మధ్య బాంధవ్యం కొనసాగుతుండగా, ఇంతలోనే దారుణంగా హత్యకు గురి కావడం చాలా బాధకు గురి చేసింది. దాడికి గురయిన వార్త తెలిసినప్పటి నుంచీ తను బతకాలీ, బతుకుతాడనే అనుకునేవాళ్లం. మా అమ్మాయి వరీనియా పూజ కూడా చేసిందట మామయ్య బతకాలని! (మార్క్సిస్ట్‌లు పూజలు చేస్తారా' అని శంకించకండి, మా అమ్మాయి మార్క్సిస్ట్ కాదు, మార్క్సిస్టు వ్యక్తుల అభిమాని.)

భిన్నమైన వ్యక్తిత్వం.. సాధారణంగా మనుషుల వ్యక్తిత్వం, ఏవో కొద్దితేడాలతో దాదాపుగా ఒకే విధంగా ఉంటుంది. ఇది మూక వ్యక్తిత్వమంటారుగానీ, ఇదే ఎక్కువ. గానీ, ప్రసాదం వ్యక్తిత్వం మూక వ్యక్తిత్వానికి భిన్నమైనది. ఒకర్ని అనుకరించడు. ఒకర్ని అజమాయిషీ చేయడు. తనదైనదేదో, లోలోపల నిర్ణయించుకొని, లోలోపల గుణించుకొని నడుచుకుపోతాడు. ప్రసాదం నడిచే నడకను తలుచుకోండి, తొందర, తొందరగా అడుగులు వేస్తూ, తలదించుకు, దేన్నో ఆలోచిస్తూ నడుస్తాడు పక్కలకు గూడా చూడడు. తన దారేదో, తన నడకేదో అంతే! ఒకోసారి, అతని అడుగులను అందుకోలేము, అతని ఆలోచనలను కూడా! డిగ్రీ పూర్తిజేసి, పూర్తికాలపు కార్యకర్తగా రావడం, వృత్తి విప్లవకారుడిగా బతకాలనుకోవడం. సాధారణ యువకులకు భిన్నమైన వ్యక్తిత్వం ఉంటేగానీ సాధ్యం కాదు. అప్పటికే శ్రీకాకుళోద్యమం నిర్బంధానికి గురయి, దాదాపు ఓటమి అంచుల్లో ఉంది. అయినా, విప్లవం పట్ల ఒక ఆశతో, వృత్తి విప్లవకారుడిగా

జీవితాన్ని మార్చుకోవడం–త్యాగశీలమైనది. మాకైతే ప్రసాదం పట్ల గౌరవానికి ఇదే కారణం. సుమారుగా, మా కాలపువాడయినా, అతన్ని నాయకుడిగా అంగీకరించడానికీ, అతన్ని అనుసరించడానికీ ప్రధాన కారణం అతని, ఈ విప్లవ నిబద్ధతయే!

నాయకత్వ దక్షత ..శ్రీకాకుళోద్యమానంతరకాలంలో,–కేంద్ర స్థాయిలో చీలిన విప్లవ పార్టీ, పెరిగిన నిర్బంధం, నాయకత్వం అమరత్వమో, అరెస్టో కావడం, అంతకుముందరి పార్టీ విభాగాలూ, సభ్యులూ, స్తబ్దతకూ, అభద్రతకూ గురికావడం, అడవీ, కొండా, మైదానం బిక్కచచ్చి బితుకు బితుకుమని కన్పించడం, ప్రజలను భ్రమలలో ముంచే సంక్షేమ పథకాల అమలూ, దేశవ్యాప్త అత్యవసర పరిస్థితీ, గ్రామీణ ప్రాంతాల్లోకి రకరకాల రూపాల్లో పెట్టుబడి ప్రవేశించడం, కళింగాంధ్రాలో కొత్త ప్రాజెక్టుల ప్రతిపాదనలు, కొత్త పరిశ్రమల ఏర్పాట్లూ కొత్త రాజకీయపార్టీల (ప్రాంతీయ) ఆవిర్భావ వాతావరణం వగైరా సామాజిక మార్పులు విప్లవ అననుకూల పరిస్థితులవి! ఆ పరిస్థితుల్లో గంటి విప్లవం పట్ల అచంచల విశ్వాసాన్ని కలిగి ఉండడమేగాక, మాలాంటి వారిలోనూ కలిగించేడు. చారూ మజుందార్ అయిదేళ్లలో దేశం విముక్తి అవుద్దంటే నమ్మినతరంలాగే, ఓడిన విప్లవోద్యమం మళ్లీ రగులుతుందని, విముక్తి యుద్ధం సాగుతుందనీ నమ్మేడు, మా తరాన్ని నడిపించేడు. ఉత్తరాంధ్రాలో మా తరం వారందరికీ నాయకుడు. నాయకత్వ బాధ్యతను దక్షతతో నిర్వహించేడు. అప్పటి మమ్మల్ని తన నాయకత్వంలో ఇముడ్చుకోవడం సామాన్యమైనది కాదు, మేము సంచీలో కొడవళ్ల లాంటివాళ్లం!

జననాట్యమండలి ప్రదర్శనలు (భూపాల్ దళం), కేసులు, ఎమర్జెన్సీ, ఎమర్జెన్సీ అనంతరం శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం మూడు జిల్లాల్లో విశాల ప్రజానీకంలో సంఘాలు ఏర్పాటు చేయడం కార్మిక రంగంలో ప్రగతిశీల కార్మిక రంగం (పికెఎస్)' రైతాంగ రంగంలో రైతాంగ పేదల సమితి (ఆర్‌పిఎస్) సాంస్కృతిక రంగంలో జన కళా మండలి (జెకెఎమ్) పేర్లతో ఉత్తరాంధ్రాలో ఉద్యమ నిర్మాణం చేయడంలో అప్పల సూరిగారికి కుడి భుజంలా పని జేసినది ప్రసాదమే. చైతన్యం మాసపత్రిక నడపడంలో ప్రధానపాత్ర గంటిదే. శ్రీకాకుళోద్యమ స్తబ్దత తర్వాత ఉత్తరాంధ్రాలో బలమైన, నిలకడైన విప్లవోద్యమాన్ని నిర్మాణంజేసి నిలుపుకుంటూ దాదాపు అప్పలసూరి మరణందాకా, రెండు దశాబ్దాలుపైగా పార్టీ యూనిటీ విభాగంలో పనిజేస్తూ మైదాన ప్రాంత ఉద్యమ నిర్మాణానికి పాతాలందించిన ఘనత అప్పలసూరిదీ, గంటిదీ!

బొబ్బిలి, సాలూరు, రాజాం, విశాఖపట్నం, శ్రీకాకుళం, మడపాం, సింగువలస, ఆమదాలవలస దాదాపు ఉత్తరాంధ్రాలోగల జూట్, సుగర్, వగైరా మిల్లు కార్మికుల్లో బలమైన స్థానం పీకెఎస్‌దే. అలాగే, రైతాంగంలో మైదాన ప్రాంతాల్లో రైతాంగ ఉద్యమాలు నిర్మాణం జరిగినది ఆర్‌పిఎస్ ఆధ్వర్యంలోనే! ఒక్క ఆదివాసీ ప్రాంతంలో తప్పా, ఉత్తరాంధ్ర మైదాన ప్రాంతమంతటా, ఉద్యమ నిర్మాణం జరిగింది వీరిద్దరి కృషి ఫలితమే! ఈ కాలమంతటిలో, ఈ ప్రాంతంలో, సాంస్కృతిక రంగంలో నేను నిర్వహించాల్సిన పాత్ర, నిర్వహించిన పాత్ర దాదాపు నిర్దేశించింది. ప్రసాదమే!

అనేక సందర్భాల్లో మా మధ్య సైద్ధాంతిక విభేదాలు చర్చలు! విప్లవోద్యమ నేపథ్యంలో దేన్ని ఎలా స్వీకరించాలో, దేని పాత్ర ఎంతో విపులంగా, ఓపికగా చర్చించి, ఒప్పించి, నన్ను జయించి, తన దారిలో నడిపినాడు. చర్చల్లో, వాదోపవాదాల్లో ప్రసాదం అలవోకగా సామెతలు వాడుతాడు (ఎక్కువగా, బ్రాహ్మణీయ వాసన అనుకోండి). 'భిక్షమేస్తే వెయ్యి, లేపోతే లేదుగానీ, బేపి (కుక్క)ని ఉసిగొలపకు'; 'దేవుడికి మొక్కకపోతే లేదుగానీ, గర్భ గుడిలో పిత్తకు' వంటి కొన్ని సామెతలు, నాతో వాదన సందర్భంలో వాడేడు. నాకిప్పటికీ గుర్తుండిపోయేయి. 'నాయుడూ, నువ్వు విమర్శ ఎక్కువ చేస్తావు, ఆత్మవిమర్శ తక్కువ చేసుకుంటావోయ్' అని విసుర్లు విసిరేవాడు, నామీద! 'ఎవులిమైనా, అంతే గదేటి?' అని అనేవాడ్నిగానీ నువ్వు మాత్రం ఆత్మవిమర్శ చేసుకుంటావేటి అని అనగలిగే సాహసం చేసేవాడ్నికాను అంతటి గౌరవనీయమైన, అరుదైన వ్యక్తిత్వమతనిది.

విప్లవ కార్యకర్తగా ఉండడం కోసం, ప్రసాదం తనలో గల కవినీ, కళాకారుణ్ణీ అణచుకున్నాడు. మేము విముక్తి అనే వీధినాటిక (తర్వాత సృజన పత్రికలో అచ్చయింది) వేస్తున్నపుడు గంటి తనలోని కళాకారుణ్ణి బయట పెట్టాడు. నాటికలో పాత్ర వేసాడు. దానికోసం మా వద్ద శిష్యరికం చేసాడు. డైలాగ్ చెప్పడం, నటనా మేము నేర్పుతుంటే నేర్చుకున్నాడు. ఆయన మంచినటుడూ, కవీ కాగలిగేవాడే కానీ, విప్లవ కార్యకర్త, నాయకుడు కాదలచి తన లోపలి కళలను అణచుకున్నాడు. ఈ విముక్తి సందర్భంగానే ప్రసాదానికీ, మాకూ కలిపి బొబ్బిలిలో కేసు పెట్టారు. పార్వతీపురం జననాట్య మండలి (భూపాల్ దళం) కేసు తర్వాత మళ్లీ కళా రూప ప్రదర్శన కారణాన కేసు మా మీద నడిచినది ఇదే!

ఇపుడాలోచిస్తే, గంటి మా కాలపు మనిషేగానీ, ఆలోచనా, జీవితాచరణలో మాకంటే ముందున్నవాడు, మాకు ఆదర్శమైనవాడన్పిస్తోంది. తన కళ్లముందరే మేము ప్రేమలూ, పెళ్లిల్లూ అంటుంటే, తను పెద్దమనిషిగా నిల్చుని మా పెళ్లిళ్ళు చేసాడు. ఏనాడూ, తన పెళ్లి గురించి ఆలోచించలేదు. బహుశా, సింగువలస జూట్‌మిల్లు పోరాటంలో, పోలీసులు ప్రసాదాన్ని దారుణంగా హింసించేక, అప్పల సూరిగారూ, మేమూ చాలా బాధపడ్డాము. అంతకుమునుపు లేని ఒక ఆలోచనేదో మాకు కలిగింది. గంటి తన భోజనం గురించిగానీ, స్నానం గురించి గానీ, బట్టల గురించిగానీ ఆలోచించేవాడు కాదు. ఎవరమో గుర్తు పెట్టుకొని, అతనికి గుర్తు చేయాలి. చెదిరినజుత్తూ, చెమటకంపు బట్టలూ, తెల్లని రంగు శరీరమూ ఛామనఛాయలోకి మారడం ఇదీ అప్పట్లో గంటి రూపం! (మావోయిస్టు అయేక, జుత్తుకి రంగూ, టకప్పూ, బెల్టూ, సెల్‌పోచూ అందరికీ, ఆశ్చర్యమే, మన గంటేనా అనుకునేవాళ్లం.) ప్రసాదానికి పెళ్లిచేస్తే బాగుణ్ణనిపించింది. అప్పటికే మా ఇంటిలో ఉంటోన్న కామేశ్వరమ్మ మా ఆలోచనల్లో కదిలింది. అలా, ఆ ఆలోచన కార్యరూపం దాల్చి, ఒకరోజు, సంకిలి గ్రామంలో అధ్యయన తరగతులు సందర్భంగా ప్రసాదానికీ, కామేశ్వరమ్మకూ పెళ్లి జరిగింది.

గొంతు నాళాలు బిగించి, పిడికిలి బిగించి, దేహమంతటి నించీ ధ్వనితరంగాల్తో ప్రసాదమిచ్చే నినాదం, రణ శంఖమే! ఆయన ఉపన్యాసం గూడా సుదీర్ఘ వివరణలతో, బ్రాహ్మణ ఉచ్చారణలో మాండలిక పదజాలాల్ని, సామెతల్నీ వాడుతూ సాగుతుంది. బ్రాహ్మణీయ అలవాట్లన్నీ మార్చుకున్నాడుగానీ, ఉచ్చారణలో మాత్రం

# రెండు సమాజాల మధ్య సంభాషణకు వారధి..

- రివేరా

దండకారణ్య సమాజానికి, దానికి బయట ఉన్న సమాజానికి మధ్య అనివార్యంగా జరగాల్సిన సంభాషణకు వారధి విప్లవ సాహిత్యోద్యమం. ఈ ఉద్యమం గానీ, దానిలో భాగమైన వాళ్లు గానీ దండకారణ్య సమాజం పక్షాన ఆ పనికి పూనుకోవడం లేదు. నిజం చెప్పాలంటే ఆ సమాజానికి మన సమాజ అవసరం లేదు. మనకే దండకారణ్యం అండ అవసరం.నిర్దేశం అవసరం. విరసం వంటి సాహిత్యోద్యమ సంస్థలు ఇన్నాళ్లూ చేసిన/ చేస్తున్న పనల్లా ఈ సమాజాన్ని ఆ సమాజం పరిచయంలోకి తీసుకెళ్లడం. అక్కడ జరుగుతున్న సామాజిక ప్రయోగాలను ఈ సమాజానికి వర్తింపజేసే ప్రయత్నం చేయడం. అంతే. అయితే, ఈ తలకిందుల వ్యవస్థకి ఈ క్రమమంతా విలోమంగా కనిపించడంలో ఆశ్చర్యం లేదు. బౌద్ధిక వ్యవస్థలతో భౌతిక బల ప్రయోగంద్వారా తలపడటం ప్రభుత్వాలకు అలవాటే. అమరుల బంధుమిత్రుల సంఘం గౌరవాధ్యక్షుడు, విప్లవ ప్రజాస్వామిక వేదిక జాతీయ ఉపాధ్యక్షుడు కామ్రేడ్ గంటి ప్రసాదం హత్య ఇందుల్లో భాగం.

నిజానికి, మనం చెప్పుకుంటున్న ఈ రెండు సమాజాల మధ్య విరుద్ధతే గానీ, పోలికలు లేవు. ఒక్క మాటలో చెప్పాలంటే దండకారణ్య సమాజం వికసిస్తున్న సమాజం. మనమున్నది అంతర్ధానమవుతున్న సమాజం. అంతర్ధానమయ్యే క్రమమే కాదు, వికసించే క్రమమూ వీలైనంత తక్కువ నెత్తురు, నష్టాలతో పూర్తయ్యేలా చూడటం విప్లవోద్యమ కర్తవ్యం. అదేసమయంలో దానికి అనువైన మానసిక వాతావరణాన్ని సృష్టించడం విప్లవ సాహిత్యోద్యమం బాధ్యత. ఈ పనిని విరసం 43 ఏళ్లుగా చేస్తూనే ఉంది. కాలగమనమంత సహజంగా సాగే ఈ ప్రయాణానికి దండకారణ్యమే దిక్సూచి. వ్యవస్థీకృత పాలన, రాజకీయాలు సంక్షోభంలో పడినప్పుడల్లా పాలకవర్గాలు..ఈ సహజ పరిణామం పట్ల అసహనానికి గురవుతుంటాయి. రాజకీయ హత్యలకు తెగబడతాయి. తాము కూలిపోతున్న సమాజానికి ప్రతినిధులమన్న వాస్తవం తెలుస్తున్నకొద్దీ వాటి అసహనం అంతకంతకూ పెరుగుతూ ఉంటుంది.

కూలుతున్న మన సమాజానికి, కలలు పంచుతున్న దండకారణ్య సమాజానికి మధ్య హస్తమశకాంతం ఉంది. కూర్చున్న కొమ్మను నరుక్కునే సమాజంలో మనముంటే, నిలబడిన నేలని నిలబెట్టుకోవడానికి ప్రాణాలను సైతం ఇస్తున్న మనుషులు అక్కడ ఉన్నారు. చాక్లేటు, బిస్కెట్‌లను సైతం అనుమతించని సమాజం అది. ప్రకృతిలో దొరికేవి, పండేవి తప్ప మరేదీ ముట్టని ప్రాకృతిక ఆహార బద్ధులు వాళ్లు. చెట్టుకు కాసే, భూమిలో దొరికే వాటితో మాత్రమే కడుపు నింపుకుంటారు. ఛత్తీస్‌గఢ్‌లో సల్వాజుడుం గూండా మహేంద్ర కర్మను విప్లవోద్యమం చంపినప్పుడు.ఆ ప్రాంతానికి కూంబింగ్ బలగాలతో పాటు మీడియా ప్రతినిధులు కూడా చేరుకున్నారు. దాడికి ముందు నాలుగైదు గంటలపాటు మావోయిస్టులు ఆ ప్రాంతంలో ఉన్నట్టు గుర్తించారు. ఒకవేళ దాడి ఆలస్యమైతే మరికొన్ని గంటలు సైతం వేచి చూసేందుకు వీలుగా సిద్ధమయి వచ్చారు.. ఏ విధంగా సిద్ధమయ్యారని చూస్తే.. ఆ ప్రదేశమంతా అరటి గెలలు, ఎండబెట్టిన ఖర్జూరాలు విరివిగా కనిపించాయి. ఎక్కడా బిర్యానీలు లేవు..బిస్కెట్‌లు లేవు. కూల్‌డ్రింకులు లేవు..కుర్కురేలు లేవు. అదే మన సమాజానికి వచ్చేసరికి..అటువంటి పట్టింపే లేదు. కనీసం ఆరోగ్య కోణంలోనైనా చాక్లేటు, బిస్కెట్‌లను పిల్లలకు అందకుండా చేయాలని తల్లిదండ్రులు అనుకోవడం లేదు. దండకారణ్యంలో తెల్లబట్టల వాళ్లను ఈనాటికీ అనుమానంగానే చూస్తారు. తొలి రోజుల్లో అది అమాయకత్వమో, భయమో కావచ్చు గానీ, ఇప్పుడది అప్రమత్తత. అటువంటి అప్రమత్తత ఏదీ మన సమాజంలో కనిపించదు. పైగా.. కాస్త మంచిబట్టలు వేసుకున్నవాళ్లకు లేని గౌరవాలు, ఎక్కడలేని ప్రాధాన్యమూ ఇస్తాం. మార్కెట్ నుంచి మారణాయుధాల దాకా అన్నింటికీ తేలిగ్గా దొరికిపోయే మన మానసిక నిరాయుధత్వాన్ని చూసి గంటి ప్రసాదం ఎందుకో మార్పు రాలేదు. డీక్లాసిఫై అయినాడు, పేదల ఇళ్లల్లో తిన్నాడు, నిద్రించేడు, పేదల్లోపేదగా కలిసిపోయేడు. తనకు విప్లవం తప్పా మరో ధ్యాస లేదు. దానికోసమే అన్ని బంధాలూ!

గంటిలో భయాన్ని చూడలేదు. నిరాశను చూడలేదు. బహుశా మనుషులకు ఈ రెండూ సర్వసాధారణం. జీవితంలో ఎపుడోవొకప్పుడు-భయానికీ, నిరాశకూ గురవుతాము. గానీ, గంటి ఈ రెంటికీ గురి కాలేదు. రాజ్యం భయపడింది అతన్ని చూసి. దోపిడీ శక్తులు భయపడ్డాయి అతన్ని చూసి. భయపడ్డవాళ్లే, చాటుమాటుగా ప్రసాదం మీద దాడి చేసారు. ప్రసాదాన్ని బతికుండగా భయపెడదామనుకున్నారు, కానీ వాళ్లకు సాధ్యం కాలేదు! వీరుడు భయపడడు, వీరుణ్ణి చూసి భయపడతారెవరైనా.

మా తరాన్ని ప్రభావితం చేసిన శ్రీకాకుళోద్యమంలో ఎందరో వీరులు నేలకొరిగేరు. మా ప్రాంతంలో, నేను వినిన ఇద్దరు వీరులు వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం! వారు మరణించాకనే నేను వారిని చూసాను. జీవించగా చూడలేకపోయేను. కానీ, అటువంటి ఇద్దరు వీరులు, జంటగా విప్లవోద్యమానికి అంకితమై నడచిన వారు మామిడి అప్పలసూరీ, గంటి ప్రసాదం! వారిని, నా జీవితకాలంలో చూడడమే కాదు, వారితో నడిచినందుకు (కొంతదూరం, కొంత కాలమైనా) నా జీవితం ధన్యమైనదనుకుంటుంటాను. ప్రసాదానికి నా విప్లవ జోహార్లు!



# బతికిన క్షణాలు

- సి. కాశీం

విపరీతమైన ఉక్కపోత. రోడ్ వెంట నడుస్తున్నాం. వేలాది మందిలో మేమూ భాగమయ్యాం. నాకు ఇరువైపుల జగన్, వేణుసార్. నినాదాల హోరు. ఇళ్లల్లో నుంచి బయటికి వచ్చి చూస్తున్న జనం. కొందరు చేతులెత్తి మొక్కుతున్నారు. నడుస్తున్న వాళ్లు చాలా విషయాలు మాట్లాడుతున్నారు. జ్ఞాపకాలు నెమరువేసుకొనే వారు కొందరు. చేసిన సహాయాన్ని గుర్తు చేసుకుంటున్న వారు ఇంకొందరు. నాయకత్వం వహించిన పోరాటాల గురించి మాట్లాడేవారు మరికొందరు. మనిషైన వాడు ఇలా బతుకాలని ఎందరి నోట విన్నానో. ఏ ఎమ్మెల్యేకు, మంత్రులకు ఇంతటి నీరాజనం లభించదని అంటున్న వాళ్లూ ఉన్నారు. ఇట్లా బతికే క్షణాలు కొందరికే ఉంటాయని ఒక ముసలాయన అంటున్నాడు.

'ఎవడు చచ్చి బతికెనో వాడే ధన్యుడని' గురజాడ అన్నాడు. గురజాడది విజయనగరం. గంటి ప్రసాదంది బొబ్బిలి. గురజాడైనా, గంటి ప్రసాదమైనా మరణించి బతికిన వాళ్లు. అమరులు.

నేను గంటి ప్రసాదం సార్‌ను 2006లో మొదటిసారి జైలులో కలిసాను. అపుడాయన ఔరంగాబాద్ కుట్ర కేసులో అరెస్టై నిజామాబాద్ జైలులో ఉన్నాడు. 'ఓ... కాశీం హౌ ఆర్ యూ' అని పలకరించాడు. నేను ఆశ్చర్యపోయాను. ఎందుకంటే నా పేరు చెప్పకముందే, నేను ఇంతకు పూర్వం ఆయనెప్పుడు కలవకుండానే నా పేరు పెట్టి పిలిచినందుకు. అరుణతారలో నీ రచనలు చదువుతున్నాని... ఇంకా ఇతర విషయాలలోకి వెళ్లాడు. ఆయన జైలు నుంచి విడుదలై బహిరంగ జీవితంలోకి వచ్చాక చాలా సార్లు కలుసుకున్నాం. మాట్లాడుకున్నాం. నిర్మాణ విషయాలు, రాజకీయ విషయాలు అనేకం. ఆయన సూక్ష్మ రచయిత, ఆలోచనాపరుడు, హాస్యప్రియుడు, స్నేహశీలి కార్మికవర్గ స్వభావం కలిగిన విప్లవకారుడు. కార్మిక వర్గ స్వభావాన్ని ఆచరించేవాడు. సిద్ధాంతం, రాజకీయాలు, నిర్మాణాలు సరేసరి.... కాని ఆయన వంట రూంకు పట్టినఆదత్వాన్ని విముక్తి చేయటానికి నిరంతరం ప్రయత్నించేవాడు. మా ఇంటికొచ్చినా, సమావేశాలు జరుగుతున్నప్పుడైనా వంట చేయటానికి అందరి కంటే ముందుండేవాడు. 'ఆలుఫ్రై' చేయటంలో ఆయనకు ఆయనే సాటి. వంట పనిలో భాగం కావటం మనం ఆయన నుంచి నేర్చుకోవాలి.

ఇక సాహిత్యంపై ఆయన కుండే పట్టునుచూసి నాకు ఆశ్చర్యం వేసేది. నా దగ్గరకు వచ్చినప్పుడల్లా ప్రాచీన సాహిత్యంలోని పద్యాలను

---

ఎంతో కలవరపడ్డాడు.

గంటి ప్రసాదం వలె..కుల నిర్మూలనా పోరాట సమితి ప్రకాశం జిల్లా కార్యదర్శి మన్నెం ప్రసాద్‌ను ఏడేళ్ల క్రితం ప్రకాశం జిల్లా ఒంగోలులో కోబ్రాలపేరిట హత్య చేశారు. ఈ హత్య జరగడానికి కొన్నినెలల ముందు ఒక సభలో ఆయన..మానవ సంబంధాల క్రమ క్షీణతను గొప్పగా విశ్లేషించారు. ఇళ్లలో పెంచుకునే కోళ్లు సైతం మనం వేసే నూకలు తినడం లేదని, నూకలు పెట్టి ఎక్కడ కోసుకుతింటారోనని మనుషులకు దూరంగా పోతున్నాయని ఆ సభలో ప్రసాద్ తనదైన హాస్యోక్తితో చెప్పారు. మరోవైపు, దండకారణ్యంలో మనుషుల మధ్య సంబంధాలు తాదాత్మిక స్థాయిలో ఉన్నతీకరించబడ్డాయి. సాధన కథనాత్మక వ్యాసం 'గ్రీన్‌హంట్ ఉత్పాతాలు'లోని ఈ చిన్న ఘట్టం గుర్తు చేసుకుంటే; ఆదివాసీలకు, మావోయిస్టులకు మధ్య బంధం..చెట్టు, తీగల్లా ఎంతగా అల్లుకుపోయిందీ అర్థం చేసుకోగలం. రహీ దళం ఒక ఊరికి వెళుతుంది. ఊళ్లో ఒకటే ఇల్లు ఉంటుంది. ఆ ఇంటి కోడలుకు ప్రసవం కష్టమవుతుంది. ఊళ్లోకి వచ్చిన దళానికి ఇంటి వాళ్లు ఈ విషయం చెప్పి గొల్లుమంటారు. అక్కడకి ఐదు కిలోమీటర్ల దూరంలో పట్టణం ఉంది. కానీ, అంత దూరం పోయేందుకు బండి బాట కాదు కదా.. కనీసం కాలిబాట కూడా లేదు. దారిలో రెండు పర్వతాలు దాటిపోవాలి. మంచానికి కట్టి తీసుకెళ్లడానికి నలుగురైనా కావాలి. ఆ కుటుంబంలో అంతమంది లేరు. దీంతో..కొంతదూరంలో ఉంటున్న నర్సును తీసుకురావాల్సిందిగా దళ సభ్యులను బాధ్యుడు పురమాయిస్తాడు. నర్సు అందుబాటులో లేదని తెలిసి..కుటుంబ సభ్యుల కన్నా ఎక్కువగా ఆ బాధ్యుడు కలవరపడతాడు. ఆమెను, ఆమె కడుపులోని శిశువును.. ఇద్దరినీ క్షేమంగా బయటపటేదయం ఎలా అని మథనపడతాడు. తానేదో పరిష్కారం చూపిస్తాడని ఎదురుచూస్తున్న ఆ కుటుంబానికి బాధ్యుడు తన నిస్సహాయతను అత్యంత వేదనాస్వరంతో తెలియజేస్తాడు. "నర్సుబాయి కోసం లామదేతో (ఇంటి అల్లుడు) మా కామ్రేడ్స్ ఇద్దరిని పంపినట్టుగానే, సిరొంచ ఆసుపత్రికి కూడా అమ్మాయిని మోసుకెళ్లడానికి మా వాళ్లను మీకు తోడుగా పంపవచ్చు. కానీ, గ్రీన్‌హంట్ పేరుతో పెద్దెత్తున కొత్త, కొత్త బలగాలు అక్కడకు వచ్చి చేరాయి. గస్తీ తీవ్రం చేశారు. ఎలా చేయడం?" అంటూ పెరిగిన శత్రు నిర్బంధాన్ని వారికి అర్థం చేయిస్తాడు. గ్రీన్‌హంట్ ఆపరేషన్‌కు గల అనేకానేక విషపు పొరలను విప్పిచూపిన పుస్తకం అది. అలాంటి ఒక విషపు పొరే ఇప్పుడు గంటి ప్రసాదాన్ని పొట్టన పెట్టుకుంది.

పి. శంకర్ 'నేటి దండకారణ్యం' ముందుమాటలో అసిధార (కామ్రేడ్ కిషన్‌జీ) అన్నట్టు..దండకారణ్యానికి నేడు పరిచయం అక్కర్లేదు. ఈ మాట ముమ్మాటికీ నిజం. ఇంకా చెప్పాలంటే ముఖాలు కోల్పోయిన మనకి, మూలాలను జారవిడుచుకున్న మన సమాజానికే ఆ అక్కర ఇప్పుడు ఎక్కువగా ఉంది. అది అనివార్యం కూడా..



# ఈ సందర్భంలోని అర్థం ఏమిటి?

- పాణి

గంటి ప్రసాదంగారు చాలా అరుదైన మానవీయ వ్యక్తి. ఆయనలాంటివారిలోని మానవీయ మూర్తిమత్వం విప్లవ రాజకీయాల వల్ల, విప్లవాచరణ వల్ల మాత్రమే రూపొంది ఉంటుంది. ఏ రాజకీయ చైతన్యం లేకపోయినా... మనుషులు ఈ దుర్మార్గ వ్యవస్థ వల్ల అమానవీయంగా ప్రవర్తిస్తారేమోగాని మనిషికి మానవీయంగా ఉండటమే సహజ లక్షణం. ఈ వ్యవస్థలో చాలా అరుదుగానే ఉండే మానవీయతను గంటి ప్రసాదంగారు విప్లవం వల్ల తనలో నిలబెట్టుకోగలిగారు.

ప్రసాదంగారిలోని మానవీయతను చూడటానికి ఈ రాజకీయ కోణం లోపిస్తే ఆయనలోని ఇతరేతర పార్శ్వాలను విశ్లేషించడం కష్టం. తోటి ఆదివాసీ ఖైదీలను జెయిలు నుంచి విడుదల చేస్తేనే తాను బైటికి వస్తానని ఆయన కేవలం మానవీయత వల్ల మాత్రమే పట్టుపట్టలేదు. అది మావోయిస్టు ప్రజా దృక్పథం.

ఈ చర్చ దేనికంటే.. ప్రసాదంగారిలోని మానవీయత వర్గపోరాట రాజకీయాల ఫలితం అనుకుంటేనే అందులోని ప్రగతిదాయకతను ఎత్తి పట్టడానికి వీలవుతుంది. లేకపోతే చాలా మానవీయంగా ఉంటూనే ఒక్కోసారి ప్రగతి వ్యతిరేక వైఖరి తీసుకునేవాళ్లకూ ప్రసాదంగారిలాంటి వాళ్లకూ తేడా తెలియకుండాపోయే ప్రమాదం ఎదురవుతుంది.

నిజానికి ప్రసాదంగారు ఎంత మెత్తగా, ఔదార్యంగా, మానవీయంగా, సౌహార్థ్రంగా ఉంటారో అంతే కఠినంగా ఉంటారు. మనుషులపట్ల, మామూలు విషయాలపట్ల ఇంత మానవీయంగా ఉండే వ్యక్తి రాజకీయ నిర్మాణ విషయాల్లో అత్యంత కఠినుడు. విప్లవకారులు మానవీయంగా ఉండటమంటే అర్థం.. రాజకీయంగా విశాల పీడిత ప్రజా ప్రయోజనాలకు అనుగుణంగా ఉండటమే. అట్లా ఉండటం అంత సులభం కాదు. విప్లవ ప్రయోజనం కోసం రాజకీయ, నిర్మాణ విషయాల్లో చాలా కఠినంగా వ్యవహరించాల్సి వస్తే దానికి ఉత్తుత్తి మానవీయతను గీటురాయిగా పెట్టుకోరు. ప్రసాదంగారి శైలి కూడా అట్లాగే ఉండేది. మనుషుల తప్పులను.. వాటి రాజకీయ అర్థంలో గమనించి వ్యవహరించాల్సి వచ్చినప్పుడు ఆయన నిర్దాక్షిణ్యంగా ఉండేవారు. ఎవరు ఏమనుకున్నా ఆయన పట్టించుకునేవారు కాదు. ఆయనది ఒక రకమైన పాత కాలపు సాగతీసే మాటతీరు అయినా ఇలాంటప్పుడు చాలా నిర్దిష్టంగా, నిర్మొహమాటంగా, రాజకీయాలే గీటురాయిగా మాట్లాడతారు. ఎదుటివాళ్లు ఏ వైపు నుంచి ఎలా స్పందిస్తారో.. అనే జంజాటం పెట్టుకోకుండా తన అభిప్రాయం ప్రకటించేస్తారు. వ్యక్తుల తప్పిదాలకు కారణాలను నిర్దిష్టంగా ఆ మనుషుల్లో ఎంత చూడాలో.. ఒక ధోరణిగా ఏ స్థాయిలో ఎలా సాధారణీకరించాలో ఆయనకు బాగా తెలుసు. అందువల్ల వ్యక్తుల తప్పిదాలతో నిర్మాణపరంగా కఠినంగా వ్యవహరిస్తూనే సొంతం అవతలికి తోసేసే వైఖరి తీసుకొనేవారు కాదు. అసలు ఏ మనిషైనా ఉద్యమానికి ఇక పనికి రాడ(ద)ని ప్రసాదంగారు అరుదుగానే అనుకుంటారు. ఆ మనుషుల్లోని లోపాలతో సహా బలం, వారి అవసరం విమర్శనాత్మకంగా గుర్తించడంలో ఆయన చాలా ఏ తొట్రుపాటుకూ గురయ్యేవారు కాదు. మిత్రుల్లో విప్లవ రాజకీయాలకు భిన్నమైన, వ్యతిరేకమైన ఆలోచనా ధోరణులు పొడసూపుతున్నాయని ఆయన అనుకుంటే.. వాటితో తలపడటంలో కూడా అట్లాగే ఉండేవారు.

మొత్తం మీద మనుషుల విషయంలో చాలా పట్టువిడుపులతో ఉండే మనిషి... ఇలాంటి సందర్భాల్లో మాత్రం తిరుగులేని మార్క్సిస్టుగా స్పందించేవారు. ఆచరణ, నిర్మాణపరమైన తలంలోని ఈ పద్ధతికి కొనసాగింపుగా ఆయన లోపలా బయటా రాజకీయ సైద్ధాంతిక చర్చల్లో సమాధానకర్త పాత్ర పోషించారు. మిత్రుల

---

అలవోకగా కంఠతా చదివి వినిపించేవాడు. మనుచరిత్ర, శతకాలు, నృసింహ పురాణం మొదలైన వాటిల్లోంచి. చివరిసారిగా నా దగ్గర రాసిన నృసింహ పురాణం పుస్తకం తీసుకున్నాడు. తిరిగి ఇవ్వటానికి ప్రసాదం లేడు. ఆయన ఆశయాలు ఉన్నాయి. గౌరవ వాచకం లేకుండా రాస్తున్నానంటే, ఆయన నాతో అంత కామ్రేడ్లీగా ఉండేవాడు.

ఏదైనా చర్చ జరుగుతున్నప్పుడు మనం చెప్పేది శ్రద్ధగా వింటాడు. చెప్పే విషయాల పట్ల సానుకూలంగా ఉన్నాడనే భ్రమను కల్పించి చెప్పనిస్తాడు. విభేదించే విషయాలున్నప్పుడు నికచ్చిగా, సైద్ధాంతికంగా చెప్పి అర్థం చేయిస్తాడు. మనం ఒప్పుకొనకపోతే రిజర్వులో పెట్టుకొని పని చేయమంటాడు. ఏదైనా ఆచరణలో తేల్చుకుందామని స్నేహపూర్వకమైన వాతావరణంలో చర్చను ముగిస్తాడు.

విప్లవ శిబిరంలోనే కొందరు ఆయనను కరుడు గట్టిన వర్గవాదిగా మాట్లాడారు. అస్తిత్వ ఉద్యమాలను లెక్కచేయడన్నారు. ఈ అభిప్రాయం ఎంత తప్పో కులంపై, తెలంగాణపై ఆయన రాసిన సైద్ధాంతిక వ్యాసాలే చెబుతున్నాయి. గాలికి మాట్లాడటం చాలా సులభం. కానీ సిద్ధాంత పునాదిగా మాట్లాడి, రాస్తే తప్ప ప్రసాదం అర్థం కాదు.

నెలకిందట ఫోన్ చేసి మనం కలవాల్సి ఉందన్నాడు. సాధ్యం కాలేదు. ఎన్ఎస్ఎస్ ప్రెస్‌మీటల్‌లో కలిసి 'సమావేశానికి రాకుండా ఉండటం ఇంకో సారి జరగకూడదన్నాడు' సరేనన్నాను. ఇవే చివరగా ఆయనతో మాట్లాడిన మాటలు. ప్రసాదం లేడు. ఆయన బతికిన క్షణాలున్నాయి. వాటిని కొనసాగించటమే ఆయనకు మనమిచ్చే నివాళి. ఇవి వేగుంట మోహన్ ప్రసాద్ 'బతికిన క్షణాలు' కావు. రక్త చలన సంగీతమైన గంటి ప్రసాదం సార్ బతికిన క్షణాలు.



సందేహాలకు, ప్రశ్నలకు, విమర్శలకు, ఆరోపణలకు వివరణలు ఇవ్వడం, సమాధానపరచడమే తన బాధ్యత అన్నట్టుగా ఆయన సంభాషణ, సంవాదం సాగేది. బహిరంగ ప్రజా జీవితంలో ఉన్న ఈ ఎనిమిదేళ్లలో ఆయనకు మార్క్సిస్టు రాజకీయ, సిద్ధాంత విషయాల్లో అన్వేషణా దృష్టితో కూడిన ఏదైనా ప్రశ్న ఎదురవ్వడం నేనైతే గమనించలేదు.

బహుశా ప్రసాదంగారు స్వీకరించిన నిర్మాణ బాధ్యతలు కూడా దీనికి కారణం కావచ్చు. ఆయన ఉద్యమానికి రాజకీయ వ్యాఖ్యాత పాత్రను పోషించాల్సి రావడంతో.. దాని సమర్థన, విశ్లేషణ అనే అతి ముఖ్యమైన పని చేయాల్సి వచ్చింది. అదీ ప్రజా శిబిరంలో రాజకీయాల ఆధిక్యత తగ్గిపోతున్న తరుణంలో దాని అవసరం ఎంత ఉంటుందో ఊహించవచ్చు. అయితే ఇందులో ఒక్కోసారి అంతరంగికంగా కూడా పైన చెప్పిన తరహా ప్రశ్నలకు చోటు దొరకకపోవచ్చు. దీని వల్ల ఆయన కొంచెం నష్టపోయారేమో అని నా అనుమానం. తన దృష్టికి రాని వ్యక్తుల గురించి, ఘటనల గురించి అడిగి తెలుసుకొని, తనకు తెలిసిన సమాచారాన్ని సరి చూసుకొని దానికి తగినట్టుగా వాస్తవిక వైఖరి ఏర్పరుచుకోవడంలో చాలా అప్రమత్తంగా ఉండేవారు. ఇలాంటి విషయాల్లో పూర్వాభిప్రాయాలనే పట్టుకొని వేలాడటం అంటే ఆయనకు చిరాకు. ముఖ్యంగా వ్యక్తుల విషయంలో ఆయన నిరంతరం ఎంత ఓపన్‌మైండ్‌గా ఉంటారో ఆశ్చర్యం కలిగేది. కానీ రాజకీయ సైద్ధాంతిక రంగాల్లో తుది వైఖరితో ఉండేవారు. మార్క్సిజంలో ఉండే అవరణను పట్టించుకోకుండా విప్లవోద్యమ నిర్మాణ అవగాహనను పరమ ప్రమాణంగా తీసుకొని క్రమశిక్షణాయుతంగా మాట్లాడేవారు. మనుషుల చర్యల్లోని తప్పిదాలనైనా, ఆలోచనల్లో తనకు నచ్చనివాటినైనా అర్థం చేసుకోడానికి ఆయనకు విప్లవ నిర్మాణానికి ఉండే అవగాహన, దాని ప్రయోజనమే గీటురాయి. ఈ విషయంలో ఆయన ఆదర్శప్రాయుడైన మావోయిస్టు. అందువల్లే వల్ల ఆయన చాలా దృఢమైన రాజకీయ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించేవారు.

* * *

ప్రసాదంగారి గురించి ఎంత చెప్పుకున్నా ఆయన హత్యకు గురైన ఈ గంభీరమైన సందర్భాన్ని దాని పూర్తి సారంలో అర్థం చేసుకొని స్వీకరిస్తున్నామా? అనేది చాలా ముఖ్యమైన ప్రశ్న. ఉద్యమాలను దెబ్బతీయడానికి రాజ్యం ప్రసాదంగారిని హత్య చేసిందనీ, ఇది ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగమనీ స్పష్టంగానే చెప్పగలుగుతున్నాం. ఈ హత్యా సందర్భాన్ని అంత వరకే తీసుకొని వదిలేద్దామా? ఇంకా ఏమైనా ఉన్నదా? అని విప్లవ ప్రజాస్వామిక ఉద్యమ శిబిరం ఆలోచించాల్సి ఉంది.

ఉద్యమాలు సాధారణంగా రెండు తలాల్లోని సమస్యలతో తలపడుతూ ఉంటాయి. వ్యవస్థ స్వభావాన్ని అర్థం చేసుకొని, దాన్ని మార్చేక్రమంలో ప్రతీఘాతుకశక్తులను, వాటి తరపున ఉన్న రాజ్యాన్ని ఎదుర్కోవడం, రెండోది- శిబిరంలోని అపసవ్య ధోరణులతో తలపడాల్సి రావడం. రెండోది అవాంఛనీయం అనిపిస్తుందిగాని తప్పించుకోలేనిది. ప్రసాదంగారు గత ఎనిమిదేళ్లలో మొదటి తలంలో ఎంత చేశారో... అంతగా, అంతకంటే కొంచెం ఎక్కువగానే ఈ రెండో తలంలో పనిచేయాల్సి వచ్చింది. సంఘాల్లోపల, సంఘాల మధ్య తలెత్తిన సమస్యలతో, అపసవ్య ధోరణులతో వ్యవహరించడానికే ఆయన చాలా విలువైన సమయం వెచ్చించాల్సి వచ్చింది. చదువు, రాత, ఇతర ముఖ్యమైన పనులకు తగిన టైం మిగిల్చుకోలేకపోయారు. అయన అలుపెరుగకుండా పని చేశారని శ్లాఘించడం, మనుషులను నిలబెట్టడానికి కృషి చేశారనడం, పొసగని మనుషులను కలపడానికి ప్రయత్నించారనడం ఆయన ఆచరణకు తగిన నివాళి అవుతుందిగాని... ఈ స్థితి ఎందుకిలా ఉంది? అని కాస్త లోతుగా ఆలోచించాలా? లేదా? అనేక మంది ఎక్కడికక్కడ చేసుకపోవాల్సిన పనుల కోసం ఆయన ఈ చివరి నుంచి ఆ చివరి దాకా రాష్ట్రమంతా ఎందుకు తిరగాల్సి వచ్చింది? తప్పక కలిసి ఉండాల్సిన నలుగురిని కలపడమే ఆయన పనిగా ఎందుకు మారింది? కేవలం అలకలు, అసంతృప్తులు తీర్చడానికి, అల్పత్వాల నుంచి పుట్టుకొచ్చిన సమస్యలను పరిష్కరించడానికే ఎందుకు గరిష్ట సమయం కేటాయించాల్సి వచ్చింది? ఎప్పుడైనా 'మీ పనులు ఏమిటండీ.. 'అంటే ఆయన కనీసం వారం పదిరోజుల వరుస పనులు, ప్రయాణాలు చెబితే ఆశ్చర్యం కలిగేది. అన్నీ ఇలాంటివే. ఆయనతో సన్నిహితంగా ఉండేవాళ్లందరూ ఇది గమనించే ఉంటారు. ఇది ఎంత బాధాకరం? దీనికి ఎవరో వ్యక్తులను బాధ్యులను చేయడం కంటే ఉద్యమ అంతర్ ప్రపంచమనే వాస్తవికతలోని ఒకానొక స్థితి అని అందరం గుర్తించాలి. ప్రసాదంగారిలాంటి సుదీర్ఘ విప్లవానుభవం ఉన్న కామ్రేడ్ ఇలాంటి స్థితితో వ్యవహరించడానికే శక్తినంతా ధారపోశారని గుర్తుకు వస్తే ఎవరికైనా బాధ కలగకపోదు. ఈ ప్రయత్నంలో ఆయన కొంచెమే సాధించి ఉండవచ్చు. అందు వల్లే ప్రజాసంఘాల కార్యక్రమాలు కొంచెం పుంజుకున్నాయి. ఈ విషయాన్ని ఇతరులు ఎంత గుర్తించారోగాని శత్రువు అయితే బాగా గుర్తించాడు. అందువల్లే హత్య చేశాడు. అంతర్గతంగా ఇప్పుడున్న స్థితి మారి ఇంతకంటే మెరుగైన స్థితిలోకి వెళ్లితే అది తప్పక సత్ఫలితాలనిస్తుంది. ఆపరేషన్ గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా బలమైన ఆందోళనకు సానుకూల వాతావరణం ఏర్పడుతుంది. దాన్ని మొగ్గలోనే తుంచేయడం ప్రభుత్వం లక్ష్యం. ఆ అర్థంలో ఆయన హత్య గ్రీన్‌హంట్ యుద్ధంలో భాగం.

ఈ రెండో తలంలో ఆయన చేస్తున్న కృషిని అడ్డుకోడానికే ఈ హత్య చేశారని అంటే కాదనేవాళ్లూ ఉండవచ్చు. అయినా ఈ హత్యా సందర్భంలో శత్రువును ఎండగట్టడంతోపాటు.... మన శిబిరంలోని ఈ స్థితిని ఏం చేయాలనే ప్రశ్న వేసుకోక తప్పదు. లేకపోతే ఈ కన్నీటికీ ఏ అర్థం ఉండదు. ఈ ఐక్యతా నినాదాలూ, ధిక్కార ప్రకటనలూ శుష్కప్రాయంగా మిగిలిపోయినట్టే. తెలిసిన విషయాలను తెలియనట్టుగా, అందరికీ సంబంధించిన స్థితికి తన ప్రమేయమేమీ లేనట్టుగా, కేవలం ఇతరుల నిర్వాకమే కారణమన్నట్టుగా వ్యవహరించడం కళ అవుతుందేగాని వాస్తవం కాదు. కళ కంటే వాస్తవమే విలువైనది.

దీనికి రాజకీయాలు పలుచన కావడం ఓ ముఖ్య కారణం. అయితే ఈ స్థితిలో ఉన్నవాటన్నిటినీ రాజకీయాలే అనడం కూడా కొంచెం కష్టమే. రాజకీయాలు మాత్రమే తొలి.. తుది ప్రాతిపదిక అయిన చోట వాద తీవ్రతతోపాటు ఒక రకమైన కాంతి, ఉత్తేజం ఉంటాయి. కానీ వాస్తవికతను, సిద్ధాంతాన్ని ఎవరి దృష్టి కోణంతో వాళ్లు చూడటం అలవాటయ్యాక ఎవరి సత్యం వాళ్లదే అవుతుంది. ఎవరిది వాళ్లకు పరమ సత్యం కావడమంటే వ్యక్తి కేంద్రం కావడమే. అందుకే రాజకీయాల ప్రాధాన్యతను నిలబెట్టడమే లక్ష్యంగా...

మనుషులను కలపడం, నిలబెట్టడం, చివరికి సంతృప్తిపరచడం కోసం విప్లవంలో ఇంత యాతన పడాల్సి ఉంటుందా? అనడానికి ప్రసాదంగారి ఆచరణ ఉదాహరణ.

ప్రసాదంగారిలాంటి బహుముఖీనమైన, విస్తారమైన సామాజిక జీవితం ఉన్న వ్యక్తుల గురించిన వివరాలు మరణానంతరమే ఎక్కువగా తెలిసే అవకాశం ఉంది. ఇది మామూలే. అయితే మనతో కలిసి పని చేస్తున్నప్పుడు అర్థం కాని విలక్షణత, విశిష్టత.. మరణం తర్వాతే అర్థమవుతున్నాయా? ఇందులో ఏమైనా సమస్య ఉన్నదా? ఇది కేవలం సమాచారానికి సంబంధించిందేనా? మనిషి పట్ల, సంబంధాల పట్ల, ఆచరణ పట్ల ఒక తాత్విక దృక్పథంతో అంచనా లేకుండా ఆయా స్థల కాలాల ప్రభావంతో, వొత్తిడితో, ఆవేశకావేశాలతో అర్థం చేసుకున్నామా? అనే ప్రశ్న వేసుకుంటే ఎలా ఉంటుంది? మనుషులతో సంబంధాల్లో, అంచనాల్లో ఆవేశకావేశాలు.. తక్షణ ఒత్తిళ్లూ కొంచెం ఉండేవేగాని దీర్ఘకాలికంగా, సమగ్రంగా, ఆవేశరహితంగా, ఎల్లవేళలా విమర్శనాత్మకంగా చూడటానికి మన దగ్గర ఏమైనా సాధనం ఉందా? అలాంటి లోతైన, గాఢమైన అర్థాన్ని మనుషుల మీద ప్రసరింపజేయగలమా? ఇలాంటివాటిని తగినంత సమకూర్చుకోలేనప్పుడు 'మనిషి లేనప్పుడే విలువ తెలిసేద'నే నానుడిని నిజం చేసినవాళ్లమవుతాం. జనాంతిక వైఖరులు మార్క్సిస్టుల్లోకి జొరబడితే జరిగే నష్టం గురించి ప్రత్యేకంగా చెప్పుకోనవసరం లేదు. నిజానికి ఇది ఆ వెళ్లిపోయిన మనుషులకు, మిగిలి ఉన్న మనుషులకు(మనకు) సంబంధించిన సమస్య మాత్రమే కాదు. అసలు ఆ స్థితే ఎంత ప్రమాదకరమో సహనంగా ఆలోచించక తప్పదు.

* * *

ప్రసాదంగారికి తనదైన పని ప్రాధాన్యత ఉండేది. ఆయన మనసులో పడిపోయిన పనులపట్ల ఉన్న ఆసక్తి ఎప్పటికప్పుడు ఎదురెక్కి వచ్చే కొన్నిటిపట్ల ఉండేది కాదు. కానీ ఆయనను అన్ని పనులూ, అన్ని రకాల స్థితులూ, అందరి అవసరాలూ వెంటపడేవి. వీటన్నిటితో వ్యవహరించేటప్పుడు సంతోషమైనా, కోపమైనా, చిరాకు అయినా ఆయన సంపూర్ణంగా వ్యక్తం చేసేవారు. అది ఆయన ముఖకవళికల్లో, భాషలో ఏ దాపరికం లేకుండా బైటపడేది. అయితే అందులోని ఉచితానుచితాల గురించి ఆయనకు చాలా అప్రమత్తత ఉండేది. క్షణాల్లోనే దాన్ని గుర్తించి సవరించుకొనేవారు. ఏ భేషజాలూ లేకుండా అంగీకరించేవారు. ఇలాంటి వాటిని వాదన దాపున దాచుకోవాలని ఆయన ఎన్నడూ ప్రయత్నించలేదు. ఆయనకు చాలా ఇంప్రెషన్లు ఉండేవి. కానీ వాటిని ఆయన శాశ్వత సత్యాలుగా భావించేవారు కాదు. వాటిని గెలిపించుకోడానికి వాదనను పేర్చేవారు కాదు. అన్నిటి కంటే ఆయనలోని సుగుణం ఏమంటే- తాను కేంద్రంగా ఆయన దేన్నీ పట్టుకొని వేలాడేవాడు కాదు. ప్రతివాళ్లలో తాము కేంద్రంగానే ఆలోచించడం అనే స్వభావం ఉండేదే. బహుశా దీన్ని సబ్జెక్ట్-ఆబ్జెక్ట్ సంబంధంలో గుర్తించవచ్చు. కానీ ప్రసాదంగారు తన స్వభావానికి, విప్లవ అవసరానికి మధ్య ఉండే తేడా గుర్తించడమేగాక,.. చైతన్యయుతంగా దాన్ని భర్తీ చేసుకోడానికి ప్రయత్నించేవారు.

స్వభావాలే పని పద్ధతులను నిర్ణయిస్తున్న ఈ తరుణంలో ప్రసాదంగారు ఉద్యమానికి చాలా అక్కరగా నిలిచారని శత్రువు గుర్తించి ఆయనను మనకు లేకుండా చేశాడు. దేన్నయినా తమ వైపు నుంచి మాత్రమే చూస్తూ, నిలువెల్లా ఫిర్యాదులను, అసంతృప్తులను మోసుకతిరుగుతున్న ఈ వర్తమానంలో ప్రసాదంగారు ఇంకొంత కాలమైనా జీవించి ఉంటే బాగుండేది. తాము మాత్రమే సత్యం, శుద్ధం అనే ధోరణి పతాక స్థాయిలో ఉన్న ఈ తరుణంలో.. దీనిపై విమర్శ పెట్టగల జీవన విధానాన్ని ఎంచుకున్న ప్రసాదంగారు లేకపోవడం చాలా పెద్ద వెలితి. ఉద్యమాలకు ఆయన లేని వెలితిని ఈ కోణంలో చూడకపోవడం కూడా వెలితిగా మిగులుతుంది.

తనపై అనేక కోపతాపాలను గుమ్మరించినా.. ఆయనా తన సహజ శైలిలో అంతే తీవ్రంగా స్పందించేవారు. మళ్లీ ఎలా ఆలోచించాలో, ఏం చేయాలో అదే చేయడం కూడా ఆయనకు అత్యంత సహజం. ఎవ్వరి కోపాన్నీ, విమర్శనూ మనసులో దాచుకోకపోవడం చూస్తే అబ్బురం కలిగేది. ఇదీ ఆయనకు సహజ లక్షణమా? లేక ఉద్యమ అవసరం కోసం అందరినీ, అన్నిటినీ భరించేవారా? అని ఇప్పుడు సందేహం కలుగుతోంది. ఎందుకంటే- ఉద్యమం కోసమే రాస్తున్నామని, పని చేస్తున్నామని చెప్పుకొనే మనలో చాలా మందిమి ఏనాటి తగాదాలనో, కంప్లైంట్స్‌నో, హర్టింగ్స్‌నో మోసుకతిరుగుతూ ఉండగా... ఆయన వాటిని పట్టించుకోకపోవడం స్వభావం అనడం కంటే ఉద్యమం కోసం అనడమే ఆయనను సరిగా అర్థం చేసుకున్నట్టవుతుంది.

ప్రసాదంగారు కూడా తన స్వభావం వల్ల.. తొలి స్పందనలో కొందరినైనా కష్టపెట్టి ఉండవచ్చు. కానీ ఆయన దాన్ని వెంటనే గుర్తించడంలో, ఇతరుల వల్ల తనకు కలిగిన కష్టాన్ని పట్టించుకోకపోవడంలో ఉద్యమ ప్రయోజనమే దాగి ఉంటుంది. ఏ కష్టాలనైనా, నష్టాలనైనా, ఏ ప్రయోజనాలనైనా పూర్తిగా 'నేను' వైపు నుంచి మాత్రమే చూసే ధోరణి నుంచి బయటికి వస్తామని ప్రసాదంగారికి ఏమైనా హామీ ఇవ్వగలమా? అనేది చాలా ముఖ్యం. మనుషులతో శాశ్వత వైరం పాటించడమే ఒక రకమైన జీవన విధానంగా, ఆలోచనా సంస్కృతిగా వర్ధిల్లుతున్న చోట ఈ భరోసా మనకు మనమైనా ఇచ్చుకోకుండా రాజ్యహింసను వ్యతిరేకిస్తామని, సమాజ పరివర్తనలో భాగమవుతామని అనడంలో ఏదో అపధ్వని వినిపిస్తుంటుంది. అంతకు మించి ఈ స్థితి గురించి ఏమనుకుంటున్నాం? దీన్ని అర్థం చేసుకోడానికి ఇప్పుడు మన దగ్గర ఉన్న కొలమానాలకంటే కొత్తవి ఏమైనా సంపాదించుకోవడం సాధ్యమవుతుందా? అనేది అన్నిటికంటే ప్రధానం.

ప్రసాదంగారు తనకు సంతృప్తి కలిగేలా ఎక్కడైనా ఒక ప్రసంగం చేసినా, ఒక మంచి కరపత్రం రాసినా దాని గురించి సందర్భం వస్తే తప్పక ప్రస్తావించేవారు. ఒక్కోసారి అందులో కొంచెం గుర్తింపు కాంక్ష ఉందా? అనిపించేలా ఆయన ఆ సంగతి చెప్పేవారు. కానీ తన భావాలను పరిచయం చేయడం, వాటిని చెక్ చేసుకోవడం, అభిప్రాయం తెలుసుకోవడమే ఆయనకు ముఖ్యం. గుర్తింపు కోసమే ఆయన ఏ పనీ చేయలేదని ఆయన తరపున ఎవ్వరైనా గట్టిగా చెప్పవచ్చు. తనకు మావోయిస్టు గుర్తింపు అంతగా ఉన్నప్పటికీ బహిరంగ జీవితంలో కూడా విప్లవోద్యమానికి అవసరమైన.. ఏ గుర్తింపూ లేని పనులే ఆయన చాలా ఎక్కువగా చేశారు. ఆయన గురించి ఇలాంటివి ఎన్నయినా చెప్పుకోవచ్చు. నిజానికి ప్రసాదంగారి గుణగణాలను లెక్కించడం కంటే, ఆయన ఆదర్శాలను ఎత్తిపడతామని

(మిగతా 59వ పేజీలో...)

# వ్యక్తులకంటే, విప్లవ తాత్వికత, విలువలు ఉన్నతమైనవి

## — కా. గంటి ప్రసాదం చివరి ప్రసంగం

*(కా. ఆలూరి భుజంగరావు సంస్మరణ సభ 3-7-2013న గుంటూరులో జరిగింది. అందులో కా. గంటి ప్రసాదం ప్రసంగించారు. మరుసటి రోజు అంటే 4వ తేదీన నెల్లూరులో జరిగిన సభలో కూడా భుజంగరావు గారిని గురించి ప్రసంగించారు. ఆ ప్రసంగం చేసిన అతికొద్ది సమయానికే ఆయన అమరులయ్యారు. అయితే ఆ ప్రసంగం రికార్డు కాలేదు. ఇది గుంటూరు సభలో ఆయన చేసిన ప్రసంగాన్ని రికార్డుచేసి రాసిన ప్రసంగ పాఠం. కా. గంటి ప్రసాదం చేసిన చిట్టచివరి ప్రసంగంగా భావించవచ్చు.)*

కామ్రేడ్స్, ఇంతకు ముందు మాట్లాడిన వక్తలు భుజంగరావుగారి జీవితం గురించి ఆయన రచనా సరళి గురించి ఆయనను అతి దగ్గర నుండి చూసి విరసం పక్షాన మాట్లాడారు. నాకు భుజంగరావు రచనా వ్యాసంగంతోకాని, నిర్మాణ వ్యవహారాల గురించికాని దగ్గర సంబంధాలు లేవు. ఆ కారణంగా కేవలం ఆయన రచనా వ్యాసంగం గురించి మాట్లాడడం అంటే చర్విత చరణమై కాలయాపన అవుతుంది. భుజంగరావుగారి అనువాదాలు, పాత తరాన్ని బాగా ప్రభావితం చేశాయి. నేను కూడా అలా ప్రభావితుడనయ్యాను. వాస్తవానికి అవి అనువాదాలు అని చెప్తేగాని ఎవరికీ అవి అనువాదాలు అనిపించవు. మూలరచనలు చదివిన వాళ్ళకు మాత్రమే అది అనువాదం అని తెలుస్తుంది. అలా అనువదించగలగటం కేవలం అనువాదకుడి ప్రతిభ మాత్రమే కాదు. మూల రచనలోని విషయంతో తాదాత్మ్యం చెందడం, మమేకం అయిపోవడంలో ఆ విశిష్టత వుంది. భుజంగరావు గారు అలాంటి మమేకత్వానికి లోనై అనువదించారు కాబట్టే ఆ గ్రంథాలు అంతగా ప్రభావితం చేశాయి.

భుజంగరావు గారు ఇంకా మన మధ్య ఉండాల్సిన అవసరం వుంది. ఆయన వయస్సురీత్యా మరికొద్ది కాలం జీవించే అవకాశం వుంది. 80 సంవత్సరాల మన్మోహన్ సింగ్, 86 సంవత్సరాల అద్వానీ, 95 సంవత్సరాల వాజ్‌పాయి ఇంకా బతికే ఉన్నారు. ప్రశాంతమైన, ఆర్థిక పరిపుష్టిగల వాతావరణంలో బతికిన మనిషి జీవిత కాలం ఈ రోజుల్లో 95 నుండి 100 సంవత్సరాల వరకు ఉంది.

భుజంగరావు గారు మన మధ్య లేకపోవడం ఒక వెలితి, ఒక లోటు, ఒక వ్యాకులత. ఇదంతా దేనికి సంబంధించినది. ఆయనతో సాన్నిహిత్య సంబంధాలు, పరిచయాలు ఉన్నవాళ్ళకు సంబంధించినది. ఆయన ఏ ఆశయాల కోసం బతికాడో, ఏ ఆశయాల కోసం ఉద్యమించాడో, వాటికి సంబంధించిన వెలితిగా మాత్రం భావించకూడదు. అలా అనుకోవడం అంటేనే ఆయన కృషిని మనం నిజంగా గుర్తించలేదని అర్థం. ఫలానావారు చనిపోతే, ఫలానా రంగానికి వెలితి ఏర్పడిరదని సహజంగానే అంటాం. అది పూడ్చలేని వెలితి అని కూడా అనుకుంటాం. అది సరికాదు. మనం అనుకునే వెలితి ఏమిటంటే, ఆయనతో మనకున్న సాన్నిహిత్యం, దగ్గరితనం, అనుభవాలు. ఆయన లేనితనాన్ని, దూరాన్ని కొంతకాలం మనం ఫీలవుతాం. మామూలుగా ఒక మనిషి జీవితం వంద సంవత్సరాలు అనుకుంటే భుజంగరావు గారు కొన్ని వేల సంవత్సరాల బతుకు బతికి వెళ్ళిపోయారు. అందుకని ఆయనది అకాల మరణం అని గాని, వెలితి అనిగాని మనం అనుకోరాదు.

భుజంగరావుగారి గురించి మనం ఏవి మననం చేసుకోవాలి, ఏవి చేసుకోగలం అనే ఆర్తి మనల్ని ఇక్కడకు తీసుకువచ్చింది. ఆయన రచనల గురించి కొటేషన్లతో కళ్యాణరావుగారు పరిచయం చేశారు.

చరిత్ర అంటే వ్యక్తుల చరిత్ర కాదు. అది భుజంగరావు గారు కాని, మనం కాని. కొంత మంది జీవితాలు అసలు చరిత్రే కాదు. కాని వారి జీవితాలు కూడా పూసల్లో దారంలాగా చరిత్రలో కలిసే వుంటాయి. కొంత మంది వ్యక్తులు చరిత్రలో విడదీయరాని భాగం అయిపోతారు. ఎవరు వాళ్ళు? చరిత్ర తాలూకు సహజ సిద్ధమైన గతి సూత్రాన్ని అర్థం చేసుకున్నవాళ్ళు. ఇది మొదటి లక్షణం. ఆ అర్థం చేసుకున్న దానితో కలసి తాను కూడా అడుగులు కలిపి నడవాలనుకునే వాళ్ళు, తన సర్వశక్తులు ఒడ్డి, నిజాయితీగా అట్లా నడవటానికి ప్రయత్నించిన వాళ్ళు.

భుజంగరావు గారు మనకందరికీ వదిలిపెట్టి పోయిన సంపద ఏమిటంటే, ఆయన రచనా వ్యాసంగం, ఆయన జీవితం, ఆయన రాజకీయ కార్యాచరణ. ఈ మూడూ ఆయన జీవితంలో విడదీయటానికి వీలు లేనంతగా సమపాళ్ళలో పెనవేసుకపోయాయి. ఆయన జీవితాన్ని ఆదర్శంగా స్వీకరించడం అంటే ఏమిటి? గొప్ప ఆలోచనలు, గొప్ప ఆశయం, గొప్ప లక్ష్యం కలిగి ఉండటమే భుజంగరావు జీవితం కాదు. అందుకు తగ్గట్టుగా నీవు కూడా శక్తివంచన లేకుండా దానికి ప్రాతినిధ్యం వహించే మనిషిగా వ్యక్తమవుతూ ఉండాలి. నీ వ్యక్తిగత జీవితంలో, నీ ఆచరణలో, నీవు ఎంచుకున్న కార్యక్షేత్రంలో ఆ నడకను ప్రతిబింబిస్తూ ఉండాలి. అలా ఉన్నటువంటి వాళ్ళే చరిత్రలో నిలబడి పోతారు.

ఒకసారి మనం చరిత్రలోకి వెళ్ళిచూస్తే విప్లవానికి మార్గదర్శకత్వం వహించి, దాన్ని విజయవంతం చేయడం ద్వారా మాత్రమే ఎవరూ గొప్పవాళ్ళు అయిపోరు. ఒక లెనిన్‌నుగాని, స్టాలిన్‌ను గాని, మావోను గాని చూస్తే వాళ్ళు గొప్ప విప్లవకారులు మాత్రమే కాదు. గొప్ప వ్యక్తులు కూడా అని మనం అర్థం చేసుకోవాలి. స్టాలిన్‌కు ప్రపంచం అంతటా విశేషమైన ఆదరాభిమానాలున్నాయి. కాని ఆయన చాలామంది చేత తీవ్రమైన విమర్శలకు కూడా గురయ్యాడు. చరిత్ర కొందరు వ్యక్తులపట్ల, కొన్ని ఘటనలపట్ల, సందర్భాలపట్ల, దయారహితంగా, అమానవీయంగా ఉంటుంది. స్టాలిన్ రాజకీయమూర్తిమత్వాన్ని ఎక్కడ చూడాలి? కేవలం ఆయన విప్లవ దార్శనికతలోను, మార్గదర్శకత్వం లోను మాత్రమే కాదు.

ఆయన్ను అర్థం చేసుకోవాలంటే ఆయనకు సంబంధించిన కొన్ని జీవిత శకలాలను కూడా మనం చదవాలి. ఆయన గొప్ప నాయకుడు ఎలా అయ్యాడు అంటే అతడు వ్యక్తిగతంగా కూడా ఉన్నతుడు కాబట్టి. ఈ ఔన్నత్యానికి గీటురాయి ఏమిటి? ప్రపంచంలో చాలా మంది చాలా చాలా చెప్పవచ్చు. కానీ అత్యంత శాస్త్రీయమైన గీటురాయి ఏమిటంటే ప్రజలను ప్రేమించడం, ప్రజలకు సేవ చేయడం, ప్రజల కోసం బతకడం, ప్రజల కోసం చనిపోవడం - అంతకు మించిన ఔన్నత్యం ఏదీ ఉండదు.

స్టాలిన్ రష్యా కోసం, రష్యన్ ప్రజల కోసం, ప్రపంచ ప్రజల కోసం, ఫాసిజాన్ని ఓడించడం కోసం, ఫాసిజం బారినుండి ప్రపంచాన్ని రక్షించడం కోసం గొప్ప ప్రతిభను ప్రదర్శించాడు. ఇవన్నీ అందరికీ తెలిసిన విషయాలే. కానీ అతను వ్యక్తిగతంగా గుండెకోతను భరించడానికి కూడా సిద్ధమయ్యాడు. అతడి ఔన్నత్యాన్ని అర్థం చేసుకోవడానికి ఒక సన్నివేశం చెబుతాను. రెడ్ ఆర్మీలో అతి కింది స్థాయిలో పనిచేస్తున్న స్టాలిన్ కొడుకును శత్రువులు పట్టుకున్నారు. రష్యన్ సైనికుల చేతుల్లో బందీగా ఉన్న తమ కమాండర్‌ను వదిలిపెడితే స్టాలిన్ కొడుకును వదిలిపెడతామని శత్రువులు బేరం పెట్టారు. స్టాలిన్ అనుయాయులు వాళ్ళడిగిన వాడిని ఇచ్చేసి మన మనిషిని తెచ్చుకుందాం అన్నారు. దీనికి స్టాలిన్ అంగీకరించలేదు. ఈ సంఘటనను ఆయన ఎలా అర్థం చేసుకున్నాడు. దీన్ని ఆయన తన ప్రతిష్ఠకు సంబంధించిన అంశంగా చూడలా. తాను లక్ష్యంగా పెట్టుకున్న విప్లవ నిర్మాణంలో, సోషలిజం నిర్మాణంలో, ప్రపంచాన్ని పునర్నిర్మించే బృహత్ కర్తవ్యంలో భాగంగా చూశాడు. అంటే మనం నమ్మిన మూల సిద్ధాంత రాజకీయాల గొప్పదనం మన జీవితాల్లోనూ, వ్యక్తిత్వంలోనూ, రాజకీయాలలోనూ ప్రతిబింబించాలి. అందులో మనం మమేకం అయినప్పుడే అది అలా ప్రతిబింబిస్తుంది.

మావో జీవితం నుండి ఒక ఉదాహరణను చూద్దాం. మావో కుమార్తె హాస్టలులో ఉండేది. ఒక పర్యాయం ఆమె ఇంటికి వచ్చినపుడు అదే పనిగా తింటూ ఉండటాన్ని మావో చూశాడు. తిండిలేక ఆ పిల్ల బాధపడటాన్ని ఆయన అర్థం చేసుకున్నాడు. కళ్ళవెంట నీళ్ళొచ్చాయి. కాని ఆమె తింటున్నది నిజానికి సైనికులకు ఉద్దేశించబడిందని ఆయన గుర్తుకు తెచ్చుకున్నాడు. ఆమెను వెంటనే హాస్టలుకు పంపించివేశాడు. ఇది చిన్న విషయమా! మావో ఆ పిల్లను పట్టించుకోలేదని అర్థమా! కాదు.

మనం ఇతరులను మాటలద్వారా గాకుండా, మన జీవితంద్వారా, మన ఆచరణద్వారా శక్తివంతంగా ప్రభావితం చేయగలం. అలా ప్రభావితం చేయగలిగిన అనేకానేక లక్షణాలు భుజంగరావు గారిలో ఉన్నాయి. వాటిని మనం స్వీకరించాలి. ఈ మధ్య కాలంలో ఒక తరానికి చెందిన వ్యక్తులు, విప్లవోద్యమంలో భాగం కావడం ద్వారా మాత్రమే, మమేకం కావడం ద్వారా మాత్రమే, మనల్ని ప్రభావితం చేశారు. వెంకటసుబ్బయ్య గారు, గోరు మాధవరావు గారు, భుజంగరావు గారు - అలాంటి వాళ్ళే.

వీళ్ళ గురించి, వీళ్ళ ప్రభావాలను గురించి మాట్లాడుకోవాలంటే ముందు ఒక విషయం మాట్లాడుకోవాలి. చారుమజుందార్, సత్యం, కైలాసంల నుండి ఆజాద్, కిషన్‌జీ, భుజంగరావుల దాకా ఇప్పటికీ విప్లవం పరిపూర్తి కాలేదు. విప్లవ లక్ష్యం నెరవేరలేదు. ఇప్పుడర్థం చేసుకోవాల్సింది ఏమిటంటే వాళ్ళు కాని వాళ్ళ వ్యక్తిత్వంగాని మనకు ఏమి అందిస్తున్నవి. ఏ విలువల్ని అందిస్తున్నాయి. ఆ విలువల్ని అర్థం చేసుకోవడం, ఆవాహన చేసుకోవడం మన బాధ్యత. మన నుంచి వాళ్ళు కోరుకున్నదదే. అది వాళ్ళు మన మీద పెట్టిన బాధ్యత. అత్యంత సంక్లిష్టమైన విప్లవ వాతావరణంలో ఉన్న మనం విప్లవం ముందుకు వెళ్ళడం, ప్రతిష్టంభనకు గురికావడం. యుద్ధం, దాని కర్కశత్వం, తీవ్రత, వీటన్నిటి మధ్యా నిలబడి ఆ బాధ్యతను నెరవేర్చాలి. ముందుకు తీసుకువెళ్ళాలి.

విప్లవం విజయవంతం అవుతుందా, రేపు అవుతుందా, ఎల్లుండి అవుతుందా, అసలు అవుతుందా అన్నది వాళ్ళు దృష్టిలోనే పెట్టుకోలేదు. ప్రజలకు విప్లవ అవసరం ఉంది అనుకున్నారంతే. అదొక వాస్తవికత. విప్లవ వాస్తవికత ఏమిటంటే రోజు రోజుకు ఈ దేశంలో పరిస్థితులు విప్లవానికి అనుకూలంగా మారుతున్నాయి. దోపిడీ పాలక వర్గాలు అనుక్షణం ప్రజల్ని అణచివేస్తున్నాయి. అదే సమయంలో రాజ్యం మట్టికాళ్ళ మహారాక్షసి అనేది కూడా ఒక వాస్తవం. ఇది విప్లవ వాస్తవికతకు ఒకవైపు అయితే, దానికి మరో పార్శ్వంకూడా ఉంది. విప్లవంలో ఉన్న వాళ్ళకు కూడా కొన్ని సందేహాలు, కొన్ని నిరాశలు కలిగించే అంశాలు అందులో భాగం. వీటన్నిటిమధ్య భుజంగరావుగారి లాంటి వాళ్ళు ఒక విప్లవ తాత్వికతకు ప్రతినిధులుగా ఉన్నారు. మనం దాన్ని వాళ్ళనుండి అర్థం చేసుకోవాలి. దాన్ని నిలుపుకోవాలి.

విప్లవ తాత్వికత అంటే ఏమిటి? విప్లవం ఎలా వెళ్తూ ఉంది? ఎంత తీవ్రతతో వెళ్తూ ఉంది అన్నది కాదు. విప్లవోద్యమం బలపడుతుందా, ఏ మేరకు బలపడుతుంది, ఏ మేరకు వర్గ శత్రువును బలహీన పరుస్తున్నది అన్నది కూడా కాదు. నక్సల్‌బరీ వెనకతట్టు పట్టింది. జగిత్యాల వెనుకతట్టు పట్టింది. కాని ఈ వేళ దండకారణ్యం మండుతూ ఉంది. భుజంగరావుగారిలాంటి వాళ్ళు గుర్తించినదేమిటంటే ఈ దేశంలో విప్లవం ప్రజలకు అవసరం. మనం ఆ పక్షాన ఉండవలసిందే అని. అదే విప్లవ తాత్వికత. దాన్ని మనం హృదయానికి హత్తుకోవాలి.

ఇది కేవలం తాత్వికతకు సంబంధించిన విషయమే కాదు. విలువకు సంబంధించిన విషయం కూడా! ఏమిటా విలువ? ప్రజలకు జవాబుదారీతనం. ఎంతటి నిస్సహాయ పరిస్థితులలోనైనా, అననుకూల పరిస్థితులలోనైనా నువ్వు నిలబడాల్సింది ప్రజల పక్షాన, ప్రజల పోరాటాల పక్షాన. ఇందులో ఏమరుపాటు ఉండకూడదు. ప్రజలకు విప్లవం అవసరం కనుక అది విజయవంతమై తీరుతుంది. ఏ రోజుకైనా నీదే విజయం. అది వాళ్ళు మనకందిస్తున్న చైతన్యం.

పోరాటాల గురించి, రాజకీయాల గురించి, నీతి నిజాయితీల గురించి మాట్లాడుకుంటే చాలదు. సామ్రాజ్యవాదం చివరి ప్రయత్నంగా అత్యంత దుర్మార్గమైన దోపిడీ అణచివేతలకు పాల్పడుతోంది. ఇలాంటి సందర్భంలో వాళ్ళందించిన విప్లవ తాత్వికతను, ఆచరణను మనం ముందుకు తీసుకువెళ్ళాలి. భుజంగరావుగారి రచనలను అర్థం చేసుకొని సామ్రాజ్యవాద విష సంస్కృతి నుండి మనల్ని మనం ప్రక్షాళనం చేసుకోవాలి. వాళ్ళ విప్లవ వ్యక్తిత్వాలు మనల్ని కాపాడుతాయి, నిలబెడతాయి.

***విప్లవ రచయితల సంఘం, గుంటూరు*** 

సంస్మరణ



# విప్లవోద్యమ కళాకారుడు రామాంజనేయులు స్మృతిలో...

- కె. నాగేశ్వరాచారి

అనంతపురం జిల్లా సృజనాత్మక కళాకారుణ్ణి కోల్పోయింది. సామ్రాజ్యవాద భూస్వామ్య శక్తులు ప్రజాకళాకారుణ్ణి పొట్టన పెట్టుకున్నాయి. ఆ విప్లవ కళాకారుణ్ణి పోలీసులు చిత్రహింసల పాల్జేసి అత్యంత క్రూరంగా నరికి కాల్చి చంపారు. కామ్రేడ్ రామాంజనేయుల్ని ఎన్ని చిత్రహింసలు పెట్టినారో ఆయన మృతదేహాన్ని చూస్తే అర్థమౌతుంది. కామ్రేడ్ రామాంజనేయులు కేవలం విప్లవకారుడే కాదు. కళాకారుడు కూడా. 1980వ దశకంలో ప్రజా సంఘాల్లో పనిచేసే వారికి ఆయన గానమాధుర్యం వసంత మేఘ గర్జనలా ఉత్తేజపరిచింది. 2005 జూలై 14న ఆయన మరణ వార్త విప్లవోద్యమ అభిమానులకు, కార్యకర్తలకు, కళాకారులకు అశనిపాతమైంది. ఒక గొప్ప కళాకారుణ్ణి విప్లవ ఉద్యమం కోల్పోయింది.

అనంతపురం జిల్లాలో జానపద కళలకు, కళాకారులకు కొదువ లేదు. ఇక్కడి తోలుబొమ్మలాట కళాకారులు దేశ వ్యాప్తంగా పరిచితులే. 'అంటరాని వసంతం' నవలలోని ఉరుముల ఎల్లన్న ఈ జిల్లాలోని ధర్మవరం నుంచి ప్రకాశం జిల్లాకు వలస పోయినవాడే. రాష్ట్రంలో మరెక్కడా లేని ఉరుముల వాయిద్య కళాకారులు ఈ జిల్లాలోనే ఉన్నారు. ఈ కళలతోపాటు ఈ జిల్లాలో కోలాటం కూడా జానపద కళల్లో ఒకటి.

పండుగ దినాల్లో, వెన్నెల రాత్రుల్లో గతంలో గ్రామాల్లో కోలాటం ఆడేవారు. పురుషులు, చిన్న పిల్లలు రకరకాల నృత్య భంగిమల్లో ఆడే కోలాటం, చెక్క భజనల నృత్య భంగిమలు చూడముచ్చటగా ఉంటాయి. ఈ భంగిమలన్నీ వ్యవసాయ పనులను తలపిస్తుంటాయి. ఇటువంటి కళారూపాల్ని రామాంజనేయులు విప్లవోద్యమ ప్రచారానికి సృజనాత్మకంగా మలచుకున్నాడు.

అనంతపురం జిల్లాలోని విప్లవోద్యమ కేంద్రాలలో గూనిపల్లి గ్రామం ఒకటి. రామాంజనేయులు పుట్టి పెరిగిన ఈ గ్రామంలోనే చిన్ననాడు కోలాటం నేర్చుకున్నాడు. అతనికి కోలాటమంటే ఇష్టం. ఎన్నో గ్రామాలు తిరిగి కొత్త నృత్య భంగిమల్ని, పాటల్ని నేర్చుకున్నాడు. ఈ ఉత్సాహం ఆయనను కోలాటపు మాస్టర్ని చేసింది. జిల్లాలోని బుక్కపట్నం, పుట్టపర్తి, పెనుగొండ మండలాల్లోని గ్రామాల్లో కోలాటం నేర్పడానికి వెళ్ళేవాడు. ఆయన గొంతెత్తి పాడితే పాటలో శ్రోతలతోపాటు తాను ఉత్తేజితుడు అయ్యేవాడు. గాత్ర మాధుర్యంతో భావాల్ని రాగంలో అలవోకగా పలికించేవాడు. విప్లవ రాజకీయాల్లో పాల్గొన్న తరువాత అదే బాణీని కోలాటం వేస్తూ రాజకీయ ప్రచారం చేసేవారు. అనంతపురం జిల్లాలో వీరుడమ్మా నాగిరెడ్డి శూరుడమ్మా నాగిరెడ్డి చుట్టుముట్టు పల్లెలకల్లా శూరుడమ్మా నాగిరెడ్డి అనే పాట అనాదిగా వస్తూనే ఉంది. రామాంజనేయులుకు విప్లవ రాజకీయాల్లో పాల్గొనక ముందు తరిమెల నాగిరెడ్డిని గురించి బహిరంగ సభల్లో జరిగే ప్రాంతాల్లో రామాంజనేయులు కోలాటమాడుతూ ఈ పాటల్ని పాడి జనాన్ని ఉత్తేజపరిచేవారు.

విప్లవ కళాకారులు పాడుకునే పాటలన్నీ జానపద బాణీయే. ఆ బాణీల్లోనే విప్లవ సందేశాన్ని సృజనాత్మకంగా ప్రజలకందించిన కళాకారులు రామాంజనేయులు.

పెరుగుతున్న ధరలకు వ్యతిరేకంగా 80వ దశకంలో జన నాట్యమండలి *'ఏం గొనేటట్లు లేదు ఏం తినేటట్లు లేదు నాగులో నాగన్న ధరలిట్లా మండిపోయె నాగులో నాగన్నా'* అనే పాటలో దొంగవ్యాపారుల్ని ఎండగట్టింది. ఆ రోజుల్లో సామాన్యున్ని బాగా ఆకట్టుకున్న పాటల్లో ఇదొకటి. కామ్రేడ్ రామాంజనేయులు దళ సభ్యుడిగా కోలాటం మాస్టారు ముసుగులో ఈ పాటను కోలాటంలో పాడి జనాన్ని చైతన్యపరిచేవారు. ఇదే కాకుండా ఇటువంటి పాటలనెన్నింటిలో కోలాటం ద్వారా విప్లవ రాజకీయాల్ని పాడి ప్రచారం చేసిన కళాకారుడు ఈయన. బాలబాల గ్రామంలో నెల రోజుల పాటు జరిగిన జన నాట్య మండలి శిక్షణా కార్యక్రమంలో చురుకుగా పాల్గొన్నాడు. పాటను ఉత్తేజంగా పాడడమే కాదు గాత్రంలో భావాన్ని పలికించి పాటలో జీవించేవాడని అతణ్ణి చూసిన వారంటారు. జానపద కళల్ని విప్లవీకరించడానికి ప్రయత్నం చేసిన వారిలో రామాంజనేయులది అందెవేసిన చేయి. తనకు చేయి తిరిగిన కళల ద్వారా విప్లవ సందేశాన్ని ప్రజల్లో ప్రతిధ్వనింపజేసినవారు కామ్రేడ్ రామాంజనేయులు.

పాఠశాల చదువులకే రామాంజనేయులు విప్లవ రాజకీయాల్ని ఆకళింపు చేసుకొని ప్రజా కళాకారుడైనారు. ప్రజాకళల్ని మనం సొంతం చేసుకోవాలన్న మావో పిలుపుకు ఆచరణ రూపం ఈయన. వర్గ ప్రేమ రక్త బాంధవ్యం కంటే గొప్పది. రామాంజనేయులు పది నెలల కొడుకును వదలి విప్లవోద్యమంలో మమేకమై వర్గ కసితో పోరాటంలో ఐక్యమయ్యారు. జిల్లా ఒక గొప్ప కళాకారుణ్ణి, పోరాట యోధుణ్ణి కోల్పోయింది. ఆయన గళం పీడిత ప్రజల గుండెల్లో ప్రతిధ్వనిస్తూనే ఉంది.



---

*(56వ పేజీ తరువాయి...)*

ప్రతిజ్ఞ చేయడం కంటే.. ఆయన మరణ సన్నివేశంలోని లోతైన అర్థాన్ని గుర్తించడం చాలా ముఖ్యం. రాజ్యం, వ్యవస్థ ఏమవుతున్నాయో మనందరికీ చాలా వరకు తెలుసు. మనుషులు ఏమవుతున్నారు? అనేదే ఎంతకూ తేలని ప్రశ్న. ఆ మనుషుల్లో మనమూ ఉన్నామని ఎవరంతకు వాళ్లు గుర్తించడమే సమాధానం. మనమెప్పుడూ వ్యవస్థలోని మంచి చెడ్డలను, ఇతరుల్లోని మంచి చెడ్డలను ఎంచుతూ ఉంటాము. అది అత్యవసరమే. మనలోని మంచి చెడ్డలను కూడా ఎంచుకోగలిగే రోజు కోసం కనీసం ఎదురు చూడటమే ఇప్పటికి ప్రసాదంగారికి ఘనమైన నివాళి.



పుస్తక పరిచయం



# కళా పిపాసి డావిన్సీ బతుకు చిత్రం

- కె.వి. రమణకుమార్

నిత్య జీవితంలో మనం రోడ్లపైన, పత్రికల్లో, మరెన్నోచోట్ల ఎన్నో చిత్తరువులు చూస్తుంటాం. కానీ కొన్ని మాత్రమే మనకు నచ్చుతాయి. ఎందుకు నచ్చుతాయంటే మనం కోరుకునేదీ, మన మనసుకు దగ్గరగా ఉండేదీ వాటిలో ఉంటుంది కాబట్టి. ప్రపంచవ్యాప్తంగా కోట్లాదిమందికి నచ్చే చిత్రాలు కొన్ని ఉన్నాయి. వాటిలో విశ్వవిఖ్యాత ఇటాలియన్ చిత్రకారుడు లియొనార్డో డావిన్సీ (1452-1519) వేసిన 'మోనాలిసా' చిత్రం ఒకటి. ఆ చిత్రం ఎలా ఉంటుందో తెలిసినా, తెలియకున్నా దాని పేరు, దానిపై రాసిన పాటలు చాలా మంది తెలుగువారికి పరిచయమే. వారికి బాగా పరిచయమున్న పాశ్చాత్య చిత్రాల్లో బహుశా ఈ చిత్రమే తొలి స్థానంలో ఉంటుందేమో. ఆ కవితాత్మక వర్ణచిత్రం డావిన్సీ కళా హృదయానికి మచ్చుతునక. సార్వజనీనమైన మానవీయ స్పందనలు, కళాభివ్యక్తులు ఆ చిత్రానికి అంత పేరు తెచ్చాయి. అంత గొప్ప చిత్రాన్ని తీర్చిదిద్దిన డావిన్సీని పి. మోహన్ రాసిన 'డావిన్సీ - కళ, జీవితం' మనకు ఒక సచిత్ర కథలా పరిచయం చేస్తుంది. డావిన్సీపై తెలుగులో వచ్చిన తొలి పుస్తకమిది. ఇందులో డావిన్సీ జీవితం, కళాప్రస్థానం, కళా చరిత్రలో అతని స్థానం, వివిధ శాస్త్రాల్లో అతని పరిశోధనలు, ప్రయోగాలు, విశ్లేషణలను రచయిత సాధ్యమైనంత మేరకు విపులంగానే వివరించారు. అయితే గణితం, ఇంజినీరింగ్, మెకానిక్స్ వంటి శాస్త్రాల్లో డావిన్సీ పరిశోధనల వివరాలు ఇందులో లేవు. ఈ శాస్త్రాలపై తనకున్న అవగాహన పరిమితి వల్ల వివరించలేకపోయినట్లు రచయిత చెప్పుకున్నారు. ఈ పుస్తకానికి ముందుమాట రాసిన ఎన్. వేణుగోపాల్ డావిన్సీ కళాసృజనకు ఆధారభూతమైన పునరుజ్జీవన యుగం నాటి రాజకీయ, ఆర్థిక, సామాజిక, మత, మేధో పరిస్థితులను క్లుప్తంగానే అయినా చక్కగా విశ్లేషించారు.

> **డావిన్సీ**
> కళ - జీవితం
> పి. మోహన్
> కాకి ప్రచురణలు
> ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో లభ్యం
> వెల : రు. 150/-
> పేజీలు : 264

రచయితలు తమ చుట్టూ ఉన్న రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక పరిస్థితులకు ప్రభావితమవుతారు. చిత్రకారులు, శిల్పులు, గాయకులు వంటి కళాజీవులు కూడా ఇందుకు మినహాయింపు కాదు. డావిన్సీ కూడా తన చుట్టూ ఉన్న సామాజిక, రాజకీయ, కళా పరిస్థితులకు ప్రభావితమయ్యాడు. వాటిని తను కూడా ప్రభావితం చేశాడు. చరిత్రలో తొలి ఆధునిక మానవుడైన డావిన్సీ నడచివచ్చిన దారులను మోహన్ అద్భుతంగా పరిచయం చేశారు. వేణుగోపాల్ అన్నట్లు 'డావిన్సీ నిరంతర నవనవోన్మేష సౌందర్యానికి ఎలుగెత్తిన మోహనగానం ఈ పుస్తకం.' వించీ దగ్గర్లో మారుమూల పల్లెలో జన్మించిన ఆ చిత్రకారుడు.. అక్రమ సంతానంగా అవమానాలను, దారిద్ర్యాన్ని ఎదుర్కొంటూనే కళలో తనదైన కవితాత్మక ముద్రను చూపిన వైనాన్నీ, ఫ్లారెన్స్, మిలాన్, రోమ్ నగరాల్లో ఫ్రాన్స్ రాజు కొలువులో గౌరవాలు పొందిన వైనాన్నీ ఆసక్తికరమైన కథనంతో వివరించారు. చారిత్రక ఘట్టాలకు అక్కడక్కడా నాటకీయ సన్నివేశాలు జోడించి ఐదు శతాబ్దాల కిందట ఇటలీ రాజ్యాల పరిస్థితులను కళ్ళకు కట్టినట్లు పరిచయం చేశారు. 300 పైచిలుకు నలుపు-తెలుపు చిత్రాలు, 17 వర్ణ చిత్రాలతో పుస్తకం సచిత్రగాథలా సాగిపోతుంది.

డావిన్సీ ఫ్లారెన్స్ నోటరీ పీయెరో కొడుకు. తల్లి కేటరినా దాసి. డావిన్సీ పుట్టాక ఆమె ఓ బడుగు జీవిని పెళ్ళి చేసుకుంటుంది. తర్వాత పీయెరో డావిన్సీని ఫ్లారెన్స్‌లోని వరొకీయో స్టూడియోలో చేరుస్తాడు. డావిన్సీ చిత్రకళ, శిల్పకళ వంటి లలిత కళల్లో తర్ఫీదు పొందుతాడు. ఫ్లారెన్స్ పాలకుడైన లొరెంజో మెడిచీ ఆదరించకపోవడంతో మిలాన్ ఆస్థానంలో చేరతాడు. యుద్ధతంత్రాల్లో తాను నిపుణుడినని చెప్పి మిలాన్ డ్యూక్ లూడొవీకో ఆదరణ చూరగొంటాడు. డ్యూక్ ప్రియురాళ్ళ చిత్రాలను కొంగొత్త శైలిలో గీస్తాడు. మిలాన్‌లోని గ్రాజీ చర్చిలో ప్రఖ్యాత 'చివరి విందు' (లాస్ట్ సప్పర్) వర్ణ చిత్రాన్ని వేస్తాడు. లూడొవీకో తండ్రి స్మారకార్థం ఒక పెద్ద గుర్రం బొమ్మను మట్టితో తయారు చేస్తాడు. దాన్ని లోహంతో రూపొందించకముందే ఫ్రెంచి సైనికులు దాడి చేసి ధ్వంసం చేస్తారు. డావిన్సీ ప్రాణభయంతో తిరిగి ఫ్లారెన్స్ వెళ్తాడు. అక్కడి పాలకులూ ఆదరించకపోవడంతో మళ్ళీ మిలాన్‌కు, మరో యుద్ధం వల్ల మళ్ళీ రోమ్‌కు వెళ్తాడు. అక్కడా అనాదరణ ఎదురుకావడంతో ఫ్రాన్స్ రాజు కొలువులో చేరి అక్కడే కన్ను మూస్తాడు. ఇంతటి సంక్షుభిత రాజకీయ, సామాజిక రంగస్థలంపై డావిన్సీ ఆటుపోట్లు ఎదుర్కొంటూనే అపురూపమైన చిత్రాలను వేశాడు. చరాచరప్రకృతిని అద్భుతమైన కవితామయ రేఖల్లో, వర్ణ చిత్రాల్లో కనువిందుగా పరిచయం చేశాడు. అనాటమీ, హైడ్రాలిక్స్, ఖగోళం, భూగర్భ శాస్త్రం వంటి ఎన్నో అంశాల్లోనూ సరికొత్త సంగతులను వెలుగులోకి తీసుకొచ్చాడు. మానవుడి శక్తి సామర్థ్యాలకు, వ్యక్తి స్వేచ్ఛకు, శ్రేయోవాదానికి పెద్ద పీట వేసిన పునరుజ్జీవన కళావిలువలకు డావిన్సీ నిలువెత్తు రూపం.

డావిన్సీ వ్యక్తిగత జీవితంలోని ఒడిదొడుకులకు అని కళకు సంబంధముందని మోహన్ చాలా లోతుల్లోకి వెళ్ళి విశ్లేషించారు. చిన్నతనంలోనే తల్లికి దూరమైన డావిన్సీ ఆమె జ్ఞాపకాల జడివానలో మేరీ, బాల ఏసుల చిత్రాలను పేగుబంధంతో రచించాడని చెప్పారు. అతని మేరీ చిత్రాల్లో ఆమె భర్త జోసెఫ్ లేకపోవడానికి డావిన్సీకి తండ్రితో ప్రేమాస్పద అనుబంధం లేకపోవడం కారణం కావచ్చని

*(మిగతా 64వ పేజీలో...)*

సీరియల్

# సూర్యుడు

- కె.వి. కూర్మనాథ్



(10)

ఆర్టిస్టు : రాయ్ లిచ్టెన్‌స్టిన్

*(గత సంచిక తరువాయి...)*

సూర్యుడికి ఎన్నో వందలమందితో ప్రత్యక్ష పరిచయాలుండవచ్చు. కానీ, వాళ్ళు ఎవరెవరో తెలుసుకోవడం ఏ ఒక్కరికీ తెలిసే అవకాశం లేదని అర్థం కావడానికి నాకెన్నో రోజులు పట్టలేదు. ఎందుకంటే, ఎవరితో మాట్లాదేవాడో, వాళ్లెపనిలో వున్నారో పక్కవాళ్ళకు తెలియనిచ్చేవాడు కాదు. బయటినుంచి తనతో మాట్లాడడానికి పిలిపించుకునేవాళ్లు బయటి వాళ్ళనే భావనే దళసభ్యులకు తెలిసేదికాదు. వాళ్లెదో పక్క ప్రాంతంలో పనిచేసే వాళ్ళుకావచ్చు అన్నట్టు వాళ్ళతో అందరిలాగే బరువులు మోయించేవాడు, అందరుచేసే పనులుచేయించేవాడు.

బయట సింపథైజర్స్‌కి కూడా ఎవరెవరు ఏయే పనుల్లో వుండేవారో తెలిసేది కాదు - అక్కడో, ఇక్కడో కొన్ని మినహాయింపులు లేవని కాదు. కానీ, అవి కేవలం మినహాయింపులు మాత్రమే.

అందుకే తనగురించి ఎవరెవరికి అంచనా వుండే అవకాశం వుందో తెలుసుకోవడం అంత సులభమైన విషయం కాదు. ఎవరెవరికి తెలిసివుండొచ్చో వూహించడం, అడగడం, నా ప్రయత్నం వివరించడం, తీరా అంతా అయ్యాక, తెలీదన్న జవాబు వినడం మామూలైపోయింది. ఇంకో సమస్యేమిటంటే, అందర్నీ అడిగే చనువూ వుండదు. కొందరితో కొన్ని విషయాలు ప్రస్తావించలేం. ప్రస్తావించకూడదు కొన్నిసార్లు. ఇదిగో, అట్లాంటి వెదుకులాటలో తగిలాడు కమలాకర్.

## కమలాకర్ - సామాజిక కార్యకర్త

కమలాకర్ నాకు పదేళ్లుగా తెలుసు. కానీ తనకి సూర్యుడు పరిచయం వుండి వుంటాడని నేనెపుడూ అనుకోలేదు. ఇంకెవరితోనో మాట్లాడుతుంటే బయటపడ్డాడు అనుకోకుండా. 'మంచి భోజన ప్రియుడు కదా,' అని నేను ఓ మిత్రుడితో అంటే, కమలాకర్ కల్పించుకున్నాడు.

'భోజన ప్రియుడు అంటే కేవలం మంచి, రుచికరమైన ఆహారం దొరికినపుడు మాత్రమే కాదు,' అని అందుకున్నాడు. అతడు చెప్పింది నిజంగా ఆహారం మీద ఒక ఫిలాసఫీ లాగా అనిపించింది నాకు.

Philosophy of Food

అన్నం దొరికినపుడే బాగా తినాలనే వాడు. 'ఏమో మళ్ళీ ఎప్పుడు దొరుకుతుందో, దొరికినపుడే తినాలి. ఏది వుంటే అది. ఎంత దొరికితే అంత,' అన్నాడు ఒకసారి, ఏదో కేంప్ లో సుష్టుగా భోంచేస్తూ.

ఇంకోసారి, మాకు రెండు రోజులు సరైన భోజనమే దొరకలేదు. బహుశా లోపల తిరిగే వాళ్ళకు ఇది మామూలే కావచ్చు. కానీ నాకు అలవాటు లేదు. బిస్కట్లూ, ఏవో కాయాలూ, పళ్ళూ తింటున్నాం కానీ నాకైతే కడుపు నిండడం లేదు. బయటకు నోరు తెరిచి చెప్పలేనితనం. నోరు చెప్పకపోతే, చెప్పలేకపోతే కళ్ళు చెప్పేస్తాయి.

ఆ రోజు సాయంత్రం వచ్చింది ముందు రోజు బయలుదేరిన ఆహారం. విస్తృతంగా జరుగుతున్న కూంబింగ్ వల్ల అన్నం తీసుకొచ్చే టీం రాలేదు. అందరి ప్రాణాలు లేచేచోచ్చాయి. కానీ తీరా తినడానికి కూచున్నాక తెలిసింది ఆ అన్నం పాచిపోయిందని. ఆ విషయం ఎవ్వరైనా బయటకి అనే లోపలే తనన్నాడు. 'కొంచెం పాచిన అన్నం ఎంతబాగుంటుందో కదా? కొంచెం బాక్టీరియా చేరి, కొంచెం పుల్ల దానం వస్తుంది. దానికి గానీ, కొంచెం కారం తగిలితే దీనికి మించిన రుచి ఎందులో వుంటుంది. అదిరిపోతుంది,' అన్నాడు.

అంటూనే, తినడం మొదలుపెట్టాడు. నేనూ మొదలుపెట్టాను. నిజమే, ఆకల్తో వుంటే ఏ ఫుడ్డు అయితేనేం, బ్రహ్మాండంగా వుంటుంది. రాత్రి వండింది పొద్దున్న తినను, పొద్దున్న వండింది రాత్రి తినను – అని మొండి పట్టు పట్టే నేను ఆ రోజు పెద్ద పాఠమే నేర్చుకున్నాను. నాకు అర్థం అయ్యిందేమిటంటే, ఒక వేళ నేనే ముందుగా 'పాచి వాసన వస్తోంది,' అని అంటే తినడానికి అందరూ ఇబ్బంది పడతారు. నేనే కాదు, అక్కడ ఇంకెవరూ ఆమాట అన్నా అందరికీ ఇబ్బందే. వండుకునే అవకాశం లేక, ఇంకే ఆహారం లేక ఎంత ఇబ్బంది పడేవాళ్ళో కదా అని అనిపించింది.

మరోసారి తనను కలవడానికి వెళ్ళినపుడు, ఓ రాత్రి తిని పడుకున్నాం. పొద్దున్నే అయిదు గంటలకే కేంప్ ఖాళీ చేసి వెళ్లిపోవాలి. కానీ, రాత్రి మేం తినగా మిగిలిపోయిన అన్నం, కూరలు వుండిపోయాయి. చేతికి దొరికిన అన్నాన్ని అపురూపంగా చూసుకునే వాడు. తన ఆకలి కోసం కాదు. బహుశా, సామూహిక ఆకలిని ఎన్ని వందల సార్లు చూసివున్నాడో గాని, ఒక్క మెతుకు వూరికే పోనిచ్చేవాడు కాదు. బయలు దేరడానికి అందరూ రెడీ అవుతుండగా, అన్నాడు: 'ఎవరైనా తినాలనుకుంటే, తినగలిగితే వున్నది తినెయ్యండి.'

తను కూడా కొంత తిన్నాడు. నాకిది వింతగా అనిపించింది. ఇది గమించేదు కావచ్చు, మేమిద్దరం ఒంటరిగా వున్నపుడు అన్నాడు, 'గెరిల్లా జీవితంలో ఆహారం ముఖ్యమైన అంశం. అంటే, ఆహారం సంపాదించడం ప్రధాన ధ్యేయమని కాదు. దొరికిన ఆహారాన్ని సరిగ్గా వుపయోగించడం చాలా ముఖ్యం. అందులోనూ, దళాళ్ళోకి ఎక్కువగా వచ్చేవాళ్లు సమాజంలోని అట్టడుగు పొరల్లోని వాళ్ళు. ఆహారం విలువ వాళ్ళకి తెలిసినంత మరెవరికి తెలుస్తుంది. ఎందుకంటే, అది దొరకటమే గగనం కదా వాళ్ళకు. అందులోనూ, తొందరగా తిని పనుల్లోకి వెళ్లిపోవడం కూడా వాళ్ళకు అలవాటు అన్నాడు సూర్యుడు,' అని కమలాకర్ అన్నాడు..

అప్పుడే నాకు చైనా యుద్ధ నిపుణుడు సున్ జూ గురించి చెప్పాడు. 'ఎప్పుడైతే నీ సైనికులు బల్లేల్ని పట్టుకుని వాలేరో, అప్పుడు వాళ్ళు ఆకలితో నీరసించి వున్నారని అర్థమని Art of War లో చెప్పాడు. అంటే తోటి కామ్రేడ్ల ఆకలినికూడా గమనించుకోవాలి నాయకుడు. శత్రువు అన్ని రకాల బలవర్ధకమైన ఆహారం తీసుకుంటున్నాడు. మనకు అసలు దొరికేదే తక్కువ దాన్ని మనం జాగ్రత్తగా, బాధ్యతతో చూసుకోవాలన్నాడు.

ఒక్కోసారి వంట సరకులు పూర్తిగా అయిపోవచ్చు లేకపోతే సరిపోకవచ్చు. తెప్పించుకోవడమూ కుదరకపోవచ్చు. అప్పుడు చుట్టూ చూసి ఏ జంతువు దొరికితే అది, కప్పే కావచ్చు లేకపోతే పామే కావచ్చు. వింటూవుంటాంగా కొన్ని దేశాల్లో ఏయే జంతువుల్ని తింటూ వుంటారో. ప్రకృతిలో దొరికేవన్నీ తినగలగాలి. ఎందుకంటే ప్రాణాలు నిలుపుకోవాలి కొట్లాడాలంటే,' అన్నాడు.

అన్నట్టుగానే ఒకసారి, కప్ప మాంసం భోజనం వండించి పెట్టాడు. 'అదిగో చూడు అవతలి గుట్ట మీద కూంబింగ్ జరుగుతుంది. మనమిప్పుడు వండుకోలేం లేదా అన్నం తెప్పించుకోలేం. సులభంగా అయిపోయే వంటలు చేసుకోవాలి. అందుకు ఇలాంటివి గొప్పగా సూట్ అవుతాయన్నాడు.'

Philosophy of health, education

బెంగళూరులో పట్టుకొన్నపుడు తనని బాగా హింసించారు. శరీరాన్ని తుత్తునియాలు చేశారు. అందులో భాగంగా కాలి మడమలకింద కట్టెలతో గట్టిగా కొట్టారు. దాంతో అతను నడవడానికి, చాలా సేపు నిలబడడానికి ఎంతో కష్టమయ్యేది. కానీ, ఆ నొప్పి తనను బాధిస్తున్నట్టు ఎన్నడూ చెప్పేవాడు కాదు. చెప్పడం పక్కన పెట్టు, కనీసం నొప్పి వున్నట్టు కనిపించేవాడు కాదు.

నేను అన్నాను ఒకసారి, 'నువ్వు మళ్ళీ అడవుల్లో తిరగలవని అనుకోలేదెపుడూ. కానీ, మిగతా దళసభ్యులతో సమానంగా ఎంతదూరమైనా నడిచేవాడు. ఒకరోజు నేను కొంచెం పరుషంగానే అన్నాను, కొంత నడక తగ్గించుకోరాదూ, అని.

'నడక ఎలా మానమంటావు. అది మనజీవితం కదా? శరీరాన్ని మరీ అంత పట్టించుకోకూడదు. శరీరాన్ని ప్రకృతికి వదిలెయ్యాలి. జంతువుల్లాగా. చలికీ, ఎండకీ, వానకీ – దేనికీ వెరవకూడదు. మనల్ని నడిపించేది మన తిరుగులేని సంకల్పమే కానీ మన కాళ్ళు కాదు. అయితే, నొప్పులుండవా అని నువ్వడిగితే కాదని ఎలా అంటాను. నొప్పి నొప్పే, నడక నడకే. ఇవేవీ లేవనుకో, కాళ్ళు నొప్పులు రావని గేరంటీ ఏమన్నా వుందా? ఏ కీళ్ల నొప్పులో రావని నమ్మకమేమిటి,' అన్నాడు.

సూర్యుడిలో నాకు అన్నిటికంటే నచ్చిన విషయమేమిటంటే, నేర్చుకోవాలన్న తపన. కొత్త విషయాలు పూర్తిగా తెలుసుకోవాలని, అర్థం చేసుకోవాలని అనుకునేవాడు. జైల్లో వున్నపుడు, ఆయుధ చట్టాల గురించి పుస్తకాలు తెప్పించుకున్నాడు. లాయర్లెవరైనా చట్టాల్లోని సెక్షన్లను సరిగా ప్రస్తావించకపోతే, లేకపోతే అసలే పట్టించుకోకపోతే చెప్పేవాడు. ఈ సెక్షన్లలో ఏముందో, ఏ తీర్పుల్ని ప్రస్తావించవచ్చో చెప్పేవాడు.

'నువ్వు చదువుతున్నావేమిటి, ఇవన్నీ? రాజ్యాంగం, చట్టాలూ..,'

వ్యాసం

# రాజ్యంపై, పితృస్వామ్యంపై బహుముఖాలుగా పోరాడుతున్న దండకారణ్య ఆదివాసీ మహిళలు!

(2)

- ఎం. రత్నమాల

(...మార్చ్-ఏప్రిల్ సంచిక తరువాయి)

నిర్బంధ శిబిరాలు 10, 12 నుంచి 15 సంవత్సరాల బాలికలతో 50 ఏళ్ళ నడీడు మహిళల వరకు అందర్నీ ఎస్.పి.ఓలు, సల్వాజుడుం, మొదలుకొని అధికారుల వరకు నిర్బంధంగా లైంగికంగా అన్ని రకాల పనులకు వాడుకుంటున్నారని అర్థం అయింది. ఒకవేళ ఎవరైనా కళ్ళు గప్పి పారిపోతే వెంటాడి, వెంటాడి వెతికి పట్టుకొచ్చి శిబిరాల్లోలోకి తెచ్చి నిర్బంధిస్తున్నారని మహిళలు చెప్పారు. విచిత్రమైన దౌర్భాగ్యం కుటుంబాలకు కుటుంబాలను తీసుకొచ్చి పిల్లల్ని, ఆడవాళ్ళని, మొగవాళ్ళని వేరుచేసి పిల్లల్ని ఒక క్యాంపులో మహిళలల్ని మరో క్యాంపులో పెట్టడం అంతర్జాతీయ మానవ హక్కుల ప్రకటన ప్రకారం (ఫ్యామిలీ) కుటుంబంలో కలిసి జీవించే హక్కు గురించి ఇక్కడ మాట్లాడ్డం అసంబద్ధంగా ఉంటుంది.- ఇట్ల నిర్బంధ శిబిరాల్లోనూ జైల్లోనూ లేక సాయుధ మూకల దాడులకు భయపడి ఇల్లొదిలి అడవుల్లో తలదాచుకుంటూనో ఉన్నందువల్ల మేం వెళ్లిన అనేక గ్రామాలు నిర్మానుష్యంగా కనిపించాయి. మరికొన్ని గ్రామాలు సాయుధ ముఠాలు కూల్చి బూడిద చేస్తే, బూడిద కుప్పలుగా నిర్మానుష్యంగా కన్పించాయి. ఇక రాహత్ శిబిరాల్లో మహిళ దుస్థితి మళ్ళీ మాటల్లోనే 'ఛీ అదేం బతుకు అక్కడే తినడం అక్కడే దొడ్డికి పోవడం ఎక్కడ చూసినా రోత విపరీతంగా ఈగలు (ఆదివాసీలు పరిసరాలను అత్యంత పరిశుభ్రంగా ఉంచుకుంటారు) 'మగవాళ్ళే (ఎస్.పి.ఓ)లు మహిళల్ని దొడ్డికయినా, స్నానానికయినా తీసుకెల్లేవాళ్ళు. దొడ్డికెల్తున్నా స్నానం చేస్తున్నా ఎదురుగానే నిలబడేవారు. (ఆదివాసీ మహిళలు తోటి మహిళలు ఎదురుగా ఉన్నా అక్కడ మలవిసర్జనకు వెళ్ళరు). రాత్రిపూట ఆడవాళ్ళంతా బట్టలు తీసివేసి టెంట్లలో పడుకోవాలని మాకు గురూజీ (జుడుంనేత) హుకూంజారీ చేశాడని నిర్బంధంగా ఎస్.పి.ఓగా కొన్నాళ్ళు పనిచేసి పారిపోయి వచ్చిన నీలమడుగు గ్రామస్తురాలు జోగి చెప్పింది. ('పచ్చని బతుకులపై నిప్పులు కురుస్తున్న రాజ్యం' రచయిత్రి బి.డి. దమయంతి పేజీలు 35, 36) సల్వాజుడుం అమానుషత్వానికి ఉదాహరణ. "జుడుంలో చేరండి-మాంసం దొరుకుతుంది, మద్యం దొరుకుతుంది, జుడుంలో చేరండి-డబ్బులు దొరుకుతాయి, మహిళలు దొరుకుతారు. ఎందరు భార్యలైనా చేసుకుంటాం-చేసుకుంటాం వంటి నినాదాలు చేస్తూ గ్రామాలలో ఊరేగింపులు చేయడం, మహేంద్ర కర్మ సభల్లో మాట్లాడడం, జుడుం మూకలు ఇదే నినాదాలతో రెచ్చిపోవడం ఇక్కడ సర్వసాధారణం అని ఆదివాసీలు మాకు చెప్పారు. దమయంతి, శబరి రచనల్లో అనేక నిజనిర్ధారణ నివేదికలు కూడా ఈ విషయాల్ని ప్రజలు చెప్పినట్లు నిర్ధారించాయి. అంతే కాదు వయసు వావి వరుసలు లెక్కచేయకుండా సామూహిక లైంగిక బలత్కారాలు సాయుధ ముఠాల దిగజారుడుకు పరాకాష్ట. బైరాంగడ్‌కు చెందిన 19 ఏళ్ళ వయసు లేఖతుమ్మిని దినేష్, బన్నాల్ అని ఇద్దరు ఎస్.పి.ఓలు లైంగిక బలత్కారం చేశారు. ఆమె మాటల్లోనే 'అక్కడ చేయి పట్టుకుని మున్నాల్ బలవంత చేయబోయాడు. నేను మోకాళ్ళపై కూర్చుని చేతులు, కాళ్ళను అదిమి పెట్టుకున్నాను. మున్నాల్ అనే ఎస్.పి.ఓ నా కాలుపైనకాలువేసి నాకు సహకరించపోతే గుంత తవ్వి ఇక్కడే నిన్ను ఇక్కడే పాతిపెడతాం 'రేయ్ పలుగూ, పారా పట్రండిరా ఇది వినడం లేదు ఇక్కడే పాతిపెడదాం' అని నాపై అత్యాచారం చేశాడు' 'నువ్వు నాకు వరసకి అన్నవవుతావు కదా' అని నేనంటే"మేం ఎవరినైనా తీసకుపోతాం తల్లినైనా తీసుకుపోతాం' అని బెదిరించాడు. అంటే పాలకులు సల్వాజుడుం ఏర్పాటు చేసి ఆదివాసీలను అమానవీకరిస్తున్న విధానం అర్థం అవుతుంది.

'ఉద్యమ ప్రాంతానికి రాజ్యం తన బలగాలను పంపుతున్నప్పుడు ఆ ప్రాంతపు మహిళలను లైంగిక వస్తువులుగా వినియోగించుకుని హక్కును అనధికారికంగా ఆ బలగాలకు కల్పిస్తోంది- అత్యాచారం అనేది ఎప్పుడూ ఒక భౌతిక రూపంగానే ఉండదు. మానసిక రూపంలో ఒక ఆందోళనగా నిరంతరం వెంటాడే ఒక అభద్రతగానూ ఉంటుంది. అంటే అది నిరంతరం ఒక బెదిరింపుగా హెచ్చరికగా ఉంటుంది. అందువలన సల్వాజుడుంలో భాగంగా అత్యాచారానికి గురైన మహిళలు, శారీరక మానసిక హింసను అనుభవిస్తే అత్యాచారానికి గురవుతామేమోనన్న ఆందోళనతో, భయంతో దాదాపు ఇక్కడి మహిళలందరూ దినదినగండంగా బతుకు వెళ్ళదీశారు. ఈ ఆందోళన భయం కేవలం మహిళలకే పరిమితం కాలేదు తమ అక్కల్లో, చెల్లెళ్లో తల్లుల్లో భార్యల్లో బిడ్డల్లో అత్యారానికి గురి అవుతారేమోనన్న భయం

---

అని అడిగేనొకసారి.

'తప్పకుండా చదవాలి. చదివి కనీసం నువ్వు రాసుకున్న వాటినైనా అనుసరించు, గౌరవించు అని వాళ్ళకు చెప్పాలి. ఇవేవో, వాళ్ళు దయతలచి, జాలితో ఇచ్చినవి కావు. ప్రజలు కొట్లాడి సాధించుకున్నవి. వాటిని అనుభవించే హక్కు వాళ్ళకున్నది. ఇవి కూడా లేకుండా చేస్తున్నది రాజ్యం, పోలీసులు,' అన్నాడు.

ఒక్క 'లా' పుస్తకాలే కావు. వైద్య శాస్త్రానికి సంబంధించిన పుస్తకాలు కూడా చదివేవాడు. తనకు నచ్చే చదివాడని కాదు, పార్టీకి, ప్రజలకు అవసరమని తను అనుకుని చదివాడు.

'నువ్వు విద్యార్థివి అయితే నీ సబ్జెక్ట్స్ పై పూర్తి అవగాహన తెచ్చుకోవాలి. నువ్వు టీచర్ వి అయితే నీ సబ్జెక్ట్ మీద పూర్తి సాధికారతతో పాటు, అది విద్యార్థులకు ఎలా బోధపర్చాలో తెలిసి వుండాలి. నువ్వు డాక్టర్ వి అయితే శరీరపు సంగీతం మీద పట్టువుండాలి. నాడి చూసి చెప్పేస్తారు కొందరు మూలికా వైద్యులు నువ్వే జబ్బుతో బాధ పాతుడున్నావో. మరి ప్రజలకోసం పనిచేసే వారికి, వాళ్ళ సమస్యల మీద ఎంత అవగాహన వుండాలి. అందుకే అధ్యయనం మనకు ప్రధాన వనరు,' అన్నాడు.

(ఇంకా ఉంది) 

పురుషులకూ ఉంది. (ఈ విషయాలు 2006 అక్టోబర్‌లో వెళ్ళిన నిజ నిర్ధారణ కమిటీకి కూడా చెప్పారు. గ్రామాల్లో ఉంటేదాడులు చేస్తారన్న భయంతో కుటుంబాలతో అడవుల్లోకి వెళ్ళి తలదాచుకుంటే అక్కడికీ వెతుక్కుంటూ వచ్చి దాడులు చేస్తున్నారని, అందువల్ల ఊర్లో ఉన్న, అడవిలో తలదాచుకున్నా దాడుల భయంతో కంటిమీద కునుకు లేకుండా పోయిందని రాత్రిళ్లు వంతులవారి కాపలా ఉండాల్సి వస్తోందని చెప్పారు. ఎన్ని విధాల జాగ్రత్తగా ఉన్నా ఎప్పుడో ఒకప్పుడు ప్రభుత్వ సాయుధ ముఠాలకు బలగాలకు దొరికిన సందర్భాల్లో హింస చెప్పుకోలేనంత సాధ్యం కానంతగా ఉందని చెప్పారు. 2009 అర్ధరాత్రి దాదాపు 300 మంది పోలీసులు (కోబ్రా దళాలు), గచ్చంపల్లి గ్రామంపై దాడి చేశారు. ఆడమాల్(వయసు 40) జోగి భార్యా భర్తలను పట్టుకుని ఒంటిమీద బట్టలను కత్తితో చింపి లాగిపారేసి ఒంటిమీద నూలు పోగులేకుండా నగ్నంగా ఉన్నవాళ్ళను కొట్టుకుంటూ తన్నుకుంటూ ఊర్లోకి తీసుకుపోయారు. ఇదేవిధంగా జోగాల్, మంగి అనే వృద్ధులైన (60 ఏళ్లు) భార్య భర్తల్ని, చూలాల్ ను అతడి కొడుకు జోగాల్‌ను, కోసోజ్జే అనే 40 ఏళ్ళ స్త్రీని ఆమె కూతురు12 సంవత్సరాల వయసు భామేను అందర్నీ బట్టలు కత్తుల్తో చించి ఊడదీసి నగ్నంగా కొట్టుకుంటూ ఊరిమధ్య సామూహిక సాంప్రదాయ నృత్యాలు చేసే మైదానంలో వాళ్ళను పోగేసి హింస కొనసాగించారు. ఛూలాల్‌నికాల్చి చంపారు. ఆడమాల్ పురుషాంగాలను కత్తితో కోశారు. జోగాల్, అండమాల్ ఇళ్ళను తగులబెట్టారు. జోగాల్‌ను కాల్చి చంపారు. ఈహత్యాకాండ ను ముగించి ఆడవాళ్ళను కొట్టుకుంటూ ఊరి బయట పొదల్లోకి తీసుకెళ్ళి అత్యాచారం చేసి ఆ తర్వాత నిర్బంధ శిబిరాలకి లాక్కునిపోయారు.(గ్రీన్‌హంట్ పేరుతో ఆదివాసీలపై వేట, కోబ్రాల తూటలకు బలైపోయిన ఆదివాసీలు రచన దమయంతి పేజీలు 12 నుంచి 15)

ఈ జీవన్మరణ పరిస్థితిని ప్రజలు ప్రతిఘటిస్తున్నారు. ఈక్రమంలో పార్టీ గెరిల్లాలు ప్రజాసైన్యం (మిలీషియా) గ్రామ కమిటీలు ఐక్యంగా 600 మంది 2006 జూలై 10వ తేదీన ఎర్రబూరు క్యాంపుపై దాడి చేశారు. 33 మంది ఎస్.పి.ఓలు ఒక మహిళా ఎస్.పి.ఓ సహా ఈ దాడిలో మరణించారు. కొందరు హక్కుల ఉద్యమకారులు ఈ దాడి జరపడంపై ఆందోళన చెందారు. అయితే అక్కడ ఆదివాసీ ప్రజలు మాత్రం ఈ దాడిని సమర్ధించారు. ఈ దాడి తర్వాత ఎర్రబోరు నిర్బంధ శిబిరంపై మావోయిస్టుల దాడి తర్వాత జుడుం మూకలు, సాయుధ బలగాలు గ్రామాల్లోకి వచ్చి ప్రజల్ని నిర్బంధంగా తీసుకుపోయి క్యాంపుల్లో పెట్టడం కొంత వరకు తగ్గిందని ప్రజలు చెప్పారు. నిర్బంధ శిబిరాల్లోంచి తప్పించుకుని పారిపోయిన వాళ్ళను గతంలో మాదిరిగా వెతకటం,వెంటాడ్డం కూడా తగ్గిందని చెప్పారు. ఆ తర్వాతి క్రమంలో ఆదివాసీ ప్రజలుకూడా ఆత్మవిశ్వాసంతో సాయుధ ముఠాలపై, సాయుధ బలగాలపై ఎదురు తిరిగి ప్రతిఘటిస్తున్న ఎన్నో సంఘటనలు ఉన్నాయి-'గోర్నం గ్రామానికి చెందిన అబ్బమంగ్లి మూడుసార్లు పోలీసులతో దెబ్బలు తిన్నది. ఈమె ఒకసారి మాడు ఊర్ల మహిళలతో కల్సి బీజాపూర్‌కు సరుకుల కోసం వెళ్ళింది. అప్పుడు వీళ్ళందర్ని పట్టుకొని శిబిరానికి తీస్కెళ్ళారు. బాగా కొట్టారు. చెంపదెబ్బలు చెప్పుదెబ్బలు కొట్టారు. మంగ్లీకి అప్పుడు చిన్నపాప కూడా ఉంది. వీళ్ళు కొనుకొచ్చుకుంటున్న బియ్యం వగైరా సామాన్లన్ని గుంజుకుని వెళ్ళిపొమ్మన్నారు. ఆ తర్వాత వీళ్ళంతా లేచి నిలబడ్డారు. ఎట్లయినా బియ్యం తీస్కపోవాలె. వీళ్ళకు ఇవ్వడానికి రాలేదుకదా వీళ్ళకు సరుకులు ఇచ్చిపోతే మనం ఎట్ల బతుకుతాం? అనుకున్నారు. పోయి సామాన్లు జుడంమూక చేతుల నుంచి లాక్కోవడానికి చూశారు. కాని జుడం మూక ఆ సామాన్లు ఇవ్వలేదు పైగా బరిగెలతో అందర్ని కొట్టారు. అట్లా వీళ్ళంతా పోరాడినప్పటికీ ఓటమితో తిరుగుముఖం పట్టారు.కానీ ఈ ఓటమి వీళ్ళతో నిరాశను తీసుకురాలేదు. పైగా విజయం కోసం మరింతగా పోరాడాలనీ పట్టుదలను పెంచింది. మరోసారి వీళ్లు చేసిన సాహసం వాళ్లగొంతుతోనే వినిపిస్తాను. 'ఒకసారి మేం, బీజాపూర్‌కు వెళ్తుంటే దారిలో పోలీసులు ఎదురై కొట్టారు. మాతోఉన్న భర్త చనిపోయిన ఒకమ్మాయిని క్యాంపులోకి తీసుకెళ్ళారు. మేమంతా అడ్డుపడ్డాం మమ్మల్ని కొట్టి ఆ అమ్మాయిని మళ్ళీ లాక్కుని పోయారు. ఆ తర్వాత మేం మనం ఊరుకోవద్దు క్యాంపు వెళ్దాం అనుకున్నాం. చంపితే అందరం చద్దాం. కాని దానిని ఒక్కదాన్ని వదిలివెళ్ళొద్దు

(...60వ పేజీ తరువాయి)

అన్నారు. ఫ్రాయిడ్, ఎడ్వర్డ్ మెకర్డీ వంటి రచయితలు డావిన్సీ మనస్తత్వం, కళాతత్వంపై చేసిన సూత్రీకరణలనూ వివరించారు. ఇవన్నీ ఒక ఎత్తయితే డావిన్సీ చిత్రించిన 'చిచీలియా గల్లెరనీ', 'లూక్రీజియా క్రివెలీ', 'జీనెవ్రా డి బెంచీ', 'సెయింట్ ఆన్, మేరీ, క్రీస్తు', 'అంగీయరీ యుద్ధం' వంటి వర్ణ చిత్రాలను, అందులోని పాత్రధారులను వివరించిన తీరు మరో ఎత్తు. ఆ చిత్రాలను ఎవరు, ఎందుకు వేయించుకున్నారు? అవి గతంలో ఇతర చిత్రకారులు వేసిన వాటికి ఏ విధంగా భిన్నం? వాటికి కాలగతిలో ఏ గతి పట్టింది? వంటి అంశాలను హృద్యంగా వివరించారు. మోనాలిసాను 'అష్టవిధ', త్రివిధ' నాయికలతో పోల్చడం, ఆమె నవ్వులో 'గాంధార బుద్ధుడి' నవ్వును, 'బేలూరి శిలాకన్యల' లేనగవులను వెతకడం దీనికి ఒక ఉదాహరణ.

వివిధ శాస్త్రాల్లో డావిన్సీ పరిశోధనలను వివరిస్తూ అతడు 'ఎగిరే యంత్రం' (విమానం) ఆవిష్కరణలో ఎన్ని తిప్పలు పడ్డాడో చెప్పారు మోహన్. సాగునీటి కాలువలు, వంతెనలు వంటి ఇంజినీరింగ్ పనుల్లో, వాస్తు, అనాటమీల్లో డావిన్సీ కృషిని కూడా వివరించారు. మొత్తంగా డావిన్సీని అతని స్థలకాలల నేపథ్యంలో నిలుపుతూ పాఠకులకు అతని జీవితాన్ని, కళను చదవచక్కగా పరిచయం చేశారు. డావిన్సీ జీవితంలో పెద్దగా వెలుగులోకి రాని ఎన్నో కోణాలను కూడా ఇందులో పొందుపరచారు. డావిన్సీ జీవకారుణ్యం, చిన్నప్పటి 'డేగ' కల, సవతి తమ్ముడు యుద్ధంలో చనిపోవడం, మరో సవతి తమ్ముడు తన కొడుక్కి డావిన్సీ పేరు పెట్టబోతే బంధువులు పడనివ్వకపోవడం, తల్లి కేటరినా అతని ఇంట్లో ఉనికి బయటపడకుండా బతకడం, డావిన్సీకి శిష్యులతోఉన్న అనుబంధాలు, డావిన్సీ డబ్బు కోసం మిలాన్ డ్యూక్‌ను వేడుకోవడం, భారతదేశం గురించి అతని కబుర్లు, 'నీ జన్మ నక్షత్రాన్ని నమ్ముకోకు' అని సుద్దులు చెప్పిన అతడు జాతకం చెప్పించుకోవడం, పూలను ప్రేమించిన అతడు, కుత్తుకలు తరిగే మారణ యంత్రాలకు రూపకల్పన చేయడం... వంటి ఎన్నో ఆసక్తికర సంగతులను మోహన్ హాయిగా అక్షరాలకెక్కించారు. కళలపై, ఇతరేతర సృజనాత్మక వ్యాపకాలపై, చరిత్రపై ఆసక్తి ఉన్న ప్రతిఒక్కరూ చదవాల్సిన పుస్తకమిది. ఇతర ప్రఖ్యాత కళాకారులపైనా మోహన్ ఇలాంటి పుస్తకాలు తీసుకురావాలని ఆశిస్తూ..



పత్రికా ప్రకటన :

## తెలంగాణ ఉద్యమంపై దాడి!

2009లో ప్రారంభమైన మలిదశ ఉత్తరార్థ తెలంగాణ ఉద్యమంలో నేను క్రియాశీలంగా పాల్గొంటున్నాను. తెలంగాణ పది జిల్లాల్లో అనేక గ్రామాలకు వెళ్ళాను. గ్రామ చైతన్య యాత్రల్లో పాల్గొన్నాను. ఆ చైతన్యంతో కవిత్వమూ, వ్యాసాలుకూడా రాశాను. మా యూనివర్సిటీలో మేం వెళ్ళకంటే ముందు తెలంగాణ పదం ఉచ్చరించడానికే భయపడే వాతావరణం ఉండేది. ఇవాళ తెలంగాణ ప్రాతిపదికగా ఏ సమస్య జరిగినా మేం ముందు నిలబడి కోట్లాడుతున్నాం. శ్రీకృష్ణ కమిటీ నివేదించిన ఎనిమిదవ (రహస్య) అధ్యాయాన్ని అమలు చేయడం ప్రారంభించి, కొనసాగిస్తోంది ప్రభుత్వం. ముఖ్యంగా ఇవాళ ఉద్యమానికి వెన్నెముకగా నిలిచిన విద్యార్థుల్ని అణచివేసే కుట్రలో భాగంగానే అరెస్టులు, అక్రమ కేసులు, అసత్య ప్రచారాలు చేస్తున్నారు. ఇది నా మీద చేసిన ఆరోపణగా నేను భావించడం లేదు. మొత్తం తెలంగాణకు సంబంధించిన సమస్యగా భావిస్తున్నా. ఎన్నటి నుండో నన్ను అక్రమకేసుల్లో ఇరికించాలని చూస్తున్న పోలీసులు మొన్న మా యూనివర్సిటీకే చెందిన పృథ్వి అనే అబ్బాయి ఒక మహిళా మావోయిస్టుతోపాటు దొరికాడని, ఆయన ఉదయభాను ప్రసంగాల ద్వారా ఇన్‌స్పైర్ అయ్యే ఉద్యమంలో చేరాడని పత్రికల ముందు, ఎలక్ట్రానిక్ మీడియా ముందు ప్రకటించారు. నిజానికి మా యూనివర్సిటీలో చాలా సెమినార్లు, మీటింగ్‌లు, చర్చలు జరుగుతుంటాయి. వందలాది మందితో భాగంగా నేనూ పాల్గొంటున్నాను. పదుల సంఖ్యలో మాట్లాడేవారిలాగే నేనూ మాట్లాడుతున్నాను. అంతేగాని మావోయిస్టు రాజకీయాలెన్నడూ నేను మాట్లాడలేదు. అట్లా మాట్లాడే అవకాశం కూడా మాలాంటి యూనివర్సిటీలో ఉండదు. ఇది కేవలం పోలీసుల కుట్ర, దుష్ప్రచారం. దీన్ని మేం ఖండిస్తున్నాం. తెలంగాణ ఉద్యమం ఇలాంటి బెదిరింపులకు భయపడదు, ఆగిపోదు. తెలంగాణ రావాలి. విరసం వర్ధిల్లాలి. జై తెలంగాణ.

*6 జూన్ 2013* — *- డి. ఉదయ్‌భాను*

అనుకున్నాం ఆ అమ్మాయిని తీసుకెళ్ళిన గుంపు నాయకుడు బుద్రాం అనే ఎస్.పి.ఓ మేం క్యాంపుకెళ్ళి 'బద్రాం ఏడి' అని అడిగాం, 'వాడు లేదు ఇంటికి వెళ్ళాడు' అని చెప్పారు.మాతో వచ్చిన అమ్మాయిని తీసుకొచ్చారు. ఆమెను వదిలి మేం వెళ్ళం. ఆమె పిల్లకు ఎవరు పాలిస్తారు? అన్నాం. బాగా తిట్టాం క్యాంపంతా వెతికాం కాని కనపడలేదు. మేం మళ్ళీ ఊర్లోకి వెళ్ళి ముసలోళ్ళతో సహా అందర్ని పోగేసి క్యాంపు తీసుకునిపోయాం, నాలుగు రోజులు క్యాంపులోనేఉండి లడాయి చేశాం. క్యాంపులో లేదు స్టేషన్‌లో లేదు ఎక్కడ పెట్టారు? అని లడాయి చేశాం. వెళ్ళిపొమ్మని బెదిరించినా మేం కదల్లేదు. అప్పుడు స్టేషన్లో ఉండే ఎస్.ఐ. వచ్చి ఎవరు తీసికెళ్ళారు? అని అడిగాడు. బుద్రాం, పూనుం రాము కొర్సికమ్ము, వేకూ సొంవారో తెచ్చారని చెప్పాం ఎంతమంది తెచ్చారో అంతమంది పేర్లు చెప్పాం. తర్వాత స్టేషన్లో క్యాంపులో మళ్ళీ వెతికాం. క్యాంపులో ఉన్న మిగతా వాళ్ళు కూడా బాగా తిట్టారు. 'దారిలో వెళ్తున్న వాళ్ళను ఎందుకు పట్టుకున్నారు? పట్టుకుంటే ఠాణాలో పెట్టకుండా క్యాంపులో పెట్టకుండా ఎక్కడి తీసుకెళ్ళారు? అన్నారందరు. పట్టుకెళ్ళిన ఎస్‌పిఓలను మా ముందుకు తీసుకువచ్చారు. 'ఆ పిల్ల ఏది' అని అడిగితే 'వెళ్ళింది' అని చెప్పారు. దానితో మేం వెళ్ళి చుట్టాలిండ్లల్లో వెతికాం. దొరకలేదు మళ్ళీ స్టేషనకు వెళ్లాం అంతటా వెతికాం. దొరకలేదు. అని మళ్ళీ గొడవ చేశాం. చివరకు రహస్యంగా దాచిన ఆమెను వదిలి పెట్టారు. ఎస్.పి.వోను చెప్పుతో కొట్టమన్నాడు. (అధికార్లు మంచివాళ్ళే ఎస్.పి.ఓలు కింది పోలీసులే చెడ్డవాళ్ళు అనే భావన కల్పించడం కోసం పోలీసులు ఒక్కోసారి ఇలాంటి ట్రిక్కులు చేస్తారు) నేను కొడుదామనే అనుకున్నా కాని పక్కనున్నామె వద్దంది. మళ్ళెప్పుడన్నా వాడు కసి తీర్చుకుంటాడు అని ఆమె చెప్పింది'-

గొర్నం గ్రామానికి చెందిన 50 సంవత్సరాల వయసు నడీడు మహిళ ఒక జుడుం గుండాలతో కలబడిన సంఘటన 'మేం బీజాపూర్ నుంచి వస్తుంటే ఒక గూండా (జుడుం) మమ్మల్ని పట్టుకుని కొట్టాడు. నాకు బాగా కోపం వచ్చింది. నేను వాడి మీద కలబడి వాడిని కింద పడేశాను. వాడు నా మెడ పట్టుకుంటే నేను వాడి మెడ పట్టుకున్నావాడు రాయి తీసుకుంటే నేనురాయి తీసుకున్నా వాడు బూతులు తిడితే నేనూ బూతులు తిట్టా వాడితో కోట్లాడేటప్పుడు నా బట్టలు ఊడిపొయ్యాయి. అయినా నేను వెనక్కి తగ్గలేదు. నేనెందుకు సిగ్గుపడాలి? నగ్నంగానే దాడిలో కొట్టాడాను. కొద్ది సేపటికి వాడు పారిపోయాడు. వాడు పారిపోయాకే నేను బట్టలు కట్టుకున్నా నాతోపాటూ ఉన్న మహిళలందరూ ఊరికే చూశారు. కానీ వాళ్ళూ కూడా వస్తే వాన్ని చంపేసేవాళ్ళం. ఒక మంచిపని జరిగేది' (మండుతున్న గ్రామాలు రచయిత్రి బి.డి దమయంతి పేజీలు 85 నుంచి 87) ఈ రెండు ఘటనల్లో మనకి అర్థం అయ్యే విషయం జీవన్మరణ పోరాటంలో భాగంగా ఆదివాసీ మహిళల్లో పెరుగుతున్న ప్రతిఘటనా శక్తి, నిర్మాణాత్మక పోరాట దక్షిత, సంఘటిత శక్తిని సమన్వయం చేసుకొని అంతిమ విజయం దాకా కొనసాగించే ప్రయత్నం కనపడుతుంది. ఉద్యమ ప్రాంతాల్లో ముఖ్యంగా దండకారణ్యంలో లక్షన్నర సభ్యత్వం కలిగిన క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన్ (సంఘటన) ఎ.కె.ఎం.ఎస్. ప్రభావంతో ఆదివాసీ మహిళల్లో పేరుగుతోన్న సంఘటిత నిర్మాణాత్మక పోరాట పటిమనిబద్ధత నిన్న, మొన్నటి 'నిర్భయ'దాడుల పట్ల దేశవ్యాప్తంగా పెల్లుబికిన ఆందోళనలో ఎంతమాత్రం కనిపించదు. టీవీ ఛానల్ స్పాన్సరింగ్‌తో 'నెక్లెస్' మెరుపుల్లో డాన్సులు చేసి 'రాత్రులు మావే' అంటూ నినదించి వెళ్ళిపోయిన ప్రదర్శనలో పాల్గొన్న కొందరు ఆ తర్వాత ప్రదర్శన జరిగిన తీరుపట్ల ఎంతో అసంతృప్తి ఆవేదన వ్యక్తం చేశారు. కొన్ని సంవత్సరాలు మహిళల సమస్యలపై తక్షణ స్పందనలు ఉన్నప్పటికీ ప్రతి ఆందోళన దేశవ్యాప్తంగా జరుగుతున్నప్పటికీ గాలి వాటంగా నిర్మాణాత్మక లక్ష్యం, దశదిశ లేకుండా ఎవరి దారివారిదే, ఎవరిగోల వారిదే అన్న తరహాలో జరుగుతున్న విషయం శ్రద్ధగా పరిశీలిస్తే అర్థం అవుతుంది. 1970 దశకం చివరి నుంచి 1980 దశకం ప్రథమార్థం వరకు దాదాపు అయిదు సంవత్సరాలకు పైగా (1978 నుంచి 1983 వరకు) దేశవ్యాప్తంగా నిర్మాణాత్మకంగా సంఘటితంగా

సమన్వయంతో ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మహారాష్ట్ర బెంగాల్, తమిళనాడు మొదలైన రాష్ట్రాల్లో ఎన్.జి.ఓలు మొదలుకొని వామపక్ష పార్టీలు, అధికార పాలకపక్ష పార్లమెంటరీ పాలకవర్గాల పార్టీలు, మార్క్సిస్టు-లెనినిస్టు మావోయిస్టు ఆలోచనా విధానం నమ్మే మహిళా సంఘాలు, మహిళా ఉద్యమకారులు స్వతంత్ర (ఎటానమస్) స్త్రీవాద మహిళా సంఘాలు, స్త్రీవాదులు, హక్కుల సంఘాలు మహిళలు ఐక్యంగా అనేక కార్యక్రమాలు నిర్వహించి లైంగిక బలత్కార చట్టంలో ప్రభుత్వంతో తాము కోరిన విధంగా (ప్రత్యామ్నాయ ముసాయిదా చట్టం ప్రతిపాదించి) చట్టం తెచ్చే వరకు నిరంతరం పోరాడిన నిబద్ధత, నిర్మాణ దక్షిత పోరాట పటిమ 1980 దశకం తర్వాత కనిపించడం లేదు. ఇప్పుడు భారతదేశంలో (దండకారణ్య ఆదివాసేతర ప్రాంతంలో, ఈశాన్య రాష్ట్రాల కాశ్మీరు కాకుండా) వేల సంఖ్యలో రకకాల మహిళా సంఘాలు ఉన్నాయి. కానీ నిర్మాణాత్మకమైన సంఘటిత మహిళా ఉద్యమంకాని, స్త్రీ పురుష సమానత్వం పట్ల స్పష్టమైన అవగాహన దృక్పథం మాత్రం లేదని స్వప్నిక, జ్యోతిసింగ్ పాండే, అయోషాలపై లైంగిక దాడుల సందర్భంగా జరిగిన ఆందోళనల తీరుతెన్నులు క్షుణ్ణంగా పరిశీలిస్తే అర్థం అవుతుంది. ఏ సమస్యకు ఆసమస్య మాత్రమే ఎవరి సమస్య వారి సమస్యగానే చూసే పాక్షిక దృష్టికోణం. కొన్ని సంవత్సరాలుగా నూతన ఆర్థిక విధానాలు, సరళీకరణ, ప్రపంచీకరణ ప్రభావంతో పరాయీకరణ చెందుతున్న అనే అస్తిత్వ ఉద్యమాల్లో ఎవరి దారి వారిదే ఎవరిగోల వారిదే అన్న ధోరణి బలంగా వేళ్ళూనుకున్నది. విడివిడిగా పైకి కనిపించే వాటి మధ్య లోతు పరిశీలిస్తే తప్ప కనిపించని అంతర్లీన సంబంధం ఉంటుంది. (మార్క్స్) అన్న విషయాన్ని ఈ ఉద్యమాలు పరిగణనలోకి తీసుకోవడం లేదు. ఎవరి యుద్ధాలు వారు చేసుకుంటూనే అందరూ కల్సి చేయాల్సిన ఉద్యమాల్ని పోరాటాల్ని పట్టించుకొనితనానికి దారి తీస్తున్నాయి. ఈ ధోరణి సమస్యని పరిష్కార మార్గదశ దిశలను ఉద్యమాలు పోరాట గమనం-గమ్యాల గందరగోళానికి తావిచ్చి వివిధ పీడిత శ్రేణులను, పీడిత ప్రజాశ్రేణుల్ని ఒకరిపై ఒకరిని శత్రువులుగా మోహరించే దుస్థితికి దోహదం చేస్తున్నది. అంతిమంగా ఉద్యమాల, పోరాటాల ఫలితాలను సమస్య పరిష్కారానికి కాకుండా సమస్యను మరింత జటిలంచేసే విధంగా. రాజ్యం మలచుకోగలుగుతున్నది. ప్రతి సమస్యకి బహుళ కోణాలుంటాయని పరిష్కారం కోసం సమగ్ర దృక్పథంతో మూలాల్లోకి వెళ్ళి కారణాలు వెతకాలన్న దృష్టికోణం పాక్షిక ఉద్యమాలకు ఉండదు అందువల్ల కొన్ని సంవత్సరాలుగా ఈ పాక్షిక దృక్కోణం ఉద్యమాలు ఎప్పుడూ పరిష్కారాల దిశగా నడుస్తున్నాయి. అందుకే ఢిల్లీలో జరిగిన జ్యోతిసింగ్‌పాండే సామూహిక లైంగిక బలత్కారం పట్ల ఆందోళన సందర్భంగా కఠిన శిక్ష ఉరిశిక్ష, సైంటిఫిక్ విధానం ద్వారా నపుంసకులని చేయడం వంటి తప్పుడు పరిష్కార మార్గాల గురించిపదేపదే వినపడ్డా వాళ్ళను సరిదిద్దే అవగాహన కల్పించే ప్రయత్నాలు జరుగలేదు. గాలిదుమారంలా ఎగసివద్ద ఉద్యమాలనునిర్మాణాత్మకంగా మలిచే ఏకీకృత సమన్వయ సమగ్ర దృక్పథం కొరవడుతున్నది.

1989-1990లలో కేవలం 20 మంది సభ్యులతో ఏర్పడిన క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన లక్షన్నరకుపైగా సభ్యుల్ని కలిగి ఉండడంతోపాటూ, కరడుగట్టిన తెగ పితృస్వామ్య భావజాలాన్నీ విలువలను తెగపెద్దల పెత్తనాన్నీ సామాజిక దురాచారాలను ఎదిరించే విధంగా ఆదివాసీ మహిళల చైతన్యాన్ని పోరాట పటిమను, సామాజిక రాజకీయ అవగాహనను పెంపొందిస్తూ జనతన సర్కార్ల అధ్యక్ష కార్యదర్శుల స్థాయికి, మిలీషియాలో గెరిల్లా దళాలకి నాయకత్వ వహించే స్థాయికి వాళ్ళను తీర్చిదిద్దింది. స్త్రీ పురుష సమానత్వ భావజాలాన్ని, ఆచరణను స్త్రీలు, పురుషులు మొత్తంగా ఆదివాసీ సమాజానికంతటికీ అలవర్చుతోంది. జనాభాలోనే కాదు అన్ని పోరాట రూపాల్లో జనతన సర్కార్ల ఆధ్వర్యంలో రూపొందుతున్న సమసమాజ నిర్మాణంలో సగభాగంగా సాధికారంగా ఎదుగుతున్నారు ఆదివాసీ సమాజంలో. ఇక్కడ గత 15 ఏళ్ళకుపైగా 33 శాతం రాజకీయ రిజర్వేషన్ల బిల్లు గోడకు కొట్టిన బంతిలా పార్లమెంటు గోడల మధ్య గిరికీలు కొడుతూనే ఉంది. అక్కడ ఆదివాసీ స్త్రీలు బహు భార్యత్వానికీ, బలవంతంగా ఎత్తుకొని పోయి చేసే పెళ్ళిళ్ళు, బాల్య వివాహాలను, రవికలు తొడుక్కోవద్దనే తెగ కట్టుబాట్లను, బహిష్టు సమయంలో ఊరి బయట ఉంచడం వంటి దురాచారాలను ఎదిరించి రూపుమాపుతున్నారు. భూస్వాముల నించి ఆక్రమించిన భూముల్లో, పోడు వ్యవసాయ భూముల్లో మహిళలకు వాటా ఇవ్వడం, భార్యా భర్తలకు ఇద్దరికీ పట్టాలివ్వడం, ఆడపిల్లలకు కూడా ఆ స్థలంలో వాటా, భూమిలో వాటా పట్టాలు ఇవ్వడం వంటి ఎన్నో ఆర్థిక సమానత్వ చర్యలు తీసుకుంటున్నారు. ఆదివాసీ సమాజం స్త్రీలు పురుషులో స్త్రీ పురుషులు సమానం అన్న అవగాహనపెంచడం ద్వారా పురుషులు మొత్తంగా ఆదివాసీ సమాజ సమ్మతిని సాధించడం ద్వారానే ఈ విప్లవాత్మక ఆచరణను సాధ్యం చేయగలుగుతున్నారు. ఇక్కడ స్త్రీలు నాగలి దున్నుతారు,కానీ కళ్లంలోకి రాకూడదు, విత్తనాలు చల్లగూడదు. అట్లనే వేటలో పాల్గొనవచ్చు కాని, వేటలో జంతువును కోసి వాటాలు పంచే 'కర్స జాగ'కి మాత్రం స్త్రీల ప్రవేశిస్తే అరిష్టంగా భావించి అనుమతించరు.. ఇది తప్పని ఆడ మగ అందరూ సమానం. స్త్రీలకు నిషేధిత ప్రాంతాలు అనడం అసమాన భావజాలం అని ఎంత చెప్పినా ఆదివాసీ పురుషులు గత తరం స్త్రీలు అంగీకరించకపోవడం వల్ల, ముందుగా జనతన సర్కార్ల ఆధ్వర్యంలోని సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో, సమిష్టి వేటలో తర్వాత కర్సలో స్త్రీలు అరిష్టం అని చెప్పి నిషేధించిన అన్ని పనుల్లో స్త్రీలను భాగస్వామ్యం చేయడం ద్వారా 'స్త్రీలు పాల్గొంటే అరిష్టం అన్న ఆదివాసీ సమాజ మూఢనమ్మకాల్ని తొలగించడం ద్వారా వ్యక్తిగత వ్యవసాయ పనులలో, ఊరుమ్మడి వేటలో ఇప్పుడు స్త్రీలకు నిషేదిత ప్రాంతం అనేది లేకుండా చేయగలిగారు. 'ఆదివాసీ మహిళ ఈ రోజు స్వేచ్ఛగా తన భావాలను అభిప్రాయాలను చెప్తున్నది. గ్రామాలలోని మహిళా సంఘాల్లో జనతన సర్కార్లలో, మిలీషియాలో, నిర్మాణ, రాజకీయ ఆర్థిక సామాజిక విషయాల్ల భాగస్వామ్యం నెరుపుతున్నది. వర్గపోరాటంలో సాయుధంగా కదులుతున్నది. నూతన ప్రజాస్వామిక రాజకీయ చైతన్యంతోపాటు, గెరిల్లా యుద్ధంలో సైనికులుగా నాయకురాళ్ళుగా మహిళలు ఎదిగారు' (దండకారణ్యంలో మహిళలపై రాజ్యహింస ప్రతిఘటన-కూర్పు శబరి-ప్రచురణ విరసం ; పేజీ 39)-

మహిళా సర్పంచులు, మండలాధ్యక్షుల్ని భర్తలు భార్యల్నిడమ్మీల్ని చేసి ఆ పదవులకు చెందిన కుర్చీల్లో తామే కూర్చుని వ్యవహారాలు నడిపిస్తున్న దండకారణ్యేతర సమాజంతో పోలిస్తే దండకారణ్య మహిళా ఉద్యమం, అక్కడి జనతన సర్కార్లు, స్త్రీ పురుషులంతా సమానత్వ సాధన స్త్రీల సాధికారత దిశగా గొప్ప ముందడుగు. అద్భుత ఆచరణాత్మక విజయం. అనుసరనీయ ఆదర్శ నమూనా.

*(అయిపోయింది)* 

ARUN... ...ural Telugu Monthly Journal of Revolutionary Writers' Association (VIRASAM)
• RNI Regn.No.21152/72 • Published on 10/08/2013 299 - June-July, 2013

“ఈ యుద్ధంలో చావాల్సి వస్తే
ఒకసారి కాదు, నూటన్నొక్కసార్లు
చావ సిద్ధమవుతున్నాం
ఈ యుద్ధంలో కొనసాగాల్సి వస్తే
నూరు సంవత్సరాలే కాదు
వెయ్యిన్నొక్క సంవత్సరాలు
బతకాలని కూడా కోరుకుంటున్నాం
విప్లవం మా పేరు!
విముక్తి మా ఊరు!!”

- కామ్రేడ్ గంటి ప్రసాదం

Edited, printed, published and owned by Chalasani Prasad, H.No. 33-13-3, Seetharampuram, Vijayawada - 520 002
Printed at Nagendra Printing Press, Vijayawada - 520 002.
Editor : Chalasani Prasad



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KLVA101M164 |
|---|---|
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Bhagyasree |
| స్కాన్ చేసినది | Afsar |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |